సంక్షిప్తసంస్కృతాంధ్ర

# శతావధాన శతపత్రము

ప్రచురణ




9/3/94.

స్వర్ణకంకణ విభూషిత శతావధాన సామ్రాట్

"శతావధాని చూడామణి"

## శ్రీ మాడుగుల నాగఫణిశర

ప్రచురణః 5 ,
ప్రథమ ముద్రణః 1500 ప్రతులు -1992 అక్టోబర్

ప్రధాన సంపాదకులుః మధుర కవి :
శ్రీ శ్రీపాద శ్రీరామ మూర్తి - శ్రీ శ్రీ శ్రీ
సహాయ సంపాదకులు
శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు - గాంధి

ముఖ చిత్ర రచనః శ్రీ యండమూరి శివాజీరావు - కాకినాడ

ప్రతులకు
శ్రీపాద శ్రీరామమూర్తి
శ్రీ శ్రీ శ్రీ సాహిత్య నికేతన్
హౌస్ నెం.9-93, వెంకట రమణ నగర్, ఇంద్రపాలెం - కాకినాడ - 6

మూల్యముః రూ.35/-లు.

ప్రచురణ కర్తః
శ్రీ పైండా శ్రీరామకృష్ణ మూర్తి. బి.కామ్

అధ్యక్షులు
శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యా పీఠం (రిజిష్ట
స్థాపితం - 1967, కాకినాడ.

ముద్రణః శ్రీ సాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
ఎస్.ఆర్.ఎమ్.టి ప్రక్కన, మెయిన్ రోడ్, కాకినాడ

# విషయానుక్రమణిక

సంపూర్ణ సంస్కృతాంధ్ర

# శతావధాన శతపత్రము




## శ్రీ హైండా శ్రీరామకృష్ణమూర్తి

(శతావధాన కార్యక్రమ సారధి)

కాకినాడ

# కృతజ్ఞతాంజలి

రసజ్ఞ శేఖరులకు, సారస్వత ప్రియులకు, సహృదయ సార్వభౌములకు, కవి పండితులకు, పృచ్ఛకమహాశయులకు, సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన నిర్వహణ ప్రధాన సారథులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి బి కామ్, గారికి, శతావధాని శ్రీ మాడుగులనాగఫణి శర్మగారికి, ప్రయోక్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి ప్రారంభోత్సవ సభాధ్యక్షులు శ్రీ జ్యోతుల సీతారామమూర్తి - మాజీ మునిసిపల్ ఛైర్మన్ గారికి, జ్యోతి ప్రజ్వలనం గావించిన శాసన సభ సభ్యులు శ్రీ మల్లాడి స్వామి గారికి, సభ ప్రారంభం గావించిన సూపర్ బజార్ చైర్మన్ శ్రీ వై డి రామారావు గారికి, సన్మానమహోత్సవ సభకు అధ్యక్షత వహించిన జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ సి ఎస్ గోపీనాథరెడ్డి గారికి - ఫర్స్టుఎడిషనల్ సెషన్సు జడ్జి శ్రీ పి జగన్నాధులు నాయుడు గారికి, పురప్రముఖులకు, వదాన్య శేఖరులైన సన్మానకర్తలకు, ఆహ్వానసంఘ సభ్యులకు, శతావధాన ఆహ్వాన సంఘ గౌరవాధ్యక్షులు, ఎస్.ఆర్ ఎమ్ టి మేనేజింగ్ డైరక్టరు, శతావధాని సన్మాన కర్తలు శ్రీ కె వి ఆర్ చౌదరిగారికి, సన్మాన పత్రసమర్పణము గావించిన డా॥ శ్రీ పైండా విశ్వనాథ కుమార్ గారికి, **"శతావధాని చూడామణి"** బిరుదు ప్రదానము గావించిన శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యా పీఠం అధ్యక్షులు, శతావధాన ఆహ్వాన సంఘం అధ్యక్షులు శతావధాన శతపత్ర గ్రంథ ముద్రణకు పూర్తి ఆర్థిక సహాయమునందించిన శ్రీపైండా శ్రీరామకృష్ణ మూర్తి గారికి, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికి ఘన సన్మానం గావించిన శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాథ సత్యప్రసాద్ గారికి, సంస్కృతవిద్యా పీఠం ఉపాధ్యక్షులు శ్రీ పైండా రామకుమార్ గారికి, కాకినాడ టి టి డి. కల్యాణ మండపం ఉచితముగా మంజూరు చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఎమ్.వి. ఎస్. ప్రసాద్ గారికి, శతావధానకార్యక్రమ నిర్వహణములో చేదోడు వాదోడుగ అహర్నిశములు తోడు నీడగ నిలచిన శతావధానఆహ్వానసంఘ సహాయ కార్యదర్శి శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు (గాంధి) గారికి రెండవసహాయ కార్యదర్శి శ్రీకందుకూరి చినరామచంద్రమూర్తి గారికి, శతావధాన ఆహ్వాన సంఘ కోశాధికారి శ్రీగోకవరపు వెంకటేశ్వరరావు గారికి, ఆహ్వాన సంఘఉపాధ్యక్షులు శ్రీఆంధ్రపాల్ గారికి, సన్మాన పత్రం రచించిన కవిరత్న శ్రీకందుకూరి శ్రీరామచంద్రమూర్తి గారికి, సన్మాన

పత్రమును నిలువెత్తురూపంలో కళాత్మకంగా తీర్చిదిద్దిన శ్రీ జి. శివన్నారాయణ గారికి, బిరుదు ప్రదానం నిమిత్తం రజతపేటికకు రూపకల్పన చేసిన శ్రీ పట్నాల రామచంద్రరావు (రాము) గారికి, "**శతావధాన శతపత్రము** "గ్రంధమునకు ముఖచిత్ర రచనగావించిన శ్రీ వై. శివాజీ రావు గారికి శ్రీ లక్ష్మిగణపతి ప్రెస్ ప్రొప్రయిటర్ శ్రీ పైండా శంకర నారాయణ మూర్తి గారికి, శతావధాన కార్యక్రమంలో తమస్వచ్ఛంద సేవలందించిన శ్రీ గ్రంధి వెంకటరమణ మున్నగు కార్యకర్తలకు, సమస్యల సారాంశములు రచించిన శ్రీ కొల్లూరు అవతార శర్మ గారికి, దత్తపదుల సారాంశములు రచించిన శ్రీధూళిపాళ మహాదేవమణి గారికి, వర్ణన సారాంశములు రచించిన శ్రీ వింజమూరి శేషఫణి శర్మ-శ్రీరాణిసుబ్బయదీక్షితులు గార్లకు, అనువాదముల సారాంశములు రచించిన శ్రీవింజమూరి శేషఫణి శర్మగారికి, ప్రశంసాపద్యములు అభినందనలు పంపిన వారందరికి, సమాచార పౌరసంబంధ శాఖ వారికి, పత్రికా విలేఖరులకు శతావధాన శత పత్ర గ్రంధ ముద్రణను ఆఫ్‌సెట్ లో సర్వాంగ సుందరంగా ముద్రించిన శ్రీసాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, కాకినాడ ప్రో॥ ఎస్. వెంకట రమణ గారికి నాహృదయపూర్వకమైన కృతజ్ఞతాంజలులు సమర్పించు కొంటున్నాను.

ఇట్లు

**శ్రీపాద శ్రీరామమూర్తి- శ్రీ శ్రీ శ్రీ**

**సహకార్యదర్శి**

**శ్రీ పైండాసత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం**

**కార్యదర్శి**

**శతావధాన ఆహ్వాన సంఘం**



శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి
వారి సతీమణి శ్రీమతి ఆండాళ్ళమ్మ గారలు

# మరపురాని మధురమూర్తులు

పైండావారి గృహనామము గ్రామనామముగాక వీరు పట్టినది యెల్లిపైడియా యను నట్లు వ్యాపారమున కలిసి వచ్చుటచే పైండా వారను సార్థకనామము గృహనామముగ ఏర్పడినది. అట్టి పైండాన్వయ ముత్యాల కోవలో నొక ముత్యము సర్వయ నామాభిధేయుడు. ఇతడు వంశమూలపురుషునిగ, మూరకస గోత్రోద్భవునిగ, ఆశ్రితజన కల్పవృక్షముగ అత్యధిక ధనాఢ్యునిగ కుబేరాంశతో జన్మించి వైశ్యకులాలంకారభూషితుడై వెలయు చుండెడివాడు. అపరాన్నపూర్ణావతారిణి, విబుధజన కల్పవల్లి, లలితలాలిత్య గుణసంపద్విభవశీలిని, పతి సేవా పరాయణయగు వేంకటలక్ష్మి పరిణయమాడెను. వీరు అష్టాదశ పీఠములలో ఆది పీఠమైన పీఠికాపురమును తమనివాసముగ చేసుకొనిరి. తన తరువాతి తరములవారికి తరగని ధనరాశులను, ఔదార్యగుణ, దానశీల సంపదలను వారసత్వముగ పంచి పెట్టిన సరసోదారహృదయులు సర్వయగారు.

సర్వయవేంకటలక్ష్మి దంపతులకు జన్మించిన వీరనగారు తమ నివాసమును వర్తక స్థానమైన కాకినాడ పట్టణమునకు మార్చి వ్యాపారమును అత్యంతాభివృద్ధికి దెచ్చిరి. వీరు రమణమ్మ యను సాధ్వీమణిని పరిణయమాడి ఆమె వలన రామన్న, వెంకన్న గార్లను ఇరువురు కుమారులను గాంచిరి. వీరిలో రామన్న గారికి అయిదుగురుకుమారులును, వెంకన్న గారికి పెదవీరన్న, పెదచలమయ్య, చినవీరన, చినచలమయ్య యనునలుగురు కుమారులును కలిగిరి. వీరిలో చిన చలమయ్యగారు తమ ధర్మపత్ని వెంకమ్మ గారి వలన వెంకన్న - రామకృష్ణయ్య యను ఇరువురు పుత్రులను గాంచిరి. వీరిలో వెంకన్నగారు 29-12-1907 లో అస్తమించగా రామకృష్ణయ్యగారు 17-7-1832 లో జన్మించి 28-3-1886 లో స్వర్గస్థులయ్యారు.

పైండా వంశకులాలంకార శ్రేష్ఠులలో శ్రీ వెంకన్నగారు తమ సహోదరులయిన రామకృష్ణయ్య గారికి చేదోడువాదోడుగా నుండి పంచారామములందొకటిగా ప్రసిద్ధిగాంచిన దక్షారామ భీమేశ్వరాలయమునకు మహోన్నత గోపుర నిర్మాణము 1818 సంవత్సరమునకు ముందుగ గావించి హిమాలయోత్తుంగసదృశ యశస్సు

నార్జించు కొన్నారు. పైండా వంశ కీర్తి ధ్వజకాంతులను విస్తరింప చేయుటకోయను చందమున భీమేశ్వరాలయ ప్రాంగణములో ధ్వజస్తంభము నిర్మింపచేసి శివంకరుడైన శంకరుని కృపకు పాత్రులయ్యారు. ప్రభావతీ పరిణయ ప్రబంధములోని ఈ క్రింది పద్యములో ధ్వజస్తంభ ప్రతిష్ఠా మహోత్సవమిట్లు వర్ణించబడినది.

శా॥ సాక్షాదీశమహోత్సవంబు గనఁగా సంప్రీతి రండో సహ
ప్రాక్షాగారనలాక్షులార! యనుచున్వానందయై పిల్వఁగాఁ
దాక్షోణీనతి మీదికెత్తిన భుజాస్తంభంబులోనాధరన్
దాక్షారామముఖాలయంబుల ధ్వజస్తంభంబు లొప్పారెడున్

అంతియేగాక దేవాలయావరణములో అష్టదిక్పాలురను, నవగ్రహములను శ్రీసభ సన్నిధిలో పార్వతీ దేవిని ప్రతిష్ఠింపచేసి వారి అనుగ్రహమును పొంది భావితరములకు పుణ్యసంపదలను సంక్రమింప చేసిన పుణ్యశీలురు వెంకన్న రామకృష్ణయ్యగారలు. అన్ని దానముల కన్న అన్నదానము మిన్న యను నిత్యసత్యమును గ్రహించి ద్రాక్షారామములో భీమేశ్వరస్వామి వారి ఆలయసన్నిధిలో 1818 సంవత్సరమునకు పూర్వమే పైండా వెంకన్న - రామకృష్ణయ్య ధర్మ సత్రమును, నిర్మింపజేసి ప్రతినిత్యము రెండుపూటలు జాతి మత కుల వివక్షతలేకుండ నిత్యాన్నదానము నిమిత్తము వాటి నిర్వహణకు లక్షరూపాయల మూలనిధిని, వందలాది ఎకరముల సారవంతమైన భూమిని ధారాదత్తము చేసిన ధన్య జీవులు వెంకన్న, రామకృష్ణయ్యగారలు. ద్రాక్షారామ సత్రములో సంస్కృత విద్యార్థులకు ఉచిత భోజన వసతిని కల్పించారు. వేసవికాలములో బాటసారుల దాహశాంతికి చలివేంద్రములను పెట్టించారు. కాకివాడలో ఎడ్వర్డు చక్రవర్తి ఇండియాను సందర్శించిన చిహ్నంగా 1875 సంవత్సరములో ప్రిన్సుఆఫ్ వేల్సు సత్రమును నిర్మించిరి. ఈ సత్రము ఒక కేళీ భవనమువలె సరస్సుతో, ఫల పుష్పలతాదులతో సుందరనంద నోద్యానముగ శోభిల్లుతూ కందుక క్రీడాస్థలము (టెన్నిస్ కోర్టు) తో ఒప్పారుతూ ఉండేది. రాజకీయోన్నతోద్యోగులు, రాజ బంధువులు, తదితర ప్రముఖులు కార్యార్థులై వచ్చినప్పుడు ఈ సత్రములోనే బసచేసేవారు. అంతేకాక గ్రుడ్డి, కుంటి మొదలగు వికలాంగులకు భోజన సౌకర్యము, బాటసారులు వంట చేసుకొనుటకు వలయు పాత్ర సామగ్రి ఇచ్చేవారు. వెంకన్న రామకృష్ణయ్యగారలు శైవులకు

వేరుగాను, వైష్ణవులకు వేరుగాను ద్వాదశధర్మ సత్రముల ట్రస్టును 1882లో ఏర్పాటు చేశారు. రామకృష్ణయ్యగారి సతీమణి శ్రీమతి వెంకమ్మగారు 1900 సంవత్సరములో వారణాసిలో వేద శాస్త్ర విద్యార్థుల భోజనముల నిమిత్తం నిధిని ఏర్పాటు చేయడమే కాక రాత్రి పూట భోజనములు పెట్టు సత్రనిర్మాణము గావించిన సాధ్వీమణి. "ద్వాదశీధర్మము" లకై ఈమె మూలధనమేర్పాటు గావించెను.

అగ్రజులైన వెంకన్న గారు ది. 29.12.1907 లో స్వర్గస్థులయ్యారు. వీరి అస్తమయం రామకృష్ణయ్యగారికి తీరని లోటు గా పరిణమించినా అన్నగారి ఆశయాలను ఆచరణలో పెట్టడం తన ధర్మంగా భావించారు రామకృష్ణయ్యగారు. వెంకన్నగారు తమ ధర్మపత్ని మంగమ్మవలన చలమయ్య, జగన్నాధము, నారాయణముగారి అను ముగ్గురు కుమారులను గాంచిరి.

ప్రభావతీ పరిణయ ప్రబంధమున వెంకన్నగారి ఔదార్యగుణసంపద, త్యాగంలత, ధార్మిక పరతంత్రత ఈ క్రింది పద్యములో వర్ణింప బడెను.

సీ ॥ పద్మినీ ప్రియ నీదు భవ్యదర్శనమబ్బ
కవిచక్రములు ప్రీతిఁగాంచుటరుదె
దానరాధేయ నీదర్శనంబబ్బిన
విబుధేంద్రుసద్వాంఛనీడుటరుదె
త్యాగమందార నీ దర్శనంబబ్బిన
ద్విజతతుల్ ఫలసిద్ధి దేలుటరుదె
తతకళారాజ నీదర్శనం బబ్బిన
సత్పాలనంబు తా జరుగుటరుదె
గీ॥ యనుచు విబుధులు వర్ణింతురనుదినంబు
సకలవాగీశ విత్తేశ సభలయందు
బుణ్య పైడాన్వయాంబోధి పూర్ణచంద్రు
సవ్యగుణగేయు వెంకన నామధేయు.

రామకృష్ణయ్యగారు ప్రభుత్వ ఉన్నతోద్యోగులతో విశేష పరిచయము కలిగి యుండి ప్రజాహిత కార్యక్రమములలోను, సాంఘిక సంస్కరణోద్యమములందును

పితామహుడు శ్రీ వీరేశలింగం గారి స్త్రీ పునర్వివాహోద్యమముపట్ల సానుభూతిని కలిగి, దాని సహాయార్థమై నలుబది వేల రూపాయల విరాళమొసంగి అనాధలయిన వితంతువుల కెందరికో పతిభిక్షపెట్టిరి. కొందరు సనాతనుల మూర్ఖపు పట్టుదలవలన సంఘ బహిష్కృతులయిన అనాధవితంతు స్త్రీల నివాసము కొరకు కాకినాడ లోను, రాజమండ్రిలోను శాశ్వత ప్రాతిపదిక మీద కొందరికి, తాత్కాలిక ప్రాతిపదిక మీద మరికొందరికి గృహములను ఏర్పాటు చేశారు. 1886 సంవత్సరములో ఒక విల్లుద్వారా రామకృష్ణయ్య విడోమేరేజ్‌ట్రస్టు ఏర్పాటు చేశారు. ఈ విధంగా తమ సంఘ సంస్కారప్రియత్వాన్ని వెల్లడించుకొన్నారు. ధార్మిక కార్యక్రమముల పట్ల అత్యంతాసక్తి గల రామకృష్ణయ్యగారు ఎన్నోదేవాలయనిర్మాణములు గావించారు. కాకినాడలో భైరవాలయము, విష్ణ్వాలయం, శివాలయం, విఘ్నేశ్వరాలయములను, శానపల్లంకలో చోడేశ్వరస్వామి వారి ఆలయమును కట్టించారు.

ప్రభావతీ పరిణయ ప్రబంధములో విఘ్నేశ్వరాలయ, చోడేశ్వరాలయముల నిర్మాణ ప్రాశస్త్యమీదిగువ పద్యములలో వర్ణింప బడినది.

సీ। నాధుఁడై సద్గుణ నాధుఁడై కరుణాస
నాధుఁడై మించిన సాధువెవఁడు
కర్తయై మతకళాధర్తయై పాపసం
హర్తయై జగములనలరె నెవఁడు
నేతయై భువన నిర్మాతయై కుశల సం
ధాతయై ధరణిలో దనరె నెవఁడు
మిత్రుఁడై వరసతీ పుత్రుఁడై పరమ ప
విత్రుఁడై పుడమిని వెలసె నెవఁడు

గీ। అట్టి విఘ్నేశ్వరునకు దివ్యాలయంబు
గాకినాడ పురంబున లోకమెన్న
శాశ్వతముగాగ గట్టించె సాంద్రకీర్తి
రామకృష్ణుండు శివభక్తరంజకుండు.

సీ। చిత్ర చిత్రములైన చిత్రములీ్వలసిల్లి
బిగాడకుండలఛాయ పరిధవిల్లి

దౌర్యత్రికములసంతానంబు శోభిల్లు
స్స్వస్తివాచకతతి సందడిల్లు
బక్షోత్సవపు బరంపరలును వర్ధిల్లు
నిత్యోత్సవంబులు నివ్వటిల్లు
నందదీపంబుల బృందముల్ రంజిల్లు
భూరిఘంటాధ్వని పూరటిల్లు
గీ॥ నలవియేదిని మాహాత్మ్యమెలమిబొగడ
ననుచు సురలును బండితులభినుతింప
లీల గట్టించె భువి భైరవాలయంబు
నార్యనుతుడైన రామకృష్ణార్యవరుఁడు

1865 లో రామలింగేశ్వర అగ్రహార వాస్తవ్యులు మంచినీటి కొఱతతో బాధ పడుటను గాంచి ఇప్పటి పిండాల చెఱువుగా పిలవబడే బాలాత్రిపురసుందరి దేవాలయము ఎదురుగా తమ పేర నొక తటాకమును త్రవ్వించి ఆగ్రామస్థుల కృతజ్ఞతలకు పాత్రులయ్యారు. ఉపనయనములకని, వివాహములకని వచ్చియాచించువారలకు ఆర్థిక సహాయము చేసెడివారు. ఈ రామకృష్ణయ్య మునిసిపల్ తటాకము ప్రభావతీ పరిణయ ప్రబంధమున నిట్లు వర్ణింపబడినది:

సీ॥ ఘన భూరి పద్మములక్కల హంసలను గాంచి
వరులు మానస సరోవరమనంగ
రాజీవముల ఫుల్ల రాజీవముల గాంచి
గురులు పంపాసరోవరమనంగ
నిర్మల మధుసుధా నీరపూరము గాంచి
సురవరుల్ క్షీరసాగరమనంగ
స్నానపానాగత సాధుబుధులగాంచి
సారగంగా పయఃపూరమనగ
గీ॥ సూర్యరాయపురీస్థసంస్థాయమాన
రామలింగేశ్వరాగ్రహారంబునందు
రామకృష్ణుండు నిర్మింపరమ్యమైన
హ్రదము బొగడంగ సురలకు నలవియగునె

కాకినాడలో రామకృష్ణయ్యగారు ఆంగ్లేయోద్యోగుల యొక్క కోరిక ననుసరించి ఒక గొప్ప విలాస గృహమును నెలకొల్పిరి. ఇందు సుందరోద్యానమును, ఆంగ్లేయుల ఆచారానుగుణముగ స్నానార్థమై నిర్మించిన సరస్సును మిక్కిలి మనోహరముగ తీర్చిదిద్ది ఆంగ్లేయుల మన్ననలకు పాత్రులయ్యారు. ఇది ఇంగ్లీషు క్లబ్ అని పిలవ బడేది.

1882 లో శ్రీ పిఠాపురం మహారాజావారి కళాశాల యందు తమ పేర ఎడ్మినిస్ట్రేటివ్ భవనమును కట్టించుటకు, ఆరువేల రూపాయల విరాళమిచ్చారు. కళాశాల విద్యార్థుల గాన విద్యాపోషణ నిమిత్తము ఆర్థిక సహాయం చేశారు. సంగీత తరగతుల నిర్వహణకు ఏర్పాటు చేసిన నిధి రూ.1400లో రూ 1000 వీరేయిచ్చిరి

పైండా రామకృష్ణయ్య అసోసియేషన్ రూమునకు పునాదిరాయి 1883 సంవత్సరము మార్చి 3 వతేదీని అప్పటి పోర్టు St. జార్జిగవర్నర్ ఆనరబుల్ MOUNT STUAAT ELPHIN STONE GRANT DUFF మద్రాసు వారిచే వేయబడినది. గోదావరి జిల్లా కలెక్టరు W.A. HAPPELL ESQIRE గారు, రావుబహాదుర్ వేంకటాచలపతి, పిఠాపురం రాజా రావు బహాదుర్ గంగాధర రామారావు, పెక్కుమంది యూరోపి యన్లు, ఇతర ప్రముఖులు ఈ శంకుస్థాపన మహోత్సవానికి హాజరయ్యారు. శ్రీ రామకృష్ణయ్య గారు గోదావరి జిల్లాకు ఆనరబుల్ మేజస్ట్రేట్‌గా పనిచేశారు.

పీఠికాపుర సంస్థానాధీశులు కీ।శే। రావుబహాదుర్ గంగాధర రామారావుగారు ప్రీతి పురస్సరముగ రామకృష్ణయ్యగారికి కొవ్వూరు గ్రామమొసంగినట్లు ఈ క్రింది పద్యము చెప్పుచున్నది.

శా ।  ఆ గంగాధర రామరాయ నృపపంచాస్యుండు కోదండవి
ద్యాగంగాత్మజతుల్య విక్రముడు మోదంబొప్ప సౌహార్దతన్
భోగార్థంబుగ రామకృష్ణునకు గొవ్వూర్గ్రామమున్ గాన్కగా
ప్రాగల్భ్యంబున నీయ గైకొనియె సౌభాగ్యంబు శోభిల్లగాన్.

ఇప్పటి పశ్చిమగోదావరి జిల్లాకు చెందిన అన్నదేవరపేట, ప్రక్కిలంక ఎస్టేటులకు శ్రీపైండావారు జమీందారులుగా పన్నెకెక్కారు. అన్నదేవరపేట ఎస్టేటులో చిట్యాల, లేళ్లసంతల గూడెం, పెద్దాపురం, రావూరుపాడు, తాళపూడి. వీరభద్రపుర అగ్రహారములు

కలిసి యున్నవి. ఇందలి భూములు సారవంతములైనవి. ఇందుగల దేవాలయములకు ఏటేటా శ్రీ పైండా జమీందారులు ఉత్సవములు జరిపించెడివారు.

కోడూరు, కొంతంగి, వెంకటేశ్వరులవారిపేట, సీతయ్యమ్మపేట అను మొఖాసా గ్రామములు, ఆరెంపూడి ముఠాకు చెందినవిగా యుండెను. జగన్నాధపురం గ్రామములో మంచి సారవంతమైన భూములుండెడివి. కోటపాడు శివారు రామేశంపేట విశాఖ పట్టణం జిల్లాలో కైలాసపట్నం అగ్రహారం శ్రీ పైండావారి అధీనములో ఉండెడివి. ప్రక్కిలంక గోదావరి లంకలలో చేరినదై నాణ్యమైన పొగాకు పండుచుండెడిది. దీనిని రంగూన్ వర్తకులు కొనుగోలు చేసేవారు.

ఈ విధముగ వెంకన్న రామకృష్ణయ్య గారలు వాపీకూపతటాక దేవాలయ ధర్మసత్ర నిర్మాణ కర్తలుగ, సంఘ సంస్కరణోద్యమ సారధులుగ, విద్యాలయ సంస్థాపకులుగ, నిరతాన్నదాన శీలురుగ, ప్రజాహిత కార్యనిర్వహణ దక్షులుగ, పైండా వంశ చారిత్రకపురుషులుగా ప్రసిద్ధి కెక్కారు

శ్రీ పైండా రామకృష్ణయ్య గారి ధర్మకార్యములగురించి సంగ్రహముగా ఈ క్రింది పద్యము వలన మనకు తెలియనగును.

సీ। ఏనూరి నరసాళి యింపొంద బంతుల
సాలకు నాలుగు వేలొసంగె
నేనేత బాలురకింగ్లీషు బోధించు
కాలేజికెన్మిది వేలొసంగె
నేదాత ద్విజవరులెన్నంగ నన్నస
త్రాళికి నిర్వదివేలొసంగె
నేమేటి ముదముతో విలసనాథావివా
హాళికి నల్వదివేలొసంగె

గీ। నట్టినుజనైకలోక విఖ్యాతయశుడు
ధైర్యగాంభీర్యషడ్గుణైశ్వర్యయుతుడు
సాధుసజ్జన పోషణాంచన్మనస్కు-
డర్యమాత్రుండె రామకృష్ణార్యవరుడు.

రామకృష్ణయ్య వెంకమాంబా దంపతులకు సుబ్బారాయుడు, వేంకటాచలపతి, చలమయ్యయను ముప్పురు పుత్రులుదయించిరి. వీరిలో పాండవ మధ్యమసమానులు, రమణీయ గుణ గరిష్ఠులు, వినయ సౌశీల్య సంపన్నులు, రావుబహాదుర్ బిరుదాంకితులు, ఆంగ్ల భాషాకోవిదులు, లౌకిక వ్యవహారదక్షులు, కాకినాడ పురపాలక సంఘాధ్యక్ష పదవీ సమాలంకృతులు, దిగంత విశ్రాంత యశోవిశాలురు అయిన శ్రీ వేంకటాచలపతి గారు దీ.28.9.1865 సంవత్సరములో జననమందిరి. 11.12.1932 సంవత్సరమున స్వర్గస్థులయిరి.

పురపాలక సంఘ పాలనలో గ్రాసవాసోదకములకు వీసమెత్తు లోపం లేకుండా ప్రజావసరాలను సమతాభావంతో సమకూర్చిన సమతావాది. పదవులు చేపట్టినది పరులకోసమే కాని సిరుల కోసం కాదు. కన్సర్వేటివ్ సభలో, తాలూకా బోర్డు, జిల్లా బోర్డులలో సభ్యులుగ తమ విధులను సక్రమంగా నిర్వహిస్తూప్రజల యిక్కట్టులను గమనించి వాటి నివారణకు సత్వరచర్యతీసుకొనేవారు.

ప్రాచీన సాహిత్యాన్ని, కళలను సముద్ధరించాలను సంకల్పంతో కాకినాడలో అత్యంత విశాలమును, సౌందర్యమును కలిగిన టౌను హాలును 1912 సంవత్సరములో 30 వేల రూపాయల విరాళమిచ్చినిర్మింప చేసిరి. ఇది వేంకటాచలపతి పుర భవనము అని పిలువ బడుచున్నది. ఇందు అత్యంత రమణీయమైన నాటకరంగమును, పుస్తక భాండాగారమును, లిటరరీ అసోసియేషన్ వారి క్లబ్బును గలవు. ఈ టౌనుహాలులో ప్రముఖ వ్యక్తులచే ఉపన్యాసకార్యక్రమములు నిర్వహించ బడేవి. ఈ టౌను హాలు చతుర్ముఖ ద్వారముగలదిగ నిర్మించబడినది. టౌను హాలు ముఖద్వారము చలువరాతి పలకపై వేంకటాచలపతి టౌనుహాలు అని యుండుట గమనార్హము. వీరు పట్టణ వాసులకు చేసిన సేవలకు గుర్తింపుగా మునిసిపల్ ఆఫీసు లోపలి భాగమున రావుబహాదుర్ వేంకటాచలపతి గారి తైల వర్ణచిత్రమును దీ.10.2.1936 వ శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు ఆవిష్కరించారు.

శ్రీ వేంకటాచలపతి గారి దేశ సేవకును, రాజ భక్తికిని, పరోపకారపారీణతను ప్రశంసిస్తూ బ్రిటీషు దొరతనము వారు 1906 సంవత్సరములో రావు సాహెబ్ బిరుదును, 1916 సంవత్సరములో రావు బహాదుర్ బిరుదమును ఒసంగి సత్కరించారు.

కాకినాడ పట్టణమున మంచి నీటి ఇబ్బంది తొలగించుటకై ప్రతి వీధికిని కుళాయిల నేర్పాటు చేయుటకు తమ సోదరులు సుబ్బారాయుడు, చలమయ్య గార్లతోడ్పాటుతో 1903 సంవత్సరములో 42 వేల రూపాయలను విక్టోరియా వాటర్ వర్క్సుకి విరాళముగ సమర్పించి పురప్రజల కృతజ్ఞతలకు పాత్రులయ్యారు. 1910 సంవత్సరములో కాకినాడలో శ్రీపైండావేంకటాచలపతి చౌల్ట్రీ అండ్ ఛారిటీస్ట్రస్టు స్థాపించి సదరు సత్రములో బాటసారులకు, బీద విద్యార్థులకు కులమత విచక్షణ లేకుండ అన్నదానము జరుపుటకు చరస్థిరాస్తులను కల్పించినారు

1916 సంవత్సరములో నెల్లూరులో జరిగిన 9 వ ఆర్యవైశ్య మహాసభకు అధ్యక్షునిగా నుండి ఆ సభను జయప్రదముగా నిర్వహించుటయే కాక వైశ్య విద్యార్థుల విద్యాభివృద్ధికి భూరివిరాళ మొసంగిరి

కాకినాడలోని శ్రీ వేణుగోపాల స్వామి శాశ్వత బాలభోగమునకు, శ్రీ జగన్నాధ స్వామి వారి నిత్య భోగమునకు, పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామి వారి నిత్య నైవేద్యములకు తగు ధన సహాయము చేశారు. కాకినాడలోని భీమేశ్వరస్వామి, శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయం, చిన సీతారామస్వామి దేవాలయాలకు ధర్మకర్తలుగా నుండి వాటి అభివృద్ధికి నిరంతర కృషిసలిపారు

స్త్రీ విద్యాభివృద్ధికి, వారి ఆరోగ్యాభివృద్ధికి కాకినాడలో లేడీస్ క్లబ్ భవన సముదాయమునకు 1914 సంవత్సరములోను, తమ సతీమణి శ్రీమతి సత్తి రాజు గారి పేరగల మునిసిపల్ గరల్స్ హైస్కూలునకు 1931 సంవత్సరములో 3333 చదరపుగజముల భూ వసతి కల్పించారు. ఈ విధంగా స్త్రీ స్వాతంత్ర్యోద్యమం పట్ల తమకు గల అభిమానాన్ని వెల్లడించుకొన్నారు. పది వేల రూపాయలు ఖర్చు చేసి ఆయుర్వేద ఔషధాలయమును స్థాపించి అందు సమర్థులైన వైద్యులనునియోగించి ఉచిత వైద్య సదుపాయం కల్పించారు.

జంతుహింసా నివారణ సంఘం ద్వారా జగన్నాధపురం వంతెన వద్ద గల గంటస్తంభం దగ్గర పశువుల సదుపాయం కొరకు మంచినీటి కుండీలు, షెడ్లు ఏర్పాటు చేసి వేంకటాచలపతి గారు తమకు గల భూతదయను చాటు కొన్నారు.

తమ షష్టిపూర్తి మహోత్సవ సమయమున రూపాయలతో తులాభారం తూగి

ఆ ధనమును బ్రాహ్మణులకు, పేదసాదలకు ధర్మం చేశారు కాకినాడ పిఠాపురం రాజావారి కళాశాలలో 1905 సం॥లో సైన్సు బ్లాక్ నిర్మాణం నిమిత్తం భూరి విరాళ మిచ్చారు.

తెలుగు విద్వత్పరిషత్తునకు భూరివిరాళమొసంగుటయే కాక 1910 సంవత్సరములో వేద శాస్త్ర పాఠశాలను స్థాపించి అందలి విద్యార్థులకు భోజన సదుపాయము గావించి వేదోద్ధారకులుగా కీర్తి గడించుకొన్నారు. వేంకటాచలపతి గారు స్వాతంత్రోద్యమములో ప్రముఖ పాత్ర వహించారు. అందు పాల్గొన్న నాయకులకు అనేక గుప్త సహాయములు చేసేవారు. స్వాతంత్ర్య సమరకాలంలో వీరి గృహము స్వాతంత్ర్య సమర యోధులకు ముఖ్య కేంద్రంగా ఉండేది. మహర్షి బులుసు సాంబమూర్తి, దుర్గాబాయి దేశ్‌ముఖ్, మర్ల అప్పయ్య శాస్త్రి, పారుపూడి రామమోహన రావు మొదలగు ఎంతోమందికి చేయూతగా ఉండేవారు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటున్నారన్న కారణంగా వీరి గృహమును తణిఖీ చేసి బ్రిటీషు ప్రభుత్వం వారు సీలు వేశారు.

1923 సంవత్సరములో కాకినాడలో జరిగిన 38వ అఖిలభారత కాంగ్రెసు మహాసభలుజయ ప్రదమగుటకు ముఖ్యకారకులలో వేంకటాచలపతిగారొకరు. ఆనాటి కాంగ్రెస్ మహాసభల ఆహ్వాన సంఘం ఉపాధ్యక్షులుగా మరియు కోశాధికారిగా అపారమైన సేవ చేశారు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి అముద్రిత తాళ పత్ర గ్రంథములు ముద్రించుటకు 1932 సంవత్సరములో పైండా వేంకటాచలపతి తెలుగు మేన్‌స్క్రిప్టు ఫండు సీరీస్‌కు అపార ధన సహాయము గావించారు. ఆ సీరీస్‌లో మొదటి గ్రంథము రామరాజు రంగప్పరాజు ప్రణీతమైన సాంబోపాఖ్యానమును ముద్రింపచేశారు 1901సంవత్సరములో ఓరుగంటి సోమశేఖర కవిగారిచేరచించబడిన "ప్రభావతీపరిణయం" అను ప్రబంధమును అంకితముగస్వీకరించికృతి భర్తగా చిరయశస్సునార్జించు కొన్నారు. శ్రీ వేంకటాచలపతి గారి కృతి సమర్పణోత్సవ సభలో వారిని కృతి కర్త ఈ విధముగా శ్లాఘించారు.

సీ॥ బుధగురుడవఁ దగు బులుసు ప్రకాశవే
దార్థికి మాట పదార్థ వాపగె
బుల్లె శ్రీ దక్షిణామూర్త్యాది పత్వండి

తాళికి నూటపదార్ల నొసగె
నలపరవస్తు రంగాచార్య విజ్ఞాన
సూరికి నూట పదార్ల నొసగె
శత ఘంట కవితా విశారద శారదా
దరులకు నూట పదార్ల నొసగె

గీ॥ వేద వేదాంగ పాఠక వేత్తలైన
పండితాళికి గుండల ప్రకరమొసగె
సరసహృదయుండు వేంకటాచలపతీంద్రు
డతని యౌదార్య మెన్నంగ నలవి యగునె

సీ॥ శ్రీ జగద్గురు వర శ్రీపాద పద్మముల్
శత సువర్ణ సుమపూజలను సలిపె
నపరపతంజలి యౌ భాగవతి హరి
శాస్త్రికి నూఱునిష్కములు నొసగె
వ్యాకరణాచార్య వర్య సుబ్రహ్మణ్య
శాస్త్రికి నూఱునిష్కములు విడియె
సర్వతంత్రార్థ విశారద శ్రీరామ
శాస్త్రికి నూఱు నిష్కములనిచ్చె

గీ॥ బూజ్యమతి హనుమచ్ఛాస్త్రి మొదలుగాగ
బండిత వరేణ్యులకు శత వ్రతతులొసగె
నౌరసైడాన్వయుని వేంకటాచలపతి
వైశ్యభోజుడటంచు జెప్పంగదగదే

రావుబహాదుర్ శ్రీ వేంకటా చలపతిగారు గూటాల జమీందారులయిన మన్యము వారి కుమార్తె సత్తిరాజమ్మ గారిని పరిణయమాడి ఆమెవలన రామకృష్ణయ్య, సూర్యనారాయణ మూర్తి, వెంకటరాజు, సత్యనారాయణమూర్తి, చినరామ కృష్ణయ్యలనుఅయిదుగురు పుత్రులనుగాంచిరి. వీరిలో సత్యనారాయణమూర్తిగారు 29-5-1890లో జన్మించి 20-4-1969 లో స్వర్గస్థులయ్యారు. సత్యనారాయణ మూర్తిగారి యొక్కయు వారి కుటుంబము యొక్కయు చరిత్ర తెలుసు కొందము.

శ్రీ పైండా సత్యనారాయణమూర్తిగారు జనకుల ఔదార్యగుణ సంపత్తిని, స్వభావములను, దానగుణశీలసంపదలను తనువు పొరల్లో దాచు కొన్నారు. వాకిట్లోకి వెడితే చాలు నవ్వుపువ్వుల జల్లులు కురిపిస్తూ గోప్యంగా గుప్తదానం చేసి ఆప్తునివలె ఆదుకొనే వారు సత్యనారాయణ ధామం నిత్యవసంతోత్సవముల కాలవాలం దయార్ద్రహృదయంతో దధి కర్ణుల దాన శీలతకు ప్రతీకగా నిలిచారు అర్ధాంగిని శ్రీమతి ఆండాళమ్మ అపర అన్నపూర్ణావతారిణిగా వాత్సల్యప్రేమాను రాగ స్వరూపిణిగ పతిదేవునికి చేదోడు వాదోడుయై నిలచింది

శ్రీ పైండా వెంకన్న - రామకృష్ణయ్య ద్రాక్షారామ సత్రం ట్రస్టీ నుండి పంచారామ క్షేత్రమైన ద్రాక్షారామంలో పైండా వెంకన్న - రామకృష్ణయ్య ఉన్నత పాఠశాల 1953 సంవత్సరములో స్థాపించుటకు ప్రోత్సహించుటయే గాక అన్నవరం సత్యదేవి గరల్స్ కాలేజీకి, రామచంద్రపురం వి యస్ యమ్ డిగ్రీ కళాశాలకు, కాకినాడ రంగరాయ వైద్యకళాశాలకు భూరివిరాళము లొసంగి విద్యాభివృద్ధికి కృషిచేసిరి భద్రాచల సీతారామ స్వామి వారి దేవస్థానం సన్నిధిలో పైండా వెంకన్న - రామకృష్ణయ్య ధర్మసత్రం నిర్మించుటకు, ముక్కోటి ఏకాదశికి సీతారామ కల్యాణ సందర్భంలో అన్నదానం నిమిత్తం విరాళం సమర్పించిరి. ప్రిన్సు ఆఫ్ వేల్సు ఛారిటీ ట్రస్టు నుండి 1956 సంవత్సరములో సుందరమణి గిల్డ్ ఆఫ్ సర్వీసు నర్సరీస్కూలునకు భూవసతి కల్పించారు

శ్రీ సత్యనారాయణ మూర్తి గారు తమ తండ్రి వేంకటాచలపతి గారి వారసత్వమును పుణికి పుచ్చుకొని ప్రతి సంవత్సరము పేదలకు వస్త్రదానం చేసేవారు కార్తీక మాసమున తమతోటలలో బ్రాహ్మణులకు, వైశ్యులకు, తదితరులకు వనసంతర్పణము జరిపించేవారు. కవి పండితులనాదరించుటయందును, వివాహాది శుభకార్యములకు ధన సహాయము చేయుట యందును, దైవ కార్యములకును విరివిగా విరాళము లొసంగేవారు. పాఠశాలల - కళాశాలలలో చదువుకొను విద్యార్థులను ప్రేమవాత్సల్యములతో చూసేవారు. వీరికాలంలోనే కోటిపల్లిలో పైండా వెంకన్న, రామకృష్ణయ్యగారి సత్రమునకు భవనమును సమకూర్చిరి. వీరి తాతలు, తండ్రి స్థాపించిన అన్ని ట్రస్టులకు వంశపారంపర్య ధర్మకర్తగా వ్యవహరించి వాటిని కడుసమర్థతతో పాలించి అభివృద్ధిచేసిరి.

ఆగర్భ శ్రీమంతులు, అనేక వాపీకూపతటాకాలయ సత్రశాలాది నిర్మాతలు జమీందారులు, స్థిరయశ శ్రీమంతులు, వదాన్యశేఖరులు నిరతాన్నదానశీలురు, ప్రజాహిత కార్యనిర్వహణ దీక్షాదక్షులు, దేశసేవాపరాయణులు, దైవచింతనాపరులు, కళాపోషకులు, కవి పండిత జనాశ్రయులు, కృతిపతులు, యశోధనవిరాజితులు, సంస్కృతాంధ్రభాషల పరిరక్షకులు, వ్యాపారకుశలురు, వైశ్యకులాలంకార శోభితులు,

పైండా వంశ పయఃపారావార శశాంకులునగు పైండావంశీయులు మరపురాని మధురమూర్తులుగా పైండాన్వయ చరిత్ర పుటలలో శాశ్వతత్వమును సంతరించుకొని ప్రజాహృదయాలలో నిలచిన వీరివంశమునకుశివ కేశవులు, శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీ మాత సర్వదా సకల సంపదలను సమకూర్చి తరతరాలవరకు ఆయురారోగ్య భాగ్యములను కలిగించు చుందురుగాక!

సీ ॥ ప్రవిమల కీర్తిమై శివకేశవులకు దే
వళముల బెక్కింటి నిలిపిరెవరు
కరుణార్ద్రచిత్తులై విరతాన్నదాన స
త్రములనేకము లుంచి తనరిరెవరు
సప్తసంతానాది సత్క్రియాళికి వేన
వేలు వెచ్చింపగ జాలిరెవరు
ప్రతి వత్సరము గణపతినవరాత్ర్యుత్స
వములను నలుపునదృక్షులెవరు

గీ ॥ సకలకోవిద స్తవనీయ చరితులెవ్వ
రట్టి పైండాన్వవాయ దుగ్ధాబ్ధిచంద్రు
లాయురారోగ్యభోగభాగ్యములు గలిగి
యలరుదురు గాత మా శశాంకార్యమవని

రచయిత

**మధురకవి – శ్రీపాద శ్రీరామమూర్తి**

సహకార్యదర్శి

**శ్రీ పైండా సత్యనారాయణమూర్తి**

**సంస్కృత విద్యాపీఠం– కాకినాడ.**

కార్యదర్శి :

**శతావధాన ఆహ్వాన సంఘం**

# పలు విద్యా – సాంస్కృతిక – సాహిత్య – ఆధ్యాత్మిక సంస్థల అధినేత

# శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి, B.Com గారు

— — — —

శ్రీ పైండా సత్యనారాయణమూర్తి – శ్రీమతి ఆండాళమ్మ పుణ్యదంపతులకు పూర్వపుణ్య విశేషఫలముగ చలపతి రావు, వీరయ్య, శ్రీరామకృష్ణమూర్తి, రామకుమార్ అను నలుగురు పుత్రులు, పంద్రెండుగురు పుత్రికలు జన్మించిరి. వీరిలో చలపతి రావుగారిని రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ నాళం సుబ్రహ్మణ్యం గారు దత్తత చేసుకొనిరి వీరయ్య గారు అల్పాయుష్కులై అసువులు బాసిరి

శ్రీ పైండా సత్యనారాయణమూర్తి దంపతులు తమ పంద్రెండుగురు కుమార్తెలవివాహములను వైభవోపేతముగ జరిపించి మిక్కుటమైన కన్యాదాన ఫలమును పొందిరి. అనకాపల్లి వాస్తవ్యులు శ్రీ గ్రంధి వెంకట చలపతి రావుగారికి మహాలక్ష్మమ్మను, ఏలూరు వాస్తవ్యులు శ్రీ చుండూరి సుబ్బారావు గారికి శకుంతలను, కాకినాడ వాస్తవ్యులు శ్రీ బాదం రామచంద్రమూర్తి గారికి లక్ష్మీదేవమ్మను, రేలంగి వాస్తవ్యులు శ్రీ తుమ్మలపల్లి మంగరాజు గారికి రాజేశ్వరమ్మను, కాకినాడ వాస్తవ్యులు మట్టె ధనలక్ష్మీ వరప్రసాద హనుమంతరావుగారికి లక్ష్మీకాంతమ్మను, గంటావారి గూడెం వాస్తవ్యులు శ్రీ చీమకుర్తి రాధాకృష్ణమూర్తి గారికి కస్తూరిని, బాపట్ల వాస్తవ్యులు శ్రీ మోదడుగు చంద్ర గుప్తగారికి సత్య తులసిని, తుని వాస్తవ్యులు శ్రీ పెనుగొండ సింహాద్రి సోమరాజుగారికి సత్యవతిని, విజయవాడ వాస్తవ్యులు శ్రీ పొట్టి ఆనంద వెంకట కుమారస్వామిగారికి ఉషను, తెనాలి తాలూకా కూచనపూడి వాస్తవ్య లు శ్రీ పొన్నూరు నరసింహరావు గారికి పద్మినీ దేవిని, యిచ్ఛాపురం గ్రామ వాస్తవ్య లు శ్రీ కాద భీమరాజుగారికి సావిత్రిని, విశాఖ పట్టణం వాస్తవ్యులు శ్రీ చెన్నూరు గౌరీ కుమార్‌గారికి శ్రీవల్లిని అర్ధాంగినులుగ చేసి తమ జీవితమును సార్థక పరచుకొనిరి

ది. 12–2–1928 సంవత్సరమున కాకినాడలో జన్మించిన పుత్రరత్నము శ్రీరామకృష్ణమూర్తి గారు. తల్లి స్తన్యంత్రాగుతూనే త్యాగ బుద్ధి నలవరచు కొన్న




శ్రీ పైండా శ్రీరామ కృష్ణమూర్తి B Com

వారి సహధర్మచారిణి

శ్రీమతి సత్యవతి గారలు

త్యాగ శీలురు సాత్విక శక్తులను చిన్నతనంలోనే సంతరించుకొన్న సాత్వికమూర్తి పుట్టుభోగిగ పుట్టి పురుషార్థంపుణికి పుచ్చుకొన్న పూతచరితులు రెండు పదుల వయసులోనే హూణ విద్య పూర్తి చేసుకొని బి కామ్ పట్టా పొంది వ్యావహారిక జ్ఞానసంపదను సంతరించుకొన్న ప్రతిభాశాలురు

మంచిని మించిన తత్వం మహిలో లేదన్న నగ్న సత్యాన్ని గ్రహించిన మనీషి. జాతక చక్రంలో వాక్ స్థానంలో గురుగ్రహం ఉంది కాబోలు వాక్చాతుర్యం సహజం గా సిద్ధింపచేసుకొన్న సమయోచిత పరిజ్ఞానులు వారి మాటల్లో మార్దవం ఉంది. ఆయన చేతల్లో చైతన్యగాలం ఉంది ఈ చైతన్య స్ఫూర్తి తో సర్వుల హృదయాలను దోచుకొంటున్నారు. ఆయన శాంతమూర్తిగ, అజాత శత్రువుగ, ప్రేమమూర్తిగా మసలు కొనుమాన్యపురుషులు

జనకుల గుణస్వభావాలను తనలో ఇముడ్చుకొన్న ఆదర్శ గుణ సంపన్నులు ఉత్తమగుణాలు ఉగ్గుపాలతో నేర్చుకొని పెద్దలయెడ వినయం, పిన్నలపట్ల వాత్సల్యం, దైవంమీద భక్తి, స్వధర్మంపై అనురక్తి, మాతాపితరుల పట్ల ఎనలేని మమకారం, ఇరుగు పొరుగులకు అయాచిత సహాయం, ఆదాయంలో కొంతభాగం దానధర్మాలకు వ్యయించడం ఆదిగాగల సుగుణ సంపత్తి శ్రీరామకృష్ణమూర్తి గారికి సహజంగా అలవడిన ప్రవృత్తి.

ఆయన జీవన స్నేహతైలం మనిషి కొకదీపం వెలిగించి మనసు లోని చీకట్లను మటు మాయం చేసి మహోషస్సును కలిగిస్తుంది ఆయన సంకల్పానికి వికల్పంలేదు. మిన్ను విరిగి మీద పడినా చలించని ధీరోదాత్తులు వారు చిరునవ్వులు చిందిస్తూ అరుల ఉరములలోని విషాన్ని విరచి వేయగల విజ్ఞతగలవారు ఆయన ఔదార్యగుణ సౌగంధము ఎద ఎదలో ఆనందాన్ని కలిగిస్తూ ఉంటుంది

పితామహులు రామకృష్ణయ్యగారిలో గల సుగుణ సంపదకు, ఆ త్యాగశీలతకు వన్నె తేగలరని భావించిన శ్రీ సత్యనారాయణమూర్తిగారు వీరికి శ్రీరామకృష్ణమూర్తి అని సార్థక నామము పెట్టినారు.

శ్రీరామకృష్ణమూర్తిగారి సతీమణి కాకినాడ కాపురస్తులు కీ।శే చిట్టూరి విశ్వనాథం – సుగుణవతి గార్ల కుమార్తె శ్రీమతి సత్యవతి పతిభక్తి పరాయణయై " కార్యేషుదాసీ కరణేషుమంత్రీ శయనేచ రంభా "యను చందమున మెలగు చుండెడిది.

ఈపుణ్యదంపతులకు రామలక్ష్మణుల పోలికలుగల సుబ్రహ్మణ్య జగన్నాధసత్య ప్రసాద్, డా॥ విశ్వనాధకుమార్ అను ఇరువురు కుమారులు జన్మించి సకల సద్గుణోపేతులై, మాతాపితృభక్తి పరాయణులై జనకుని అడుగుజాడల నడచుకొనుచున్నారు సకల సద్గుణ గరిష్ఠయు, విద్యా వినయ సంపన్నయు, పుట్టినింటికి, మెట్టినింటికి కీర్తి కాంతుల వెదజల్లు సౌభాగ్యవతియునగు రూపయను కుమారీ రత్నమును గుంటూరు వాస్తవ్యులు వైశ్య కులాలంకారులు శ్రీ మారేముళ్ల హనుమంతరావుగారి కుమారుడు వెంకట అశోక్‌కుమార్ గారికి ఇచ్చి 16 3 1963 సంవత్సరమున అంగరంగ వైభవముగా వివాహమును జరిపించిరి ఈ విధముగా కన్యాదానము చేసి పితౄణము తీర్చుకొన్న పుణ్యశీలి శ్రీరామకృష్ణమూర్తిగారు

సప్త సంతానములలో ప్రసిద్ధి గాంచిన కన్యాదానాదికములలో విద్యాదాన ప్రాశస్త్యమును గుర్తించి పితృపాదుల స్మృతి చిహ్నంగా 1967 సంవత్సరములో శ్రీపైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠమును, 1969 లో శ్రీపైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత కళాశాలను,, మాతృమూర్తి శ్రీమతి అండాళమ్మ పేర 1972 లో అండాళమ్మ జూనియర్ కళాశాలను, స్థాపించి తమ మాతాపితృభక్తిని వెల్లడించుకొన్నారు తమ ప్రపితామహుల యెడల గల గౌరవభావంతో పైండా వెంకన్న - రామకృష్ణయ్య ట్రస్టు డిగ్రీ కళాశాలను 1974 లో కాకినాడలో స్థాపించి కడు సమర్ధవంతంగా నిర్వహిస్తున్నారు

పితృపితామహ ప్రపితామహాదులైన సత్యనారాయణమూర్తి, వేంకటాచలపతి, వెంకన్న - రామకృష్ణయ్య గార్ల దానధర్మాదికములతో నిర్మించబడిన ద్రాక్షారామ, కోటిఫలి, భద్రాచల ప్రాంతములలోని అన్నసత్రములకు, ద్రాక్షరామంలోని శ్రీపైండావేంకన్న-రామకృష్ణయ్య జూనియర్‌కళాశాలకు, హైస్కూలునకు, వేదపాఠశాలకు, కాకినాడలోగల పైండా రామకృష్ణయ్య ప్రిన్సు ఆఫ్ వేల్సు సత్రమునకు, రావుబహాదుర్ పైండావేంకటాచలపతి చౌల్ట్రీ అండ్ ఛారిటీస్ నకు ద్వాదశ ధర్మ సత్రమునకు వంశపారంపర్య మేనేజింగ్ ట్రస్టీగా నుండివాటి అభివృద్ధికి నిరంతర కృషి సల్పుచు అందరి మన్ననలకు పాత్రులగుచున్నారు

1981 లో శ్రీమతి పైండా సత్యవతి శ్రీరామకృష్ణమూర్తి గార్ల పేరుతో హిందూమత ప్రచారనిధి ఏర్పాటు గావించి ఆర్ష సంస్కృతికి అండగా నిలిచారు



శ్రీ పైండా శ్రీరామ కృష్ణ మూర్తి గారి జ్యేష్ఠ పుత్రులు
శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్య ప్రసాద్
వారి సతీమణి శ్రీమతి వెంకట నాగసుశీల గారలు



శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారి కనిష్ఠ పుత్రులు
డా॥ శ్రీ పైండా విశ్వనాధ కుమార్ M.B ,B S ,D.A
వారి సతీమణి శ్రీమతి శ్యామల గారలు



శ్రీ పైండా శ్రీరామ కృష్ణ మూర్తి గారి ఏకైక పుత్రిక
శ్రీ మారేమల్ల వెంకట అశోక కుమార్ గారి
సతీమణి శ్రీమతి రూప



శ్రీ పైండా శ్రీరామ కృష్ణ మూర్తి గారి సోదరులు
శ్రీ పైండా రామకుమార్ గారు

1991 లో శ్రీరామకృష్ణ వానప్రస్థా శ్రమ స్థాపన గావించి వృద్ధుల సంక్షేమమునకు మార్గదర్శకులయ్యారు శ్రీపైండా విద్యాసంస్థల అధినేత శ్రీపైండా శ్రీరామకృష్ణమూర్తి B Com, గారు తమసహధర్మ చారిణి శ్రీమతి సత్యవతి జ్ఞాపకార్థం ద్రాక్షారామంలో P.V R. హైస్కూలుజూనియర్ కళాశాల ఆవరణములో " శ్రీమతి పైండాసత్యవతి వికలాంగుల ఆశ్రమపాఠశాలను, దానికనుబంధముగా విద్యార్థుల వసతిభవనమును (హాస్టల్) 1992 అక్టోబరు 5వ తేదీని ప్రారంభంగావించారు. శ్రీమతి పలివెలసత్తిరాజా వాసవీ హాస్టలులో గదినిర్మాణమునకు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలన సంస్థకు, తిరుమల పుణ్యక్షేత్రంలో సత్రం నిర్మాణమునకు, హైదరాబాదులో హరేరామ హరే కృష్ణ మతావలంబులు నిర్మించిన దేవాలయములకు శ్రీ రామకృష్ణమూర్తి గారు భూరి విరాళము లొసంగుచు తమ వదాన్యతను వెల్లడించు కొనుచున్నారు

కాకినాడ పట్టణములో నిర్వహింపబడు ఆధ్యాత్మిక సంస్థలలో – రోటరీమున్నగు స్వచ్ఛంద సంస్థలలో – గీతామందిరములో – సంస్కృతవిద్యా పీఠంలో ఉపన్యాసములు గావించు కవులను – పండితులను ఘనంగా సత్కరిస్తున్నారు. పీఠాధి పతులకు తమ స్వగృహంలో పాదపూజలుగావించి వారి ఆశీస్సులు పొందిన పవిత్ర శిరస్కులు. 1981 లో జరిగిన ఆంధ్రప్రదేశ్ సాధుసమ్మేళనమునకు ఆర్థిక – హార్దిక సహాయముచేసి సర్వులమన్ననలందు కొన్న పుణ్యశీలి. ఏమతాధిపతులుగాని, సాధుసన్యాసులు గాని కాకినాడ పట్టణమునకరుదెంచిన వేళ శ్రీ రామకృష్ణమూర్తి గారి గృహములో భిక్ష స్వీకరించుట అనూచానముగా వస్తున్న సంప్రదాయం

శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృతవిద్యాపీఠం అధ్యక్షులుగా, ఆంధ్రప్రదేశ్ విశ్వహిందూ పరిషత్ ఉపాధ్యక్షులుగా, గీతామందిరం అధ్యక్షులుగ – హరనాధ బాబా మందిరం గౌరవాధ్యక్షులుగ, కాత్యాయినీ సహిత కైలాస సహస్రమహాలింగేశ్వర స్వామి వారి ఆలయ నిర్మాణకమిటీ అధ్యక్షులుగా – 1983–84 సం॥లో రోటరీ సెంట్రల్ ప్రెసిడెంటుగా పలుపదవులను నిర్వహిస్తూ వాటికి వన్నె చేకూరుస్తున్నారు.

ఈ విధంగా పలు విద్యా – సాంస్కృతిక – సాహిత్య – ఆధ్యాత్మిక సంస్థల అధినేత యైన శ్రీరామకృష్ణమూర్తిగారు సాహిత్యానికి చలువపందిళ్లువేయించి సాహిత్య సమారోహాలు, కవి – పండిత సన్మానాలు, వేద పండితుల సత్కారాలు, విశ్వ హిందూ పరిషత్ ప్రాంత అధ్యక్షులుగా సభా నిర్వహణాలు ఇలా ఎన్నెన్నో సత్కార్యక్రమాలు

నిర్వహిస్తూ అందరి చేత ఓహోహోయనిపించుకొంటున్న మహా మనీషి శ్రీరామకృష్ణమూర్తి గారు. 1988 సంllరంలో ప్రాచార్య యస్వీ జోగారావు M A Ph D (H O N D Litt, Andhra and World Universities, గారిచే రచించ బడిన "మణిప్రవాళము" ప్రముఖ న్యాయవాది శ్రీ వడ్లమాని వెంకటరమణ B A B L గారిచే 1984లోరచించబడిన **"పలుకుబడి"** గ్రంధములకు కృతిభర్తలుగ కృతి కన్యాద్వయ పాణిగ్రహీతలైన సుకృత మూర్తులు శ్రీరామకృష్ణమూర్తి గారు.

కనిష్ఠపుత్రులగు శ్రీరామకుమార్ గారు ఆదోని వాస్తవ్యులు శ్రీ టి జి. ప్రహ్లాద శెట్టి - శ్రీమతి భాగ్యమ్మ దంపతుల కుమార్తె సువర్ణను పరిణయం చేసుకొన్నారు వీరు తమ తాతముత్తాతలవలె రాజకీయములలో చురుకుగా పాల్గొంటూ తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసు సేవాదళ్ ఆర్గనైజరుగా సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ ముఖ్యంగా యువజనులలో దేశభక్తిని సేవాభావాన్ని పెంపొందిస్తున్నారు. సాహిత్యం పట్ల - కవి పండితులపట్ల ఆదరాభిమానములు గలవారగుటచే తమ జనకులు శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృతవిద్యాపీఠం ఉపాధ్యక్షులుగా, శతావధాన ఆహ్వానసంఘ ఉపాధ్యక్షులుగ శతావధాన కార్యక్రమనిర్వహణలో తమ అగ్రజులు శ్రీరామకృష్ణమూర్తి గారికి చేదోడు వాదోడుగా ఉంటూ తమ సహకారమందిస్తూ అన్నగారు చేపట్టిన శతావధాన కార్యక్రమం విజయవంతం అవడానికి కృషిచేశారు.

కాకినాడ చరిత్రకు సార్థకతను చేకూర్చేది, సువర్ణాక్షరాలతో లిఖింపదగినది, సర్వదా కాకినాడ ప్రజల హృదయాలలోనే కాక యావదాంధ్ర దేశ కవి -పండిత హృదయాలలో మూర్తిమంతమై నిలచేది, పైండా వంశకీర్తి పతాకం అంబరచుంబితమై శోభిల్లేది, ముఖ్యంగా శ్రీరామకృష్ణమూర్తి గారి ఔదార్యమునకు, త్యాగశీలతకు, సాహిత్యాభిమానానికి సాక్షీభూతంగా నిలచు సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానాన్ని 1967 లో స్థాపింపబడి రిజిష్టర్డు సంస్థగా రూపొందిన శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యా పీఠం ఆధ్వర్యమున 1992 మేనెల 9,10,11 తేదీలలో కాకినాడ తిరుమల తిరుపతి దేవస్థానం వారి కళ్యాణ మండపంలో "స్వర్ణ కంకణ విభూషితులు - శతావధాని సమ్రాట్" శ్రీ మాడుగుల నాగఫణిశర్మ గారిచే నిర్వహింప జేసి శతాధిక పృచ్ఛకుల, కాకినాడ పురప్రజల ప్రశంసలకు పాత్రులయిన శ్రీ రామ కృష్ణమూర్తి గారు అందరి అభిమానమును చూరగొన్నారు.

మూడు రోజుల శతావధానం సంక్రాంతి పర్వదినాలను స్ఫురణకు తెచ్చింది. తిరునాళ్లవలె జరిగిన ఈ శతావధానం పైండా వంశానికి కలికితురాయిగ శోభిల్లుతోంది. శతావధాన కార్యక్రమ బాధ్యతలను స్వయముగ స్వీకరించి ఆర్థిక సహకారముతో పాటు లంబరిమును కూడా సమకూర్చి స్వీయ పర్యవేక్షణలో ఒక వంక శతావధాన సాహిత్య విందు వేరొక వంక పృచ్ఛకులకు, ప్రత్యేకాహూతులకు షడ్రసోపేతమైన విందు భోజనము మూడు రోజులు సమకూర్చి తమ త్యాగనిరతిని, నిరతాన్న దాన శీలతను ప్రకటించుకొన్న సౌజన్యమూర్తి శ్రీరామకృష్ణమూర్తి గారు తమ కుటుంబ సమేతులై శతావధాన కార్యక్రమంలో పాలు పంచుకొన్నారు వారి ద్వితీయ పుత్రులు డా॥ శ్రీ విశ్వనాథ కుమార్ యమ్ బి బి.యస్ గారు శతావధాని గారికి నిలువెత్తు సన్మానపత్రం సమర్పించి గౌరవించారు శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృతవిద్యాపీఠం తరపున శ్రీరామకృష్ణమూర్తిగారు శతావధాని గారికి **"శతావధాని చూడామణి"** బిరుదు ప్రదానం గావించినారు వారి జ్యేష్ఠపుత్రులు శ్రీ సుబ్రహ్మణ్య జగన్నాథ సత్య ప్రసాద్ గారు శతావధాన సభాసంచాలకత్వముగావించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి ఘనసత్కారంగావించారు. ఈ మరపురాని మధురసన్నివేశములు పైండా వంశ చరిత్రలో శాశ్వతత్వమును సంతరించుకొనగలవు.

ఆర్షవిద్యా సంస్కృతిని, సంస్కృతభాషను, ప్రాచీన తెలుగు సాహిత్యాన్ని అపరభోజుని వలె ఆదరించి పోషించుచున్న శ్రీ రామకృష్ణమూర్తి గారికి, వారి కుటుంబ సభ్యులకు ద్రాక్షారామ భీమేశ్వరస్వామి, శ్రీ వేణుగోపాల స్వామి, శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ దేవి ఇతోధికైశ్వర్యాది సంపదలను, తరగని యశస్సును ఆయురారోగ్య విభవములను సర్వదా సమకూర్చుచుందురుగావుత !

**రచయిత : మధురకవి – శ్రీపాద శ్రీరామమూర్తి**

**సహకార్యదర్శి :**

**శ్రీ పైండా సత్యనారాయణమూర్తి**

**సంస్కృత విద్యాపీఠం– కాకినాడ.**

**కార్యదర్శి : శతావధాన ఆహ్వాన సంఘం**



జననం : 1959 సం॥

జన్మస్థలం : కడవకొల్లను, అనంతపురం జిల్లా

విద్యార్హతలు : ఎమ్ ఎ (సంస్కృతం)

వృత్తి : అదనపు కార్యదర్శి - ధర్మ ప్రచార పరిషత్ - తిరుమల తిరుపతి దేవస్థానములు - తిరుపతి

స్వర్ణకంకణ విభూషిత- శతావధాని సమ్రాట్

శతావధాని చూడామణి

## శ్రీ మాడుగుల నాగఫణిశర్మ

స్వర్ణకంకణ విభూషిత -శతావధానిసమ్రాట్ – శతావధానిచూడామణి శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారు ఊనషోడశవర్షంలోనే అష్టావధాన విద్యా ప్రదర్శనకు పట్టంకట్టిన మనీషి ఉభయభాషాప్రౌఢితో 225 అవధానాలుచేసారు పుట్టినజిల్లాలోనే అష్టావధానాన్ని పదింతలు పెంచి (దశ గుణిత) చూపి స్వర్ణ కంకణం వేయించుకొనిన చేయి వీరిది.

దర్భాంగా విశ్వవిద్యాలయం వారి ప్రోత్సాహంతో పాట్నాలో రాజ్ భవన్‌లో వీరు నిర్వహించిన సంస్కృత అవధానం, బీహారు గవర్నరుగారిచే వీరు పొందిన సత్కారం జన్మనిచ్చిన రాష్ట్రానికే కీర్తి తెచ్చాయి. శంకర జయంతినాడు రాష్ట్ర రాజధాని హైదరాబాదులోని శంకరమఠంలో జగద్గురువులు శ్రీ భారతీ తీర్థస్వామివారి సన్నిధిలో వీరి సంపూర్ణ సంస్కృత శతావధాన భారతి రుద్రాక్షదీక్షా సమన్వితమై ప్రపూతమైంది.

మాచెర్ల శతావధానంలో కనకాభిషేకం. మరొకచోట ముత్యాలజల్లు. వేరొకచోట ఆందోళికాభోగం వంటివి వీరు పొందిన గౌరవాలు. ప్రమోద ఉగాది రాష్ట్రముఖ్యమంత్రి

గారిచే సన్మానము చేయించిందంటే కాలం వీరికి కంఠహారం వేసినట్లే కదా! త్రిదశుడైన ఈ అవధాని గురించి ఎన్నని చెప్పడం, ఎంతని వ్రాయడం ఆయన విద్యామృతపానం చేసారు రసజ్ఞులపై అమృతపు జల్లులు కురిపిస్తున్నారు ఓంకార గణపతి, ఊర్మిళ నిద్ర, క్షీరసాగరమథనం, కుమార సంభవం వీరి కవితల్లో పేర్కొనదగినవి కవితా వైభవానికి తోడుగా గాన కౌశలం వీరిసొత్తు

ఈ శతావధానం సాహితీ ప్రియులమైన మనకెంతయో ఆనందదాయకం మరొక్క మాట :

ఈయన వాక్కు మనల్ని తన్మయం చేయడమే కాదు సాక్షాత్తు కలియుగ దైవం శ్రీ శ్రీ శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి వీరు తన పై పాడిన దేశ భాషా సుప్రభాతానికి అనుగ్రహించి భారతదేశ ఉపరాష్ట్రపతిచే సన్మానింప చేసేడంటే ఈ అదృష్టం ఎంతమంది సాధకులకు లభిస్తుంది ? ఈ దేవతానుగ్రహం నాగఫణిశర్మ గారికి శతాయు పర్యంతం చైతన్యాన్ని ఇస్తూనే ఉంటుంది

సేకరణ

**మధురకవి – శ్రీ శ్రీ శ్రీ**

* * *

శ్రీ మత్పరదేవతాయై నమః

" సాహిత్య విద్యా ప్రవీణ "
"రాష్ట్రభాషాప్రవీణ"
"సంస్కృతభాషాకోవిద"

సంస్కృతోపన్యాసకులు
పిఠికాపురాధీశ ప్రభుత్వ డిగ్రీ కళాశాల
కాకినాడ

# కొల్లూరు అవతారశర్మ, MA (సం) MA (ఇ) BSC BEd

(ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణపతక పురస్కృతులు)

తేదీ ఆంగిరస చైత్ర బహుదశమి

## ప్ర వే శి క

### అవధానం ఒక మహావిద్య – ఒక మనోయోగం:

సాధనామార్గంలో పరికిస్తే గనుక అవధాన మొక మహా విద్యగా గోచరిస్తుంది ఉపయోగదృష్టికి లేదా వినియోగదృష్టికది కళగా సాక్షాత్కరిస్తుంది ఎలా కనిపించినా దాని తత్త్వం మాత్రం చిత్తైకాగ్రతను ప్రదర్శించడమే నని వ్యుత్పత్తిని బట్టి తెల్లమవుతుంది 'అవ' – పూర్వక – 'డు ధాఞ్ – ధారణ పోషణయోః' అనే ధాతువు నుండి, 'అవధాన' పదం నిష్పన్నమైందని చెప్ప వచ్చు. ఏతదనుగుణంగానే వామనుడు 1 'చిత్తైకాగ్ర్యమవధానమ్' అని నిర్వచించి ; బాహ్యార్థవృత్తినే చిత్తైకాగ్రతగా వివరించి, 2 'అవహితంహి చిత్త మర్థాన్ పశ్యతి' – అంటే అవధానాన్ని పొందిన మనస్సే అసలైన తత్త్వాన్ని చూడ గలుగు తుందని అవధాన ప్రయోజనాన్ని నిర్దేశిస్తాడు ఇదే విషయాన్ని సమర్థిస్తూ శబ్దార్థ కల్పతరువు అవధానాన్నొక 'మనోయోగం' గా నిర్వచించింది

1 కావ్యాలఙ్కార సూత్ర వృత్తి – (3–17) పుట–

2. చిత్తైకాగ్ర్యం బాహ్యార్థ నివృత్తి స్తదవధానమ్ – (అదే పుట).

'అవధాన పరేచకారసా' – అనికాళిదాసు; 1 'కృతావధానం జిత – బర్హిణధ్వనౌ' అని భారవి; 2. 'మమైతస్మిన్ దృష్టే హృదయమవధానం రచయతి' అని భవభూతి; 3. 'దత్తావధానులరై వినుండని నన్నయ; 4 'అవధానంబుతో

నవధరింపు మని తిక్కన; 5 యిలాగే మహాకవులెందఱో యీ అవధాన శబ్దాన్ని ఇదే యర్థంలో ప్రయోగించేరు

అసలీ యవధానశబ్దం పటిష్ఠమైన వేదాధ్యయనాపరపర్యాయంగా ప్రయోగింపబడేది వచ్చేదాకా చెప్పుకొని చచ్చేదాకా వల్లె వేయవలసినది వేదవిద్య వేదంలో సరూపపదాలు పర్యాయక్రమంలో ప్రయోగింపబడటం చేత, ఒక పన్నంలోంచి మరో పన్నంలోకి మారి తప్పు చెప్పే ప్రమాదం ఉంది దీన్నే 'కొళులు తప్పడం' అంటారు. ఇలా కొళులు తప్పకుండా అప్రమత్తతతో వేదాన్ని సుస్వరంగా వప్పచెప్పడాన్ని అవధానమనిన్నీ అలాచెప్పేవాణ్ణి 'అవధాని' యనిన్నీ అంటారు ఈ శబ్దం క్రమంగా పురోహితసామాన్యవాచిగా వ్యవహారంలోకి వచ్చి పరిహాసపాత్రమైన పాత్రగా తుదకు సాహిత్యంలో చోటుచేసుకుంది

ఏమైనా అవధానశబ్దం చిత్తైకాగ్రతతో సాధించవలసిన ఒక మహావిద్య లేక మనోయోగమనేది నిర్వివాదాంశం.

**అవధానం — ఒక కళ :—** అవధానాన్నొక కళగా రూపొందించిన ఘనత మన తెలుగు వారిదేయంటే అతిశయోక్తి కాబోదు నన్నయభట్టు సహాధ్యాయియైన నారాయణభట్టు – 'అష్టాదశావధారణ చక్రవర్తి' గా నందంపూడి శాసనంలో పేర్కొన బడ్డాడు ప్రాచీనాంధ్ర కవితల్లజులలో భట్టుమూర్తి – 'సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి' మఱింగంటి సింగనార్యుడు – "అశుకవితాష్ట భాషా విశేష శేముషీప్రాభవ సంపన్నుడు' గుడారు వెంకటదాసు –'అష్టభాషావధానప్రౌఢుడు'. చరికొండ ధర్మన్న – 'శతలేఖిన్యవధాన పద్యరచనా సంధానసురత్రాణ చిహ్నిత నాముఁడు'. పసుపులేటి రంగాజమ్మ – 'అతులితాష్టభాషా కవితా సర్వంకష మనీషా

---

1.కుమారసంభవము ( 4–2)

2. కిరాతార్జునీయం (4–33)

3. ఉత్తరరామచరితమ్ (5–16)

4. ఆంధ్ర మహాభారతం – ఆదిపర్వం – (1–31)

5. ఆంధ్ర మహాభారతం శాంతిపర్వం (1–14)

విశేషశారద' రామభద్రాంబ 'అష్టభాషా కల్పిత చతుర్విధ కవిత' ఇలా అష్టభాషాకవిత్వ పటుత్వ మానాటికవులయవ ధాన విశేషమని చెప్పవచ్చు తంజాపురాంధ్రనాయక రాజుల 'శారదాధ్వజ' సభలో కవులు అష్టభాషల్లో సమస్యాపూరణం గావించేవారని ప్రతీతి. ఏవంవిధ సమస్యా పూరణమొక నిరుపమసాహితీవినోదము ఇలా ఒక విద్య ఆనందజనకమైన ఉపాధిగా రూపొందితే గనుక అది కళగా వ్యవహరింప బడుతుంది

ఈ విధంగా మొదలైన అష్టభాషాకవితా ప్రావీణ్యము కాలాంతరంలో ప్రక్రియా వైవిధ్యాన్ని సంతరించుకొని – శతావధానము , సహస్రావధానము; అష్టావధానము

దాని ప్రస్తారప్రభేదాలైన ద్విగుణిత, త్రిగుణిత, చతుర్గుణిత, పఞ్చగుణిత, దశగుణితాష్టావధానాలూ, సంగీతాష్టావధానం – యిలా యెన్నెన్నో స్వరూపాలతో విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది ఈ అవధాన విద్య ఆశుకవితా సీమనుల్లంఘించి, శతకలశావధానము, గణితావధానము, నేత్రావధానము, అక్షరముష్టికావధానము – యిలా బహురూపాంతరాలను పొంది తనకళాసీమను విస్తరింప చేసికొంది అవధానాలిలా బహుముఖాలుగా ప్రస్తరించినా అవధానం పేరు చెప్పగానే స్ఫురించేవి అష్టావధాన శతావధానాలు రెండే.

అడపాతడపా, ఆ ఊళ్లో యీ ఊళ్లో అష్టావధానాలను చూస్తూనే ఉన్నాం రేడియో, దూరదర్శన్ వారు కూడా అష్టావధాన కార్యక్రమాలను ప్రసారం చేస్తున్నారు కాబట్టి అష్టావధాన ప్రక్రియను వదిలిపెట్టి ప్రస్తుతమైన శతావధానాన్ని కొద్దిగా వివేచిద్దాం!

## శతావధానం – దాని పుట్టుపూర్వోత్తరాలు :–

అవధానాలకు పుట్టినిల్లైన ఆంధ్రదేశంలోనే శతావధాన మంటే యేమిటో తెలియని రోజులివి. అందుకే యీ ప్రయత్నం చిత్ర భారతకర్త యైన ధర్మన్న, ప్రబంధాంక భట్టు మూర్తి యైన రామరాజ భూషణుడు మొదలగువాళ్లు శతలేఖిన్యవధాన పద్యరచనాధురీణులుగా శతలేఖినీ పద్య సంధాన ధౌరేయులుగా తమను గూర్చి చెప్పుకున్నారు కాబట్టి, నాటి శతావధానపుటునికి వెల్లడయ్యింది. ఈ శతాబ్దంలో చూస్తే గనుక, తెలుగునాట శతావధానానికి శ్రీకారం చుట్టిన వారు శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు. వీరు 'అభినవ పండితరాయ' బిరుదాంచితులు పశ్చిమ

గోదావరి జిల్లాలోని పెంటపాడులో వీరి అష్టావధానాన్ని చూచి శ్రీ చెళ్లపిళ్ల వారు ప్రబావితులైనారట! తిరుపతి వేంకట కవుల తరువాత పేర్కొన దగిన శతావధాని శేఖరులు దేవులపల్లివారు , కొప్పరపుకవులు, రామకృష్ణకవులు శ్రీమాన్ కాశీ కృష్ణాచార్యులుగారూ, రాజశేఖరకవి, గడియారం శేషశాస్త్రిగారు, గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు, వేలూరి శివరామ శాస్త్రిగారు, డా సి వి సుబ్బన్న శతావధాని, ప్రస్తుతం నిండారు యవ్వనంలో యీ శతావధాన కళను దిగ్విజయంగా ప్రదర్శిస్తున్న వర్ధమాన శతావధానులైన శ్రీయుతులు కడిమెళ్ల వరప్రసాద్ గారు, మాడుగుల నాగఫణి శర్మగారూ, మేడసాని మోహన్ గారు అభినంద్యులు

అవధాన ప్రక్రియ - బహుముఖ ప్రజ్ఞాశాలియైన వాడే శతావధాన సభను రక్తి కట్టించగలడు ఆశుకవిత్వ ధారా శుద్ధితో పాటు, శ్రావ్యంగా పద్యాన్ని చదువగలిగి యుండాలి లేకుంటే పృచ్ఛకశతమే సభ్యులుగా మిగులుతారు ఆశువుగా కవిత్వధార వెలువడకుంటే సభ్యులకు విసుగుపుడుతుంది దానిలో సమయోచితంగా చమత్కారం కూడా మేళవింప బడాలి ఈ Timely Wit లేదా సమయోచిత చమత్కారచాతురి బంగారానికి తావి కూర్చినట్లుగా అవధానస్ఫూర్తిని ఇనుమడింప చేస్తుంది ఈ యసాధారణ ప్రజ్ఞలన్నింటికీ మకుటాయమాన మనదగినదీ శతావధానానికి ప్రాణభూతమైనదీ 'ధారణ' ఈ యసాధారణ ధారణాబలం జీవితాంతమూ నిలచిన యేకైక వ్యక్తి శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు మాత్రమేనని వారినెఱిగిన విజ్ఞులు చెబుతారు సాధారణంగా వయస్సు పెరిగే కొద్దీ ధారణాశక్తి క్షీణిస్తూ ఉంటుంది శతావధానం లో ధారణ స్వరూపాన్ని గుఱించి కొద్దిగా తెలుసుకొందాం! సాధారణంగా శతావధానంలో వందమంది పృచ్ఛకులుంటారు. వాళ్లడిగిన విషయాలను కోరిన వృత్తాలలో లేక పద్యాలలో మొదట తలకొక పాదం చొప్పున చెప్పుకుంటూ పోవాలి. తరువాత రెండవపాదాన్ని మళ్ళా విషయాన్ని గురించి గాని, వృత్తాదులను గురించి గానీ ప్రశ్నించకుండా లేదా వారిచే అందించుకోకుండా చెప్పాలి. ఈ ద్వితీయా వృత్తిలో సఫలీకృతుడైతే అవధానికి ధారణ స్థిరపడినట్లే. తరువాత క్రమంగా మూడు, నాలుగు పాదాలు చెప్పి చివరన యెవరిపద్యాలను వారికి వప్పగించాలి ఈ విధమైన ధారణతో అవధానం ముగుస్తుంది. సంగ్రహంగా యిదీ శతావధానస్వరూపం. ప్రాచీనులీ శతావధాన ప్రక్రియలో సమస్య, వర్ణన అనే అంశాలనే ప్రధానంగా స్వీకరించినట్లు కనబడుతుంది..

## శతావధానంలో కవిత్వం :-

శతావధానంలో కవిత్వం యెలా ఉంటుంది? అనే ప్రశ్నకు సూటిగా జవాబి వ్వాలంటే -' అంత ఉత్తమోత్తమంగా ఉండ' దనే చెప్పాలి.అడిగిన విషయాన్ని కోరినవిధంగా ఆశువుగా చెప్పడంలో, పృచ్ఛకులు క్లిష్టతర విషయాలను ప్రశ్నిస్తే గనుక, ఆ చిక్కులను విడదీయడం అవధాని యొక్క మనస్సూ బుద్ధీ కేంద్రీకృతాలై యుండడం వల్ల, కవిత్వధార బుద్ధిలోనుండి ప్రవహిస్తుందేతప్ప, యెదలో నుండి వెల్లువగా పెల్లుబుకదు గుండెలోతునుండి వచ్చిన కవిత్వమే గుండెల్ని కదిలిస్తుంది అందుచేత అవధాన కవిత్వ మంతా ఆర్ద్రంగా రసస్ఫూర్తి కల్గించేదిగా నుండదు ప్రతిభాశాలురగు అవధానులకు బహుపద్యములు రస సిద్ధితో స్ఫురించవచ్చు అట్టి యవధానములు, అవధానియొక్క ధారాశుద్ధి, పృచ్ఛకుల సౌహార్దము, సభ్యుల సౌభాగ్యముల సమాహారఫలితంగా అరుదుగా లభిస్తాయి.పృచ్ఛకులు సహృదయులై సరళములైన విషయాలను ప్రశ్నించి నట్లయితే, కవితాధార హృదయాంతరాళం నుండి నిరంతరంగా రసస్ఫూర్తితో నిర్గమించి ప్రబంధాయమానములైన పద్యరత్నాలు లభిస్తాయి అవధానంలో ధారణాపటిమను పరీక్షించడమే ప్రధానము కాని, అవధాని యొక్క పాండితీ ప్రాభవాన్ని పరీక్షించడం కాదు. అవధానియైన ప్రతీవాడూ సర్వజ్ఞుడు కాలేడు కదా! కానక్కర్లేదు కూడా కాబట్టి, పృచ్ఛకుల ప్రశ్ననమున కనుగుణంగా రసవత్కవిత్వముదయిస్తుందని పిండితార్థం

**శతావధాన క్లేశము :-** కవితారీతుల్లో నిష్ణాతులైన వందలాది పండిత ప్రకాండుల మధ్య, తనపాండితీ శౌణ్డీర్యాన్ని ప్రదర్శించవలసి యుంటుంది. శబ్దవైచిత్రి , అర్థచమత్కృతి, దుష్కరప్రాసలు, శాస్త్రరహస్య గర్భితాలూ అయిన బహువిధ విషయాలలో అందరినీ యానందపరచేలా, ఆశువుగా పద్యాలను చెప్పాలి ఇలా చెప్పేటప్పుడు యెక్కడ యేమాత్రం తప్పినా ఆయా స్థలాల్లో వెంటనే

**సీ॥ ప్రథమపాదముఁ జెప్పి పైని దండము పెట్టు**
**నట్టి వాడేటి శతావధాని?**
**నియమముల్ లేకున్న నేర్పుజూపింతున**
**న్నట్టి వాడేటి శతావధాని?**
**వేమారు విషయంబు వినిపింపుమని యడ్గు**

నట్టి వాడేటి శతావధాని?
ధారణాగరిమంబు దారిద్ర్యముగనున్న
యట్టి వాడేటి శతావధాని?
దొంగతనముగ వ్రాతల దొంగిచూచు
నట్టి వాడెట్లు తాను శతావధాని?

అని కాకులూ రాబందులూ పొడిచినట్లు పొడుస్తారు ఆయన మాన శరాఘాతాలను నిండుసభలో తట్టుకోవడం ఊహించడానికే భయావహమైన సన్నివేశం. ఇలాకాకుండా, తన యసాధారణ ధారణాబలం చేతగాని, లేదా, పలువురవధానులు చెప్పుకునేటట్లుగా తమ ఉపాస్యదేవతానుగ్రహబలం చేతగాని, ఈ బాలారిష్టాలన్నింటినీ దాటి యవధాని విజయం సాధించి నట్లయితే చమత్కారంగా పై పద్యాన్నే

'వెదకి చూచిన నిసుమంతకొదువ లేక

శతవధానమ్ము సల్పితాశ్చర్య లీల !!' – అని పూరించి పొగడ్తలతో ముంచెత్తేస్తారు ఇకపై యవధానికి గండపెండేరాది బహుమానాలూ, స్వర్ణమౌక్తికాభిషేకాలూ, గజారోహణలూ, యిలా యెన్నెన్నో సమ్మానాలూ, సత్కారాలూను

## శ్రీ నాగఫణి శర్మగారి ప్రస్తుత సంస్కృతాంధ్ర శతావధాన విశేషాలు:

శ్రీయుతులు నాగఫణి శర్మగారి యశః కిరీటంలో కలికితురాయిగా లేదా వారి కీర్తిపతాకగా యీ కాకినాడ – సంస్కృతాంధ్రశతావధానాన్ని పేర్కొనవచ్చు. తిరుపతి వేంకటకవులచే ప్రప్రథమముగా శతావధానము జటిపించిన ఘనత కాకినాడదే యన్న విషయం ఈ సందర్భంలో ఎంతైనా స్మరింపదగినది. శతావధానులు, అష్టావధానులు, యింకా యెందరెందరో పండిత ప్రకాండులైన శతాధిక (104 మంది) పృచ్ఛకులతో కన్నులవైభవంగా వీనులవిందుగా జరిగిన యీ యవధాన మనన్యయాలంకారానికి లక్ష్యమని చెప్పవచ్చు. అంటే దీనికిదే సాటి యన్న మాట! తిరుపతి వేంకట కవులనాడే పృచ్ఛకులు లభించడం కష్టంగా ఉండేదట! ఆకారణంచేత కొందరర్ధశతావధానాలతోనే ముగిస్తే మరికొందరు ఆవృత్త శతావధానాలుగా అంటే లభించిన పృచ్ఛకులనే ఆవృత్తంచేస్తూ మొత్తంమీద నూరు పద్యాలు చెప్పి 'శతావధాని' అనిపించుకొనేవారు. ఛందోబద్ధ కవిత్వానికంతగా ఆదరణలేదనే వదంతిని ఈ

అవధానం వమ్ముచేసి తనదైన తనతనంతో మూడు రోజులూ వేలాది రసజ్ఞ ప్రేక్షకుల యాదరాభిమానాలను చూరగొన్నదని చెప్పవచ్చు అనువాదాన్ని ప్రత్యేక ప్రక్రియావిశేషంగా స్వీకరించడం ఈ యవధానం యొక్క మఱొక విశిష్టమైన వైలక్షణ్యంగా పేర్కొనవచ్చును తెలుగులో పద్యముల నాశువుగా చెప్పుటకలవాటు పడ్డయవధాని, అనువాద ప్రసంగంలో పదునాల్గు తెలుగు పద్యాలకు సంస్కృతీ కరణం, పదునెనిమిది సంస్కృత శ్లోకాలకు తెలుగు పద్యానువాదము చేస్తూ తన బుద్ధిని ఒక్కసారిగా మార్గమునుండి మరల్చి చివరలో నన్నింటిని యథాతథముగా ధారణ చేయుట చాల కష్టసాధ్యమైన పని సాధారణముగ ప్రాచీనులందరు వర్ణన,సమస్యల రెండింటినే ప్రధానాంశములు గా గై కొని శతావధానముల నిర్వహింపగా శ్రీ శర్మ వానితో పాటుగా దత్తపది, యనువాదములను సమతూకముతో సంస్కృ తాంధ్రములలో నిర్వహించుట ఈ యవధానపు వైలక్షణ్యము అనిదంపూర్వమగు ఈ ఘనత శ్రీ నాగఫణి శర్మదేయని చెప్పనొప్పును.

అవధానమును సందర్శించిన సహృదయులందరూ "చిరుత వయస్సు వాడయిన, శేముషిగల్గిన వాడు వీడహో" అని శ్లాఘించకుండా ఉండలేరనేటంతటి మనోనిబ్బరంతో శ్రీశర్మ అవధానాన్ని కొనసాగించేరు. ఆయన మనఃస్థైర్యానికి చేదోడు వాదోడుగాఅవధాని వరిష్ఠుడైన ఆచార్య బేతవోలు వారి సంచాలకత్వ సారథ్యం స్ఫూర్తి శ్రీ యుతంగా సహృదయ మనోరంజకంగా సాగింది

అన్ని వసతులతో హంగులతో నిరంతర విద్యుత్సరఫరా ప్రబంధంతో అతి సుందరంగా నిర్మించబడిన శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థాన కల్యాణ మంటప సభాప్రాంగణం, సభకు చక్కటి ఆహార్యాన్ని సమకూర్చగా, అతిథేయశిరోమణి శ్రీ పైండా శ్రీరామ కృష్ణమూర్తి జమీందారుగారు వచ్చిన అతిథులందరికీ ఆ నాలుగైదు రోజులూ మృష్టాన్న భోజనాలతో సంతుష్టిని ప్రసాదించగా; ఆహూతులు మరియు నాగంతకులైన రసజ్ఞులందరికీ శ్రీ నాగఫణిశర్మ తమ యాశుకవితాపీయూషస్రవంతితో స్వాంత సంతర్పణం చేసేరు అవధాని గారి పాటలు, కవితలు, అన్నమయ్యకృతుల అనువాదాలూ, శ్రీయుతులు అమళ్లదిన్నె గోపీనాథ్ గారి జానపదగీతాలు రసపిపాసువులైన శ్రోతలకు మధ్యే మధ్యే పానీయాలై శ్రవణానందాన్ని సమకూర్చాయి. అటు వేలాది సభ్యులతోనూ; యిటు వేదికపైగల పృచ్ఛకమండలిలోనూ విదుషీ

మతుల్లెందరో తమ ప్రాతినిధ్యాన్ని నిర్వహించి సభాశోభనినుమడింపచేసేరు ఇక పృచ్ఛక ప్రవరులందఱూ అందఱే ఆ పండితుల రాశిలో అందరూ వాసికెక్కిన వారే! వన్నెగలవారే! వారిగుణములనేమని చెప్పగలము! యెన్నని యెన్నగలము! చూడగలిగిన వారిదే యీశుభాగ్యము ఒక్కమాటలో చెప్పాలంటే సాహిత్యాభిమాను లంతా తమ కన్దోయి, చెవిగవ చరితార్థాలై నట్లు భావించి యానందించేరని చెప్పవచ్చు

**అవధాన విషయాలు** :- ఈ యవధానంలో సమస్య, దత్తపది, వర్ణన, అనువాదం అనే నాలుగంశాలు స్వీకరించ బడ్డాయి సమస్యను 24 మంది, దత్తపదిని 26 మంది, వర్ణనను 22 మందీ, అనువాదాన్ని32 మందిన్నీ పృచ్ఛకులు నిర్వహిం చేరు కాగా యీ నాలుగు విభాగాల్లో వెరసి 104 మంది పృచ్ఛకులు, 104 విషయాలను నిర్వహించి శతావధానానికి పరిపూర్ణత్వాన్ని సమకూర్చేరని చెప్పవచ్చు అవధాని ధారణాపటిమ, ధారాశుద్ధి కలవాడుగానున్నా, భావనాశబ్దాది దారిద్ర్యం లేనివాడుగా నున్నా ప్రకటించుకుంటే; ప్రాచ్యగోదావరీ మండల మండనాయమానమైన కాకినాడ పండిత ప్రకాండులైన పృచ్ఛకగణాలకు, రసజ్ఞులైన శ్రోతృసమూహాలకు, వదాన్యులైన సాహితీ పోషకులకు, అనుస్యూతమైన ఆతిథేయ పరంపరకు తనదైన సమృద్ధిని చాటి చూపిందనడం అతిశయోక్తి కాబోదనుకుంటాను

అవధాన విషయాల స్వరూప స్వభావాలు కొద్దిగా తెలుసుకుంటే గనుక అవధానానందాన్ని సంపూర్ణంగా అనుభవించగలుగుతాం ఇదే ఉద్దేశ్యంతో ఆయా విభాగాలకు సంబంధించిన పద్యాలకు వివరణకూడ కొద్దిగా చేర్చి, ముందుగా ఆ విభాగపు పరిచయం కూడా సంక్షిప్తంగా నిర్దేశించడం జరిగింది సమగ్రంగా కాకపోయినా యిలా కొంతమేరకైనా యీ శతావధానాన్నీ, అందులోని ప్రక్రియావైవిధ్యాలనూ, సాధకబాధకాలనూ పరిచయం చేయడమే యీ 'ప్రవేశిక' ఉద్దేశ్యమని సవినయంగా మనవి చేస్తున్నాను



# శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం అధ్యక్షులు
# శతావధాన ఆహ్వానసంఘం అధ్యక్షులు
# శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B.Com. గారి స్వాగతోపన్యాసము

• • • •

శతావధాన సభాసరస్వతికి నా హృదయపూర్వక నమస్కారములు. వేదికనలంకరించిన సభాధ్యక్షులు శ్రీ జ్యోతుల సీతారామమూర్తి గారికి, జ్యోతిప్రజ్వలనము గావించిన కాకినాడనియోజకవర్గ శాసనసభాసభ్యులు శ్రీ మల్లాడి స్వామి గారికి, సభాప్రారంభం గావించిన సూపర్‌బజార్ చైర్మన్ శ్రీ వై.డి రామారావు గారికి మా ఆహ్వానమును మన్నించి ప్రాచ్యసాహితీ ప్రాభవమును ప్రకాశింపవిచ్చేసిన స్వర్ణకంకణ విభూషితులు – శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణిశర్మ గారికి, ప్రయోక్తగా విచ్చేసిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి, రసజ్ఞహృదయ కవిపండిత విద్వన్మండలమండిత సభామండలికి, పృచ్ఛకులుగా విచ్చేసిన కవి పండితులకు, ఈ మహత్తర యత్న సాఫల్యసిద్ధికి దోహదము చేసిన వదాన్య శేఖరులకు, ఆహూతులయిన ప్రేక్షకరసజ్ఞ శేఖరులకు స్వాగత సుమనస్సుమాంజలులు.

సాహిత్య కళారంగాలకు కాణాచి అయిన కాకినాడ పట్టణములో నేడు జరుగుచున్న సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానము కాకినాడ చరిత్రపుటలలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినది గా భావిస్తున్నాను. కవి పండితులగు తిరుపతి వేంకటకవులు – వారిని పోషించిన పోలవరం జమీందారుగారు, విద్యా, వైజ్ఞానిక ప్రగతికి చేయూత నిచ్చిన శ్రీ పీఠికాపుర సంస్థానాధీశులు, శ్రీ పైండా రామకృష్ణయ్యగారు, శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్‌గారు, వైద్య – వేద విద్యా సంస్కృతాభివృద్ధికి, పట్టణ మంచినీటి సదుపాయములకు ప్రత్యేకకృషిసల్పిన రావుబహాదుర్ శ్రీ పైండా వేంకటాచలపతిగారు, శ్రీ నాళం రామలింగయ్యగారు, నిరతాన్నదాతలుగా ప్రఖ్యాతి గాంచిన శ్రీ పైండావారు, శ్రీ ముత్తావారు, శ్రీ బచ్చువారు, శ్రీ బొగ్గవరపు వారు, విద్యార్థుల– బాటసారుల

పాలిటి పెన్నిధులు. సంగీతాది లలితకళలను ప్రోదిచేసిపెంచిన కీ శే. దంటు సూర్యారావు గారు, శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణ గారు, మా నగర ప్రముఖులుగా వన్నెకెక్కినవారు త్యాగమూర్తి మహర్షి బులుసు సాంబమూర్తిగారు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు, సాంఘిక దురాచారములను బాహాటముగ ఖండించిన సాహిత్య చక్రవర్తి శ్రీ కాశీభొట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు, వేదవిజ్ఞానఖని, వేద భాష్యవిశారదులు శ్రీ ఉప్పులూరి గణపతి శాస్త్రి గారు మా కాకినాడ పురీమతల్లికి నూతనాలంకారములు. ప్రాచీన సంస్కృతీ సంప్రదాయములకు మూలకందములయిన మా నగరవాసులు నేడు శతావధానము చేయించుటలో అమితోత్సాహముతో ఉరకలు వేయుటముదావహము.

శతావధాన ప్రక్రియను తిరుపతి వేంకటకవులు మన కాకినాడ పట్టణములో ప్రారంభించిన తొలిఘడియలు అది 7,8 దశాబ్దముల పూర్వపుమాట తిరిగి నేడు శ్రీమాడుగుల నాగఫణిశర్మ గారు సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానము చేయుటకు మన పట్టణమునకు విచ్చేయుటమాకు, మా పట్టణమునకు ఒక నూతన శోభను చేకూర్చిపెట్టినది. వారికి మా ధన్యవాదములు

మహాశయులారా! మనవాఙ్మయాభివృద్ధి కవి పండిత ప్రకాండుల భుజస్కంధ ములపై నున్నది. ఇట్టి కవి పండితులను ఆదరించు బాధ్యత నేటి ప్రజలపైనున్నది ఈబాధ్యతలను గుర్తించి ముందుకు వచ్చిన మానగరవదాన్యులకు నా ధన్యవాదములు మా ఆహ్వానమును మన్నించి వచ్చిన కవి పండితులకు నా నమోవాకములు సుమనసులకివే మా హృదయకుసుమార్పణములు. శతావధాన కార్యక్రమము జయప్రదమగునట్లు దీవించుచు కళామతల్లికి నీరాజనము పట్టి మా పట్టణ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింప చేయవలసినదిగా భగవంతుని ప్రార్థించుచున్నాను



# శతావధాన కార్యక్రమసమీక్ష
## శ్రీపాద శ్రీరామమూర్తి - శ్రీ శ్రీ శ్రీ
## సహకార్యదర్శి
## శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం (రిజిష్టర్డు) కాకినాడ
## కార్యదర్శి
## శతావధాన ఆహ్వాన సంఘము

■ ■ ■ ■ ■

ఏనాడో వేదంలో పుట్టిన అవధానవిద్య నేడు సాహిత్యంలో ప్రవేశించి మన కళ్లముందు సాక్షాత్కరిస్తోంది అవధానసరస్వతి ఆంధ్రుల ఆడపడుచు ఏ భాషా సాహిత్యంలో లేని అవధాన ప్రక్రియను మనం పెంచి పోషించుకొంటూ వస్తున్నాం మన కాకినాడలో సుమారు 70 ఏళ్ల క్రితం తిరుపతి వేంకటకవులు శ్రీ పైండా వేంకటాచలపతి టౌనుహాలు లో శతావధానం నిర్వహించిన విషయము భిత్తిఫలకం పై చిత్రించబడి సాక్షీభూతంగా నేటికీ నిలచిఉంది మళ్లీ ఇన్నాళ్లకు ఇన్నేళ్లకు శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారి సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం శ్రవణపర్వంగా - నేత్రానందంగా తిలకించే సౌభాగ్యం కాకినాడ పురప్రజలకు లభించింది

కాకినాడ ఆంధ్రదేశానికి సాంస్కృతిక రాజధాని సాహిత్యకళారంగాలకు పుట్టినిల్లు ఎందరోకళాకారులకు-కవులకు-కళాపోషకులకు జన్మనిచ్చినగడ్డ పలుసాహిత్య సంస్థలకు, సాంస్కృతిక కళారంగాలకు కాణాచియైన కాకినాడలో ప్రతినిత్యం మారుమూల వీధుల్లో సహితం కళామతల్లి గజ్జెలమోతలు, సుమధుర సంగీత నాదాలు, కవుల కమనీయ కావ్యగానాలు, దైవమందిర ప్రాంగణాలలో వేదమంత్ర పఠనాలు, భక్తిరసభరిత భజనకార్యక్రమాలు- ఆధ్యాత్మిక ప్రసంగాలు శ్రవణనేత్రపర్వం గావినిపిస్తూ కనుపిస్తూనే ఉంటాయి

సంస్కృతానికి, భారతీయసంస్కృతికి, ప్రాచీనతెలుగు సాహిత్యానికి ప్రాచుర్యం కల్పించాలను సత్సంకల్పంతో శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B.Com గారు తమ

పితృదేవులు శ్రీ పైండా సత్యనారాయణమూర్తిగారి పేర సంస్కృత విద్యాపీఠం 1967 సంవత్సరంలో స్థాపించి, దానిని రిజిష్టర్డు సంస్థగా రూపొందించారు. పలు విద్యా సంస్థలకు, ధర్మసత్రములకు, ఆధ్యాత్మిక సంస్థలకు అధినేతలై వితరణ గుణ శీలురు గా ప్రఖ్యాతి నందుకొంటూ కళా- సాహిత్య రంగాలను వికసింపచేయాలను మహదాశయంతో సంస్కృతవిద్యా పీఠం తరపున ఎన్నో సత్కార్యక్రమములు నిర్వహించుకొంటూవస్తున్నారు.

శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృతవిద్యాపీఠం సహకార్యదర్శిగా నియమింప బడిన తరువాత నేను కాకినాడలో శతావధాన కార్యక్రమం నిర్వహించాలను నా సంకల్పాన్ని సుమారు నాలుగు నెలల క్రితం శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారికి చెప్పగా వారు తమ సంపూర్ణ సహకారాన్ని అందించడానికి సంసిద్ధతను వ్యక్తం చేశారు. వారి అంగీకారమును ప్రేరణగా తీసుకొని నేను వెంటనే స్వర్ణకంకణ విభూషితులు- శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారికి ది. 9.2.92 తేదీని వారి అంగీకారం కొరకు ఉత్తరం వ్రాయగా ది. 17 2.1992 తేదీని నేను కోరిన ప్రకారం 1992 మేనెల 9,10,11 తేదీలలో సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం కాకినాడ లో చేయుటకు తమ అంగీకారమును తెలియ జేశారు

శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారు శతావధాన కార్యక్రమ నిర్వహణ భారం తామే వహించి శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠం ఆధ్వర్యమున శతావధాన ఆహ్వానసంఘం ఏర్పాటుకు పురప్రముఖులను ఆహ్వానించి ది. 7.3.1992 తేదీని రావు బహాదుర్ శ్రీ పైండా వేంకటాచలపతి కల్యాణమండపంలో ఒక సమావేశం ఏర్పాటు గావించారు. ఈ సమావేశంలో శతావధాన ఆహ్వానసంఘం ఏర్పాటు గావింపబడింది. ఈ సమావేశంలో నిర్ణయించిన ప్రకారం 120 మంది దాతలను ఆహ్వాన సంఘ సభ్యులుగా - సన్మాన కర్తలుగా చేర్చుకొనడమైనది. ఆహ్వాన సంఘ అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారు శతావధానమునకు సంబంధించిన కార్యక్రమములను స్వయంగా పర్యవేక్షిస్తూ మాకు తగుసూచనలిస్తూ శతావధాన నిర్వహణవ్యయంలో అధికభాగం వారే వహించి కార్యక్రమ సఫలతకు విజయానికితోడ్పడినందుకువారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు తెలుపుకొంటున్నాను. ఒకవంక శతావధాన సాహిత్య విందు జరుగుచుండగా వేరొకవంక శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారు పృచ్ఛకులకు - ప్రత్యేకాహూతులకు షడ్రసోపేత

మైన విందు భోజనం ఏర్పాటు చేసి తమ నిరతాన్నదాన శీలతను సార్థకం చేసుకొన్నారు. శతావధానం జరిగిన మూడు రోజులు అవిశ్రాంత దీక్షతో కృషి చేస్తూ వీసమెత్తు లోపంజరుగకుండా విహంగ వీక్షణం చేయడం వారి దూరదృష్టికి- పట్టుదలకు ప్రత్యక్షతార్కాణములు.

1992 మేనెల 9,10,11 తేదీలు కాకినాడ సాహిత్య చరిత్రలో చిరస్మరణీయమైన రోజులు. మధురమనోజ్ఞమైన ఘట్టములు కలకాలం కళ్లముందు కదిలే కమనీయ సన్నివేశాలు, రసజ్ఞులు - సహృదయులు, సారస్వతప్రియులు, పండితులు-కవులు ఆనందంతో పులకాంకుర ప్రకరాలతో పరవశించిన రోజులు శతావధాని శ్రీమాడుగుల నాగఫణిశర్మ సంపూర్ణసంస్కృతాంధ్ర శతావధానం అద్వితీయంగా చేసినరోజులు

9 వ తేదీ ఉదయము 7-15 గంటలకు వేదపఠనంతో - మంగళవాయిద్యములతో శ్రీ నాగఫణి శర్మగారికి, ఆహ్వానసంఘ అధ్యక్షులు -- సంస్కృతవిద్యాపీఠం అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారు పూర్ణకుంభంతో స్వాగతం పలికి తిరుమల తిరుపతి దేవస్థాన కల్యాణమండప వేదిక వద్దకు తోడ్కొని వచ్చారు తదనంతరంజరిగిన ప్రారంభోత్సవ సభకు మునిసిపల్ ఛైర్మన్ శ్రీ జ్యోతుల సీతారామమూర్తి అధ్యక్షత వహించారు. స్థానిక శాసన సభాసభ్యులు శ్రీ మల్లాడి స్వామి జ్యోతి ప్రజ్వలనం గావించారు సూపర్‌బజార్ ఛైర్మన్ శ్రీ వై డి రామారావు సభాప్రారంభంగావించారు. ప్రారంభోత్సవసభకు ఆచార్య బి వి యస్ పాత్రుడు స్వాగతం పలికారు

టి టి.డి. కల్యాణ మండపం సాహిత్యాభిమానులతో కళకళలాడుతుండగా ఉదయం గం 9.00 లకు స్వర్ణకంకణ విభూషిత - శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారి సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం ప్రారంభమయింది శతావధాన సభాసంచాలకులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు అవధాన ప్రక్రియా విశేషాలను వివరించారు. ఆహ్వానసంఘకార్యదర్శి శ్రీపాద శ్రీరామమూర్తి- శ్రీ శ్రీ శ్రీ పృచ్ఛకులను విషయానుక్రమంగా వేదికమీదకు ఆహ్వానించారు. అవధానికిరువైపుల సమస్య, దత్తపది, వర్ణన, అనువాదం, అప్రస్తుత ప్రశంస అంశములను నిర్వహించు పృచ్ఛకులు ఆసీనులయ్యారు.మొదటిరోజున సమస్యలలోని మొదటి పాదమును, దత్తపదిలోని మొదటి పాదమును, వర్ణనలోని మొదటి పాదమును, అనువాదములోని

మొదటిపాదమును పూరణతో ప్రారంభించి రెండవరోజు, మూడవరోజు మధ్యాహ్నము ఒంటిగంటకు అన్ని అంశములకు పూరణములు పూర్తిచేశారు 11వ తేదీ సోమవారము మధ్యాహ్నము 3 గంటలకు పృచ్ఛకులు ఇచ్చిన సమస్య దత్తపది, వర్ణన, అనువాదం అంశములను జ్ఞప్తికి తెచ్చుకొని ఆ పూరణములనన్నింటిని తడబాటులేకుండ తమ అత్యద్భుతమైన, అనన్యసాధారణమైన ధారణాశక్తితో వేలాది శ్రోతలు మంత్రముగ్ధులగు నట్లుగా ఏకధాటిగ చెప్పి శ్రోతలను ఆశ్చర్యానందములలో ఓలలాడించారు. ప్రయోక్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు సమయస్ఫూర్తితో, చతురోక్తులతో సామాన్యుల కర్థమగురీతిగ శతావధాని గారి పూరణ పద్యములకు అర్థవివరణము గావించి శ్రోతలమన్ననలకుపాత్రులయ్యారు అప్రస్తుత ప్రసంగము చేసిన హాస్యరత్న - వినోదరత్నాకర శ్రీ ఎ గోపినాధ్ గారి చమత్కార సంభాషణలు - జానపదగేయ ఫణితులు శ్రోతలను ఆకట్టుకొన్నాయి. ఆంధ్రనయాగర-మధురవాగ్మి ఆచార్య బి.వి యస్ పాత్రుడుగారి అప్రస్తుత ప్రసంగము శ్రోతలనలరించింది. ఈ విధంగా సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం విజయవంతమైంది

11వతేదీ సోమవారము రాత్రి శతావధాన విజయోత్సవ- సన్మాన మహోత్సవ సభలు నిర్వహించబడినవి తూర్పుగోదావరిజిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ సి.ఎన్. గోపీనాధరెడ్డి ఐ.పి యస్ గారి అధ్యక్షతన సన్మాన సభ ప్రారంభమైంది. శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ, ప్రయోక్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, ఆహ్వానసంఘ అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి , శ్రీ జ్యోతుల సీతారామమూర్తి, శ్రీ వై డి. రామారావు, శ్రీ పైండా రామకుమార్, శ్రీ గ్రంధి వెంకటరమణ, శ్రీ నల్లమిల్లి సత్యనారాయణ రెడ్డి, శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్యప్రసాద్, డా. శ్రీ పైండా విశ్వనాధ్ కుమార్, శ్రీమతి కె సీతారత్నం, ధర్డు ఎడిషనల్ సెషన్సు జడ్జి శ్రీ పి. జగన్నాధులు నాయుడు, శ్రీ గోపాల సూర్య భాస్కరరావు శ్రీ గోకవరపు వెంకటేశ్వరరావు, శ్రీ జువ్వనపూడి ఆంధ్రూపాల్ ఆహ్వానసంఘ కార్యదర్శి మధురకవి శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి - శ్రీ శ్రీ శ్రీ, సహాయకార్యదర్శులు శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు (గాంధి) శ్రీ కందుకూరి చినరామచంద్రమూర్తి సన్మాన సభావేదికపై ఆసీనులయ్యారు. శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి సంస్కృతవిద్యాపీఠం తరపున - ఆహ్వానసంఘం తరపున స్వాగతోపన్యాసంగావించారు. మధురకవి - శ్రీపాద శ్రీరామమూర్తి - శ్రీ శ్రీ శ్రీ

కార్యదర్శి నివేదిక సభాముఖంగా చదివి వినిపించారు. సభాధ్యక్షులు శ్రీ గోపీనాధరెడ్డి గారు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ శర్మగారి ప్రతిభా విశేషాలను కొనియాడారు.

స్వర్ణకంకణ విభూషితులు- శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారిని రజతసింహాసనంపై ఆసీనులను చేసిన పిమ్మట యస్ ఆర్ యమ్ టి మేనేజింగ్ డైరక్టరు శతావధాన ఆహ్వాన సంఘ గౌరవాధ్యక్షులు శ్రీ కె వి ఆర్ చౌదరిగారి సతీమణి శ్రీమతి సీతారత్నంగారు శతావధానిని పూలమాలాలంకృతులను చేసి, పూలకిరీటమును ధరింపజేసి, పట్టువస్త్రములతో, సదక్షిణతాంబూలాదులతో ఘనసన్మానంగావించిన తరువాత వారి తల్లి గారిని పట్టు చీరతో సత్కరించారు డా శ్రీ పైండా విశ్వనాధకుమార్ గారు నిలువెత్తు సన్మానపత్రమును శతావధాని గారికి శ్రోతల కరతాళ ధ్వనుల మధ్య సమర్పించారు సంస్కృత విద్యాపీఠం అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారు శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృతవిద్యాపీఠం తరపున **"శతావధాని చూడామణి"** బిరుదుప్రదానం గావించారు శ్రీ కందుకూరి పెద శ్రీరామచంద్రమూర్తి సన్మానపత్రపఠనం గావించారు శతావధాన సభాసంచాలకులుగా వ్యవహరించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారిని శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్య ప్రసాద్ గారు పట్టు వస్త్రములతో సదక్షిణతాంబూలాదులతో పూలమాలాలంకృతులను చేసి ఘనసన్మానం చేశారు తదనంతరం ప్రముఖులకు - కార్యకర్తలకు శ్రీ జ్యోతుల సీతారామమూర్తి జ్ఞాపికలను అందజేశారు

ఆహ్వాన సంఘం కార్యదర్శి శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి పృచ్ఛకులను సగౌరవంగా పేరు పేరున వేదికమీదకు ఆహ్వానిస్తుండగా సన్మాన కర్తలైన ఆహ్వాన సంఘసభ్యులు నూతన వస్త్ర ములతో, దక్షిణ ఫలతాంబూలాదులతో వరుసక్రమంలో సమాదరంగా సన్మానించారు.

శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ తనకు జరిగిన ఘన సన్మానానికి ఉచితరీతిని కృతజ్ఞతలు తెలిపి తమ సందేశం వినిపించారు ఆచార్య బేతవోలు రామ బ్రహ్మం సమీక్షాప్రసంగం చేసి తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలియజేశారు

చివరగా శ్రీ జ్యోతుల సీతారామమూర్తి, శ్రీ వై డి. రామారావు గారలు ప్రసంగిస్తు శతావధాన కార్యక్రమమునకు తొలిబీజం నాటిన మధురకవి - శ్రీ శ్రీ శ్రీ గారి

ఓర్పును, అవిరళ కృషిని శ్లాఘిస్తూ వారికి చేదోడు వాదోడుగా అహర్నిశములు తోడునీడగనిలచిన సహాయకార్యదర్శి శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు(గాంధి) గారిని ప్రస్తుతించి కాకినాడ చరిత్రలో ఏడు దశాబ్దాలక్రిందట జరిగిన శతావధానమును మరల నేడు జరిపించి కాకినాడ ప్రజలకు రసానందాను భూతిని- కనువిందును సమకూర్చి ఇంతటి వ్యయ ప్రయాస బరిత మైన బృహత్తర మహత్తర కార్యక్రమానికి సారధిగనిలచిన శ్రీ పైండా శ్రీరామ కృష్ణమూర్తి గారి ఔదార్యమును, త్యాగశీలతను, కార్యదీక్షాదక్షతను ప్రశంసించి తమ అబినందనలు తెలియ జేశారు అనంతరం శ్రీపైండా శ్రీరామకృష్ణ మూర్తి గారు సంస్కృత విద్యాపీఠం సహకార్యదర్శి- శతావధాన ఆహ్వాన సంఘ కార్యదర్శి మధురకవి - శ్రీ శ్రీ శ్రీ గారిని, ఆహ్వానసంఘ సహాయ కార్యదర్శులు శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు (గాంధి) గారిని, శ్రీ కందుకూరి చినరామ చంద్రమూర్తిగారిని పట్టువస్త్రములతో, దక్షిణతాంబూలాదులతో పూల మాలాలంకృతులను చేసి సమాదరంగా సన్మానించారు. ఈ విధంగా శతావధాన విజయోత్సవ సన్మాన సభలు విజయవంతముగ - వైభవోపేతముగ జరిగినవి



# సమస్య నిర్వహించిన పృచ్ఛకులు

## తెలుగు సమస్య

సర్వ శ్రీ

1 ఆచార్య ప్రభాకర శ్రీకృష్ణ భగవానులు ఎమ్.ఎ
పండితరాజు - ఉపన్యాసకళానిధి - రాజమండ్రి

2. కళాప్రపూర్ణ డా॥ యస్ టి జ్ఞానానందకవి.
బ్రాహ్మీభూషణ - కవిసార్వభౌమ - కవితా శ్రీనాధ -కాకినాడ

3 కందుకూరి శ్రీరామచంద్రమూర్తి - యమ్ ఎ
కవితావిశారద - కవిరత్న - కవితాభూషణ - కాకినాడ.

4. ఆచార్య భావన్ - యమ్.ఎ పి.హెచ్.డి - విజయనగరం

## సంస్కృత సమస్య

5. డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ - యమ్.ఎ. పి.హెచ్డి
సాహిత్య మీమాంస - విద్యాప్రవీణ - భాషాప్రవీణ.
శ్రీరామతత్వజ్ఞ - ఉభయభాషాష్టవధాని - రాజమండ్రి

## తెలుగుసమస్య

6. డా॥ జోన్నలగడ్డమృత్యుంజయరావు - యమ్.ఎ. పి.హెచ్.డి.
భారతాచార్య - రాజమండ్రి

7. మండవ శ్రీనివాసు - రాజమండ్రి

8. బులుసు వెంకటరామ్మూర్తి
అష్టావధాన కళాభారతి - ఆశుకవిచక్రవర్తి - రాజమండ్రి

9. అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు - యమ్.ఎ.
భాషాప్రవీణ - అష్టావధాని శేఖర - రాజమండ్రి

## సంస్కృత సమస్య

10 విశ్వనాధ గోపాలకృష్ణ - యమ్ ఎ
వ్యాకరణ విద్యాప్రవీణ - న్యాయవిద్యాప్రవీణ - రాజమండ్రి

## తెలుగు సమస్య

11 గుబ్బల మాధవమూర్తి
విద్వాన్ - కవితిలక - జగ్గన్నపేట

12 కోటమర్తి వెంకట నరసింహమూర్తి - యమ్.ఎ
భాషాప్రవీణ - అష్టావధాని - కొవ్వూరు

13 చింతాయాజ్ఞ్య వల్క్య మహర్షి
సంస్కృత బాషాకోవిద - భాషాప్రవీణ - పామర్రు

14 శ్రీమతి డా॥ టి నాగమణి - యమ్ ఎ పి హెచ్ డి - రాజమండ్రి

## సంస్కృత సమస్య

15. డా ఇవటూరి శ్రీనివాసరావు- యమ్ ఎ పి హెచ్ డి - విజయవాడ

## తెలుగు సమస్య

16 చోట్నీరు శ్రీరామమూర్తి
భాషాప్రవీణ - సరసకవి - అమలాపురం

17 ఆకెళ్ల సుబ్బారావు
భాషాప్రవీణ - మధురకవి - కందికుప్ప

18. పోచనపెద్ది సుబ్రహ్మణ్యరామనరసింహమూర్తి - యమ్.ఎ
భాషాప్రవీణ - గొల్లపాలెం.

19. కాశీభొట్ల సుబ్రహ్మణ్య శర్మ
భాషాప్రవీణ - నరసాపురం

## సంస్కృత సమస్య

20. డా॥ పన్నాల భట్ట శర్మ – యమ్ ఎ పి హెచ్.డి
సాహిత్య విద్యా ప్రవీణ–సాహిత్య భూషణ – విద్యానిధి – భాషాప్రవీణ
– పిఠాపురం

## తెలుగు సమస్య

21. కాశీభొట్ల సత్యనారాయణ – యమ్.ఎ. – కాకినాడ
22. రామకృష్ణభరద్వాజ – యమ్.ఎ. కాకినాడ
23. దేవరకొండ శేషగిరిరావు – యమ్.ఎ. – కాకినాడ.
24. విశ్వనాథ సత్యనారాయణ – కవి – కాకినాడ

## సంస్కృత సమస్య

25. డా.సముద్రాల రంగరామానుజాచార్యులు – యమ్.ఎ.పి.హెచ్ డి –
సాహిత్య విద్యాప్రవీణ – కొవ్వూరు

## తెలుగు సమస్య

26. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి యమ్.ఎ. – గుంటూరు
27. డా॥ పి.హెచ్. కనకయ్య – యమ్.ఎ.పిహెచ్.డి. – కాకినాడ.
28. దువ్వూరి సీతారామమూర్తి – కాకినాడ.

— — — — —

# దత్తపది నిర్వహించిన పృచ్ఛకులు

## తెలుగు దత్తపది

సర్వశ్రీ

1 డా॥ నందుల గోపాల కృష్ణ – యమ్ ఎ పి హెచ్ డి – రాజమండ్రి

2 డా॥ బి వి యస్ మూర్తి – యమ్ ఎ ,యమ్ ఫిల్, పి హెచ్ డి – రాజమండ్రి

3 డా॥ వాడపల్లి చక్రపాణి – యమ్ ఎ యమ్ ఫిల్ పి హెచ్ డి – అమలాపురం

4 డా॥ అల్లూరి వెంకటనరసింహరాజు – యమ్ ఎ పిహెచ్ డి బి యి డి ప్రజాహిత – ఏలూరు

## సంస్కృత దత్తపది

5 డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ – యమ్ ఎ ,పిహెచ్ డి సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ – రావులపాలెం

## తెలుగు దత్తపది

6 డా॥ డి యస్ వి సుబ్రహ్మణ్యం యమ్ ఎ పి హెచ్ డి భాషాప్రవీణ – రాజమండ్రి

7 డా॥ ద్వానా శాస్త్రి – యమ్ ఎ యమ్ ఫిల్, పి హెచ్ డి – అమలాపురం

8 సలాది ప్రభంజనస్వామి – యమ్ ఎ – తూరంగి

9 యడవిల్లి పూర్ణయ్య సిద్ధాంతి – కాకినాడ

## సంస్కృత దత్తపది

10. డా॥ కొత్తపల్లి ఘన శ్యామప్రసాదరావు – యమ్ ఎ పిహెచ్ డి అష్టావధాని – నేత్రావధాని – అమలాపురం

## తెలుగుదత్తపది

11. శ్రీమతి డా॥ పి సత్య జ్ఞానేశ్వరి - యమ్ ఎ పి హెచ్ డి - కాకినాడ

12. మంగళంపల్లి రామనరసింహమూర్తి - కవి
వాస్తు జ్యోతిషజ్ఞులు - అమలాపురం

13. P.B.S. అప్పలాచార్యులు - కాకినాడ.

14. ఆదిరాజుసత్యనారాయణ మూర్తి - భాషాప్రవీణ - నరేంద్రపురం

## సంస్కృత దత్తపది.

15. కందుకూరి రామకృష్ణసూర్యనారాయణ యమ్ ఎ.
భాషాప్రవీణ - అష్టావధాన శేఖర - చీపురుపల్లి

## తెలుగుదత్తపది.

16. నేతీ సూర్యనారాయణ మూర్తి - యమ్.ఎ. - భాషాప్రవీణ - ఏలూరు

17. కొంపెల్ల వెంకట రామశాస్త్రి - భాషాప్రవీణ - ఏలూరు

18. శ్రీమతి డా॥ వాసాప్రభావతి - యమ్.ఎ పి.హెచ్.డి
సాహిత్య శ్రీ, సాహితీ సరస్వతి - హైదరాబాదు

19. శిష్ట్లా సూర్యనారాయణమూర్తి - బి.ఎ.యమ్.ఓ.యల్.
కావ్యాలంకారచూడామణి పరిశోధకులు - అమలాపురం

## సంస్కృత దత్తపది

20. ముక్కవిల్లి సత్యనారాయణ శర్మ యమ్.ఎ. - భాషాప్రవీణ -
మోడేకుర్రు

## తెలుగు దత్తపది

21. కుందేటిసత్యనారాయణ - యమ్.ఎ. - కాకినాడ

22. యస్.టి.కె.జనార్దన స్వామి - యమ్.ఎ. - భాషాప్రవీణ - తాటిపాక

23 డా॥ కుమారి పి అనార్కలి - యమ్ ఎ , పి హెచ్.డి - కాకినాడ.

24 డా॥ పి వి మురళీకృష్ణ - యమ్.ఎ ,పిహెచ్.డి , యమ్ ఇడి - భాషాప్రవీణ - రాజమండ్రి

## సంస్కృత దత్తపది

25 డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రి - యమ్.ఎ పిహెచ్ డి
వ్యాకరణ సాహిత్య - విద్యావాచస్పతి - భాషాప్రవీణ
అవధాన విద్యావాచస్పతి - అవధాని శేఖర - తణుకు

## తెలుగు దత్తపది

26. యమ్. పాండురంగారావు - యమ్ ఎ.యల్.యల్.బి , కాకినాడ

27. డా॥ మేడూరి లక్ష్మీనారాయణ - యమ్ ఎ పిహెచ్.డి - పెద్దాపురం

28. పురాణపండ సత్యనారాయణ మూర్తి - యమ్.ఎ., భాషాప్రవీణ - జగ్గంపేట

29. చిలకమర్తి సుబ్రహ్మణ్యం -భాషా ప్రవీణ - మత్స్యపురి

# వర్ణన నిర్వహించిన పృచ్ఛకులు

సర్వశ్రీ

## తెలుగు వర్ణన

1. నేమాని శ్రీరామ సిద్ధాంతి
విద్యావాచస్పతి, వాస్తురత్న, బ్రహ్మరథారూఢ
గజారోహణ సమ్మానిత - కాకినాడ

2. సామవేదం జానకిరామశాస్త్రి - యమ్.ఎ. (జానకీజాని) - కాకినాడ.

3. కందుకూరి సూర్యప్రసాదరావు - భాషాప్రవీణ - కాకినాడ.

4. వడలి సుబ్బారాయుడు - యమ్.ఎ.
భాషాప్రవీణ - పి.ఓ.యల్. - పెద్దాపురం

## సంస్కృత వర్ణన

5. డా॥ వేదుల సుబ్రహ్మణ్యం - యమ్.ఎ పి హెచ్ డి. విశాఖ పట్టణం

## తెలుగు వర్ణన

6. ఆకుల శ్రీరామమూర్తి - సరసకవి - కరప
7 ఎ.యస్.వి.యస్ నారాయణమూర్తి - యమ్ ఎ యమ్ ఇ డి - కాకినాడ
8 ఆదిరాజు వెంకట సుబ్రహ్మణ్యం - యమ్ ఎ.
భాషాప్రవీణ - రాజోలు
9 మధునాపంతుల వెంకట పరమయ్య - భాషాప్రవీణ - పెద్దాపురం

## సంస్కృత వర్ణన

10. డా॥ ప్రభల సుబ్రహ్మణ్యం - యమ్.ఎ పి.హెచ్ డి.
భాషాప్రవీణ - సాహిత్య విద్యా ప్రవీణ - అష్టావధాని - రాజమండ్రి

## తెలుగు వర్ణన

11. కందుకూరి శ్రీకృష్ణమూర్తి - భాషాప్రవీణ - మోడేకుర్రు
12. పోతుకూచి సూర్యనారాయణ మూర్తి
హిందూ విలేఖరి - సాహిత్య గౌతమి అధ్యక్షులు - రాజమండ్రి
13 మేకా సుధాకరరావు - కవి-పిఠాపురం
14. పేరిసూర్యనారాయణమూర్తి - యమ్ ఎ
భాషాప్రవీణ - సాహిత్యరత్న - కాకినాడ

## సంస్కృత వర్ణన

15. కొల్లూరు అవతార శర్మ - యమ్.ఎ., సాహిత్య విద్యాప్రవీణ, సంస్కృత భాషాకోవిద, రాష్ట్రభాషా ప్రవీణ - కాకినాడ.

## తెలుగు వర్ణన

16 తటవర్తి రాఘవరాజు - యమ్ ఎ భాషాప్రవీణ -
రామచంద్రపురం

17 డా॥ ఇజ్జాడ వెంకట్రావు - యమ్ ఎ పి హెచ్ డి - కాకినాడ

18 కూచిభొట్ల భీమశంకరం - బి ఎ బిఇ డి - కాకినాడ

19 చాగంటి సన్యాసిరాజు - కవి - కాకినాడ

## సంస్కృత వర్ణన

20 తోపెల్లి రామజోగి శర్మ
సాహిత్య విద్యాప్రవీణ - భాషాప్రవీణ - కాకినాడ

## తెలుగు వర్ణన

21 బి యస్ నెహ్రూ - యమ్ ఎ బి యస్ సి. బి ఇ డి
ద్రాక్షారామం

22 కావలిపురపు రామచంద్రరావు - యల్ సి ఇ , యమ్ ఎ ,బి ఇడి
మామిడికుదురు

23 డా॥ జి కృపాచారి - యమ్ ఎ పి హెచ్ డి - తెనాలి

24 ఓలేటి శ్రీనివాసశర్మ - భాషాప్రవీణ - ఇంజరం

## తెలుగు వర్ణన

25 ఈమని సువర్ణ - యమ్ ఎ
మరమందిర్ ప్రముఖ్ - కపిలేశ్వరపురం

26 పేరికామేశం - భాషాప్రవీణ - విశాఖ పట్టణము

27 శ్రీమతి. కె యస్.యన్ శమంతకమణి - అమలాపురం.

# అనువాదం నిర్వహించిన పృచ్ఛకులు

ర్వ శ్రీ

## తెలుగు నుండి సంస్కృతం

1. డా॥ పంపన సూర్యనారాయణ - యమ్.ఎ యమ్ ఫిల్,పిహెచ్ డి
భాషాప్రవీణ, ఉపన్యాసకేసరి - పెద్దాపురం
2 యన్ పి హెచ్. శ్రీనివాస అయ్యంగార్ - యమ్ ఎ బి ఇ.డి
వాయులీనప్రవీణ - కాకినాడ
3. రేకపల్లి శ్రీనివాసమూర్తి
మధురగాయక రత్న - సంగీత సాహిత్య భూషణ
సంగీత శారదామూర్తి - అమలాపురం
4. కందుకూరి లక్ష్మీ నరసింహమూర్తి - యమ్.ఎ
భాషాప్రవీణ - పి.ఓ.యల్ - పిఠాపురం
5. డా॥ శివలెంకప్రకాశరావు - యమ్ ఎ.పి హెచ్ డి - కాకినాడ
6 సన్నిధానం నరసింహాశర్మ - రాజమండ్రి
7. యస్.వి. రాఘవేంద్రరావు - యమ్ ఎ. యమ్ ఫిల్. బి.ఇ డి -
రాజమండ్రి
8. కాశీభొట్ల కామేశ్వరరావు - భాషాప్రవీణ - ఇందుపల్లి
9. కేసాప్రగడ సత్యనారాయణ - యమ్.ఎ ,యమ్.ఫిల్ - కిర్లంపూడి.
10. శిష్టావెంకటరమణ - యమ్ ఎ. - భాషాప్రవీణ - ఇంద్రపాలెం.
11. గరిమెళ్ల రాధాకుమారం - యమ్.ఎ , భాషాప్రవీణ - కాకినాడ.
12. యర్రాప్రగడ రామకృష్ణ - రాజమండ్రి
13. ఆకెళ్ల కృష్ణమూర్తి - భాషాప్రవీణ - పి.ఓ.యల్ - కాకినాడ
14. యు. ఆంజనేయరాజు - యమ్.ఎ - కాకినాడ.

## సంస్కృతం నుండి తెలుగు

15 వింజమూరి శేషఫణి శర్మ - యమ్ ఎ. - కాకినాడ

16 డా॥ కందుకూరి సత్యసూర్యనారాయణ మూర్తి - యమ్ ఎ ,పి హెచ్ డి విద్యా ప్రవీణ, భాషాప్రవీణ - రాజమండ్రి

17 డా॥ రాణి సుబ్బయ్య దీక్షితులు - యమ్ ఎ పి హెచ్ డి - కాకినాడ

18 ధూళిపాళ మహాదేవమణి - యమ్ ఎ విద్యాప్రవీణ, భాషాప్రవీణ - కాకినాడ.

19 మల్లంపల్లి అమరేశ్వర ప్రసాద్ - భాషాప్రవీణ - కాకినాడ

20 డా॥ బి.వి రమణ మూర్తి - యమ్.ఎ.పి హెచ్ డి - అమలాపురం

21 రేకపల్లి వీరభద్రశర్మ - యమ్ ఎ యమ్ ఒ యల్ భాషాప్రవీణ - కొవ్వూరు

22. మల్లాది సాంబశివరావు - యమ్.ఎ - మలికిపురం

23 వారణాసి రాజేశ్వర శాస్త్రి - భాషాప్రవీణ - పిఠాపురం

24 సామవేదం శ్రీరామమూర్తి శాస్త్రి సాహిత్య విద్యాప్రవీణ - భాషాప్రవీణ - కాకినాడ

25. ఆకెళ్ల సత్యనారాయణ మూర్తి - విద్వాన్ - కడియపులంక

26. భావరాజు సుబ్బారావు కవిరత్న - భాషాప్రవీణ - రాజోలు

27. రేగెళ్ళ సత్యనారాయణ శర్మ - భాషాప్రవీణ - పిఠాపురం

28. ఆకెళ్ల లక్ష్మీనరసింహ శాస్త్రి - భాషాప్రవీణ - కాకినాడ.

29. గరిమెళ్ల సత్యసోమయాజులు అనంత సత్య శేషగిరిశర్మ - యమ్ ఎ సహజపాండిత్య విభూషణ - అవిడి.

30 శ్రీమతి కె హేమలత - యమ్ ఎ -కొవ్వూరు

31 డా॥ బి వి జి ఎ సోమయాజులు -యమ్ ఎ పి హెచ్ డి - పాడగల్లపల్లి

32 అడ్డూరి సూర్యనారాయణ రాజు యమ్ ఎ - కాకినాడ

33 శ్రీమతి జి కాత్యాయిని - కాకినాడ

## అప్రస్తుత ప్రసంగం నిర్వహించిన పృచ్ఛకులు

శ్రీ

1 అమళ్లదిన్నె గోపీనాధ్
హాస్యభారతి - వినోదరత్నాకర - చమ త్కారసంభాషి- అనంతపురం

2 డా॥ ఐ కిషన్‌రావు యమ్ ఎ పిహెచ్ డి
అష్టావధాని - వరంగల్

3 ఆచార్య బి వి యస్ పాత్రుడు
ఆంధ్రనయాగర - మధురవాగ్మి - ఉపన్యాసచక్రవర్తి - వక్తృ
శిరోమణి - కాకినాడ



## శతావధాన ఆహ్వానసంఘ సభ్యులు – సన్మాన కర్తలు

సర్వశ్రీ

1 పైండా రామకుమార్

2 గ్రంధి వెంకటరమణ

3 జ్యోతుల సీతారామశాస్త్రి

4 పైడి రామారావు

5 వి ఎన్ హెచ్. ప్రసాద్

6 ఉంటూ సూర్యారావు

7 పల్లమిల్లి సత్యనారాయణ రెడ్డి

8 శ్రీమతి పైండా శ్యామల

9 పెసరా వెంకట్రావు

10 డా॥ డి.వి. రామారావు

11 బదరీ నారాయణ బనాని

12 వి వి యస్ యస్ చౌదరి

13 జాలుమూరు వెంకటసుబ్బారావు (నాని)

14 ఆకుల శివయ్యనాయుడు

15 కర్రి భూమిరెడ్డి

16. జువ్వనపూడి ఆండ్రూపాల్

17 పెంట రామచంద్రరావు

18. వంక కృష్ణబ్రహ్మం

19. గోగులపాటి రామమోహన్

20. గ్రంధి నారాయణ రావు (బాబ్జి)
21 నేమాని శ్రీరామసిద్ధాంతి
22 పైండా చలమయ్య
23 పైండా కృష్ణారావు
24 పి వి రాజు (రోటరీ క్లబ్)
25 మట్టే సూర్యనారాయణ
26 బాదం సుబ్రహ్మణ్యం అండ్ సన్సు
27 పారుపూడి నరసింహమూర్తి
28 పైండా రామకృష్ణారావు (బచ్చువారి సత్రం)
29 పైండా యోగానందరావు
30 కె వి యస్ ఆంజనేయమూర్తి
31 డా॥ కె కృష్ణమూర్తి
32 డా॥ శ్రీమతి ఆలూరి విజయలక్ష్మి
33 పట్నాల రామచంద్రరావు (రాము)
34 సోముప్రసాదరావు
35 పైండా చిన వెంకటరమణ బ్రదర్స్
36 వారణాసిభాస్కరరావు
37 చెక్కపల్లి సీతారామచంద్రమూర్తి
38 పైండా సూర్యనారాయణ మూర్తి - జమీందార్
39 దొంతంశెట్టి అనంత భాస్కరరావు
40. ఆర్ వి. ఆంజనేయ శర్మ

41 పైండా వెంకటరత్నం

42 గోపాల సూర్యభాస్కరరావు

43 వడ్డిపర్తి వీర్రాజు

44 పైండా శంకరనారాయణ మూర్తి

45 పైండా జయకుమార్

46 పినుబోతునటరాజ్

47 పి వై చింతామణి

48 పులవర్తి వెంకటేశ్వరరావు

49 ఆకెళ్ల ప్రభాకరమూర్తి

50 వాకచర్ల మల్లేశ్వరరావు

51 వెలమకన్ని సుబ్రహ్మణ్యశర్మ

52 చల్లా సీతారామయ్య

53 పి యస్ ఆర్ కె. తిమ్మాజీరావు

54 యమ్ నారాయణ రావు

55 గోకవరపు వెంకటేశ్వరరావు

56 బాదం సత్యనారాయణ మూర్తి

57 మైలవరపు భానుమూర్తి

58. పీమూలాల్ దేశాయ్

59 డా॥ శ్రీమతి పైండా జానకి వాగేశ్వరరావు

60 రామగోపాల్ ఎలక్ట్రానిక్స్ - కమల్ కిశోర్‌లువాని

61 దురిశేటి శేషఅప్పారావు

62 బలభద్రుని మల్లిఖార్జునరావు

63 బల్ల సర్వేశ్వరరావు

64 శ్రీమతి సి హెచ్ వి యస్ సూర్యమాంబ

65 వింజమూరి భాస్కరరావు

66 ఓరుగంటి గురుప్రసాద లక్ష్మీనారాయణ శర్మ

67 కొల్లేపర వెంకటేశ్వర్లు

68 మల్లవరపు విశ్వేశ్వరరావు

69 పాబోలు సీతారామమూర్తి

70 బులుసు సత్యనారాయణ శాస్త్రి

71 వడ్లమాని సూర్యనారాయణ

72 డా॥ వి హనుమంతరావు

73 యస్ బూరయ్య

74 మెట్టా వీరభద్రరావు

75 మాంధాత చిట్టెన్న

76 పైండా శేషగిరిరావు

77 తామరపల్లి సోమరాజు

78 కంచిరాజు రఘుపతి

79 చిట్టూరి సత్యనారాయణ మూర్తి

80 లక్ష్మీనారాయణ లునాని

81 యమ్ యస్ ప్రకాశరావు

82 తాడంకి రామదాసు

83 ఇందన శ్రీరామజోగిశ్రేష్ఠి

84 సలాది రెడ్డయ్య

85 వందూరి సుందరరామయ్య

86 పలివెల కేశవరావు – మెంబరు పలివెల భాస్కరరావు అండ్ పత్తి రాజు ట్రస్టు

87 పలివెల సుబ్రహ్మణ్యం

88 ఎ యస్ ప్రసాదరావు

89 గుల్లపూడి సత్యానందం

90 భీమాల వీరభద్రరావు

91 శ్రీమతి యమ్ యోగీశ్వరీదేవి

92 కేశనకుర్తి ప్రభాకరరావు

93 డా॥ టి జయరామ శర్మ

94 అడ్డాల శ్రీరామచంద్రమూర్తి

95 అమలఖ్ ఎన్ మెహతా

96 గొల్లపూడి కృష్ణమూర్తి

97 బచ్చు మాధవరావు

98 గౌతమీ కాన్వెంట్ స్కూలు

99 గరిమెళ్ల పరబ్రహ్మ శాస్త్రి

100 డా॥ సి సూర్య ప్రకాశ రావు

101 జి యస్ వి భాస్కరరావు

102 అరవింద బి ఫరేక్

103 ఆకొండి సీతారామాంజనేయ శర్మ

104 పైండా సత్యనారాయణ మూర్తి (స్వామి)

105 కొంగర వీర్రాజు

106 కోరుకొండ జగజ్జననీ రావు

107 అడ్డాల రామమూర్తి

108 డా॥ పాతూరి గోపాలకృష్ణ - లక్ష్మీదేవి

109 గొల్లపూడి వెంకట్రాజు - మెంబరు పలివెల భాస్కరరావు అండ్ సత్తి రాజు ట్రస్టు

110 శ్రీఖాకొళపు సుభద్రయ్య

111 కాపగంటి సుబ్బరాజు

112 చిరుపోలు సత్యదత్తాత్రేయ గురుస్వామి

113 రెడ్డి రామ్మూర్తి

114 బొగ్గవరపు సుబ్బారావు ధర్మసత్రం

115 యస్ కుమార వేలు

116 శ్రీమతి శిష్టా సుభద్రాదేవి

117 మాగంటి దుర్గాప్రసాద్

118 మాజేటి భవానీ ప్రసాద్

119 శ్రీమతి వి తులసీదేవి

120 ముల్లా మాణిక్యం

121 మట్టే ఉమామహేశ్వర రావు



# జ్ఞాపికల దాతలు

సర్వశ్రీ

1 పైండా శ్రీరామకృష్ణమూర్తి బి కాం - పలు విద్యా - సాంస్కృతిక - సాహిత్య - ఆధ్యాత్మిక సంస్థల అధినేత - కాకినాడ

2 ఆదినారాయణ - నెహ్రూ ఎడ్యుకేషనల్ సొసైటీ - కాకినాడ

3 మల్లారెడ్డి మోహన రావు - మోహన్ కాన్వెంట్ హైస్కూలు - కాకినాడ

4 కె యస్ యన్ మూర్తి - సెయింట్ ఆంధోనీ గ్రూప్ ఆఫ్ స్కూల్సు కాకినాడ

5 శ్రీమతి జె ఎస్తేరు రాణి - నవభారత్ పబ్లిక్ ఇంగ్లీషు మీడియం స్కూల్ కాకినాడ

6 జువ్వనపూడి ఆంద్రూపాల్-నవభారత్ పబ్లిక్ స్కూలు - కాకినాడ.

7 చుక్కా అప్పారావు - సత్యవిద్యా నికేతన్ - రాయుడువారిపాలెం

8 జ్ఞానపతి - ఠాగూర్ కాన్వెంట్-కాకినాడ

9 యన్ శేషారెడ్డి - ఆదిత్య అకాడమీ - కాకినాడ

10 నవబారత్ పబ్లిక్ ప్రైమరీ ఇంగ్లీషు మీడియమ్ స్కూల్ - కాకినాడ

11 జువ్వనపూడి జాన్‌విక్టర్ అండ్ కె నెల్సన్-నవభారత్ పబ్లిక్ గరల్స్ హైస్కూల - కాకినాడ

12 డా॥ డి వి రామారావు-కాకినాడ పబ్లిక్ స్కూలు-కాకినాడ

13 జూలుమూరి వెంకట సుబ్బారావు (నాని) ప్రొప్రయిటర్-క్రిష్ణా ఎంపోరియమ్-కాకినాడ

శారదనీరదేందుఘనసారపటీరమరాళమల్లికా
హారతుషారఫేనరజతాచలకాశఫణీశకుందమం
దారసుధాపయోధిసితతామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీః’



శతావధాన శతపత్ర

ప్రధాన సంపాదకులు

మధుర కవి - శ్రీ శ్రీ శ్రీ

**శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి**



శతావధాన శతపత్ర

సహాయ సంపాదకులు

శ్రీ అయ్యగారి వేంకట శ్రీనివాసరావు (గాంధి)

# సమస్య

జిల్లెళ్లమూడి 'అమ్మ' జీవితాన్ని 'సమస్యలతోరణం' గా వర్ణించి అదే పదాన్ని 'సమస్యలతో – రణం' అని విరిచి వివరించింది ఆ విరుపులోని అందగింపుకు, భావుకతకు అచ్చెరువందని భావుకుడుండడు ఆ యందగింపే యీ శతావధానారంభంలో కూడా నాస్మృతి పథంలో మెరిసింది శతావధానపుటారంభమే 'సమస్యలతో రణంతో' (అమ్మ విరుపు ప్రకారం సమస్యలతో రణంతో) శోభాయమానంగా జరిగింది

**సమస్య స్వరూపం** – వింతగా, విడ్డూరంగా, అసత్యంగా, అశ్లీలంగా భాసించే ఒక అసంగతమైన పద్యపాదాన్ని, యధాతథంగా గాని, లేదా అవధానిని తికమకపెట్టడానికై ఒక అక్షరాన్ని గుప్తంగా చేసి, పృచ్ఛకుడు ప్రస్తావిస్తాడు దానిలోని వింతను, విడ్డూరాన్నీ, అసత్యాన్ని లేదా అశ్లీలతను పరిహరించి దానికొక సంగతి నుపకల్పించి, పద్యం పూర్తయ్యేలా మిగిలిన మూడు పాదాలను పూరించాలి సమస్యను విన్న వెంటనే ప్రేక్షకులలో ఒకవిధమైన యుత్సుకత, ఆశ్చర్యం, దాన్ని అవధాని యెలాపూరిస్తాడోనన్న ఉత్కంఠ కలగడం సహజం అవధాని దాన్ని తన యశేష శేముషీ ప్రాభవంతో పూరించిన తరువాత వారి ఉత్కంఠ రసానందానుభూతిగా పరిణమిస్తుంది ఆ యనుభూతి వక్తుమశక్యము వాక్కుల కందని విషయమునని వేఱే చెప్పనక్కర్లేదు

**సమస్యాపూరణం – పుట్టు పూర్వోత్తరాలు :** – సమస్యాపూరణ మొక కళగా తెలుగునాట మూడు పూవులారుకాయలుగా వర్ధిల్లినదనిపిస్తుంది డా॥ శ్రీ సుబ్బన్న శతావధాని – " శివరాత్రి జాగరణవేళ సమస్యాపూరణ హేలకు కాలక్షేపానికి కారణమైన దనిన్నీ – 'కైపదమిచ్చువారలును – గ్రక్కున పద్యముఁ జెప్పువారలున్– ముందుకురాగా; రచ్చబయళ్లలో, రాచపందిళ్లలో తిరునాళ్ల–శోభగా వెలసిందనిన్నీ ప్రస్తావిస్తూ; జానపదులైన భట్రాజాలీవిద్యకు పట్టుకొమ్మలైనారని యుల్లేఖించేరు

ఇది మన ప్రాచీనాంధ్రుల రసజ్ఞతను, సమస్యాపూరణ ప్రాచీనతను తెలుపుడు చేసే ప్రవచనం

వ్యాకరణజ్ఞాన మంతగాలేని జానపదులు సైతం తమకున్న మేధాశక్తితో సమస్యాపూరణం గావించే వారు మచ్చునకొక్క యుదాహరణ

'గుంద్రాతికి కాళ్లు వచ్చి గుడగుడనడచెన్' - అని సమస్య రామపాద రజస్పర్శము చేత అహల్య స్వస్వరూపాన్ని పొందిన వృత్తాంతాన్ని వర్ణిస్తూ జానపదుడైన ఒక కవి దీనిని

కం॥ ఉంద్రావి యడవిలోపల
గుంద్రాయై యున్న మౌని కోమలిపైఁగో
దంద్రాము పదముసోకిన
గుంద్రాతికి కాళ్లు వచ్చిగుడగుడ నడచెన్ ॥

అని పూరిస్తే వేరొకడు, బిందుపూర్వక ద్రప్రాసను, అంటే కష్టతరమైన ప్రాసనిచ్చి నందుకు పృచ్ఛకునిపై కోపించి -

కం॥ ఉంద్రా యోరి దురాత్మక !
యింద్రా ప్రాసంబు కవుల కియ్యందగునా?
యంద్రాము పదముసోకిన
గుంద్రాతికి కాళ్లు వచ్చి గుడగుడ నడచెన్ ।

అని పూరించి నోరార తిట్టి, తన యక్కస్సును వెళ్లబుచ్చేడు దేశ్యపదాలనిలా సంక్లిష్టంగా మాపినా తత్సమాలను మాత్రం కోదంద్రాము, యింద్రాము అని చేయకూడదు అయినా సమయం సందర్భం ఆదోషాన్ని ప్రక్కకు నెట్టి తుదకు ఆనందపర్యవసాయిత్వమే సిద్ధిస్తుంది 'ఏకోహిదోషో గుణ సన్నిపాతే' యన్నట్టు సహృదయులు పోనీలేనని సరిపెట్టుకుంటారు

ఇలా జానపదుల నుండి వెల్లి విరిసిన యీ సమస్యాపూరణం కింకవీంద్ర ఘంటా పంచాననులచే యావదాంధ్రమునందునా అవధానాల్లో పోషింపబడుతూ అవధానాన్ని రక్తి కట్టించే ప్రధాన సన్నివేశంగా రూపుదిద్దుకుంది

ప్రస్తుతాంధ్రగీర్వాణ శతావధానంలో, అవధాని శేఖరులు, పణ్డితప్రకాణ్డులునైన యిరువది నలువుర పృచ్ఛకులచే నీయబడిన సమస్యల స్వరూప స్వభావాలనొక పరి పరికిద్దాం!

అవధాని కవియేకాక గాయకుడు కూడా కావడంచేత ఈ సమస్యల తోరణం లోనే గాయత్రి అవతరించిందనిపిస్తుంది గాయత్రి చతుర్వింశత్యక్షర మఱియు త్రిపద గా కీర్తించబడింది సమస్యలు కూడ చతుర్వింశతి సంఖ్యాకములు. వానిలో మూడు సంస్కృత సంబంధులు సమస్య లిరువది నాలుగింటిలో ప్రతి యెదవది సంస్కృత సమస్యగా నిర్దేశింపబడింది కాని సంస్కృత సమస్యను నిర్వహించవలసిన పృచ్ఛకు లిరువురి యనుపస్థితి కారణముగా సంస్కృత సమస్యలు మూడే పూరింపబడినవి ఇప్పటి వరకు సమస్యల తోరణాన్ని చూసేం యింక సమస్యలతో-రణాన్ని చూచి యానందిద్దాం !

---

# సమస్యాపూరణములు – వాటి వివరణలు

సర్వశ్రీ

**పృచ్ఛకులు : 'పండితరాజు' – 'ఉపన్యాసకళానిధి' ఆచార్య ప్రభాకర శ్రీకృష్ణ భగవానులు ఎమ్.ఎ. రాజమండ్రి**

## తెలుగు సమస్య

"భార్యకు మీసముల్ మొలిచె బాపురె ! భర్తకు గర్భమయ్యెడిన్"

**అవతారిక :–** సమస్యలతోరణం యిలా ఉత్పలమాలికతోనే కట్టబడ్డా రణం మాత్రం గట్టిగానే ప్రారంభమైందని చెప్పవచ్చు. భార్యకు మీసములు మొలిచి నాయట! భర్తకు గర్భమయ్యిందట ! బాపురే యన్న పదం 'ఇదేం విడ్డూరమో !' అనే స్ఫూర్తినికలుగ చేస్తుంది. ఇదీ సమస్య స్వరూపం దీన్ని అవధాని

### పూరణ

**ఉ॥ నిర్యదమంద సత్ప్రణయ నీరధిలో తలమున్కలై చనన్**
**కార్యముకాదుగాని తమకా మరి సంతతి లేదటన్న యా**
**శ్చర్యము వీడిపోయినది చాలును చూలును నిల్చె చూడుమీ**
**భార్యకు మీసముల్ మొలిచె బాపురె ! భర్తకు గర్భమయ్యెడిన్ –**

అని పూరించేరు. నిర్యత్ + అమంద ప్రణయాంబుధిలో నిరంతరము తల మున్కలుగా మునిగి తేలుతున్నా సంతతి కలుగుట లేదనే యాశ్చర్యమిక వీడి పోయినదట ! ఏలన భార్యకు చూలునిలిచినది చూడుమనుచున్నాడు భర్తకు మీసములు మొలిచినవట! ఇట్లా యిరువురకు కడుపు పండినది. ఇలా 'చూలునునిల్చె చూడుమీ భార్యకు' – మీ సముల్ మొలిచె భర్తకు" అనెడి విరుపులతోడి సమన్వయముతో సమస్యకు పరిష్కారం కుదిరింది.

**2. పృచ్ఛకులు : "బ్రాహ్మీభూషణ' ' కవిసార్వభౌమ'**
**'కవితా శ్రీనాథ' 'కళాప్రపూర్ణ' డా. శ్రీ యస్.టి. జ్ఞానానందకవి, కాకినాడ.**

# తెలుగు సమస్య

"లంగానెత్తెను సీత గుండె చెదరన్ లక్ష్యమ్ము సిద్ధింపగన్ !"

**అవతారిక :** ఈ సమస్యలో ఒక అందం కనిపిస్తుంది పృచ్ఛకులు శార్దూలాన్ని ప్రయోగించడమే కాకుండా చివర్లో 'గన్ (GUN) కూడా గురిపెట్టేరు పై సమస్యలో ఒక విడ్డూరం స్ఫురిస్తే యీ సమస్యలో సీతవంటి ఆదర్శ పతివ్రతాలలామపై యశ్లీలార్థ పద ప్రయోగపుటాభాసము కల్పింపబడినది కాగా లక్ష్యంసిద్ధించేలా, గుండె చెదిరేలా లంగానెత్తెను – సీత యనే అశ్లీలార్థ సంభావన కవకాశమేర్పడుతుంది. దీన్ని పరిహరించి యీ మహాసాధ్వి పాత్రకు న్యాయం చేకూర్చవలసిన బాధ్యతను అవధానిపైనుంచేంనిపిస్తుంది సీతా స్వయంవర సభలో శివధనుర్భంగ ఘట్టాన్ని వర్ణ్యంగా గ్రహించి అవధాని యీ సమస్యను

**పూరణ**

**శా!** **సింగారమ్ముల లేత మొల్కయగు నా సీతన్ రహింపన్ భళీ**
**పొంగుల్ వారగ దేవతల్, బెదరగా భూకాంత సంఘంబులే**
**నింగిన్ జుక్కలు రాలినేల పడ, వింటిన్ రాముడే విల్లు లీ**
**లంగా నెత్తెను, సీత గుండె చెదరన్, లక్ష్యమ్ము సిద్ధింపగన్ ।**

అని చక్కగా పూరించేరు.

**వివరణ :-** సింగారాల చిరుమొలకల వలె నున్న ముద్దరాలైన సీతమ్మ తల్లిని పెండ్లాడటానికి పణంగా పెట్టిన శివుని విల్లును – దేవతలు సంతోషించి భళీ ! యని మెచ్చుకుంటూంటే, రాజన్య సమూహాలు బెదురుతూఉంటే, నింగి నున్న చుక్కలు రాలిపడేలా ధ్వనింప చేస్తూ లేత్రాయంలో ఉన్న సీతగుండె చెదరగా, లక్ష్యంసిద్ధించేలా ఎక్కుపెట్టడానికై లీలగా నెత్తేడని యర్థం మూడవ పాదంలో చివరనున్న "రాముడే విల్లు లీ" అనే భాగాన్ని నాల్గవ పాదం మొదట నున్న 'లంగానెత్తెను' అనే పదంతో కలిపి అన్వయిస్తే – 'రాముడే, విల్లు లీలంగా నెత్తెను' అను వాక్యము సిద్ధించి అశ్లీలార్థ సంభావన పరిహరింప బడుతుంది. శివధనుర్భంగ నిస్వనానికి ప్రయోగింప బడ్డ శార్దూలం బెదిరి వెనుదిరిగి పోయింది. గన్ గుఱి తప్పింది. జ్ఞానానందమవధానికి శ్రీ రామరక్షయై నిలచింది.

**3. పృచ్ఛకులు : 'కవితా విశారద' 'కవిరత్న' 'కవితా భూషణ'**
**శ్రీ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి, ఎమ్.ఎ. కాకినాడ**

## తెలుగు సమస్య

"నిస్సీమంబున సీమయున్నదిగదా నీ పాటినిస్సీమమే"

**అవతారిక :–** నిస్సీమమంటే అవధులు లేని దని యర్థం కాని ఆపదంలోనే సీమ అనగా అవధి అనే పదం ఉంది అలాగే ఓయవధానీ ! నీపాటి అనగా నీసామర్థ్యము నిస్సీమమే ? అనగా నిస్సీమమేనా అని వాచ్యార్థం నిస్సీమంబున సీమయున్నట్లే నీపాటి కూడ సీమాంతర్గర్భితమేనా! అనే వ్యంగ్యమిందులో అధిక్షేప పూర్వకంగా నిక్షేపించబడిందనవచ్చు దీనికి సమాధానంగా శ్రీ శర్మ

**పూరణ**

**శా।** **దోస్ఫార ప్రతిభాప్రభల్ విరియుచున్ దోరంబులై విల్వగా**
**కన్పుల్ బున్పులు వేయి చూపిన సరే కాదంచు వాదింపకన్**
**నిస్సీమంబగు ధారకల్గిన వధానీ సీమముల్ సీమలౌ**
**నిస్సీమంబున సీమయున్నది గదా ! నీపాటినిస్సీమమే ?**

అని పూరించి శార్దూల విక్రీడనంలో తమ సామర్థ్యాన్ని ప్రదర్శించేరు

**వివరణ**

అవధానం నాకొక హేల యనే అర్థాన్ని స్ఫురించేలా భుజబలాన్ని ప్రదర్శిస్తూ పృచ్ఛకుల కస్సుబుస్సులసంఖ్యాకంగా యెదురు నిల్చినా సరే వారితో కాదంటూ వాదించకుండా, తన ధారాశుద్ధి మఱియు నపారమైన శబ్ద సంపదలతో ఆ నియమాలన్నింటికీ సీమలను కల్పించి అడ్డు కట్టలువేసి నీయపార సామర్థ్యమును చూపితివయ్యా అవధానీ ! ( నీపాటి నిస్సీమమే !) అని చెప్పి యొప్పించేరు ఇది అవధాని యాత్మనిర్భరతను సమయ స్ఫూర్తిని సూచించే పద్యరత్నం

**4 పృచ్ఛకులు : ఆచార్య భావన్ – యమ్.ఎ. పిహెచ్.డి – విజయనగరం**

## తెలుగు సమస్య

'రాతిని బొడగాంచి యువతి రాగము చెందెన్'

**అవతారిక** :- రాతిని చూచి యువతి రాగాన్ని పొందిందట ! ఇదెలాగ ? అన్న సంశయం కలగడం సహజం ఈ సందర్భంలో అవధాని గిరిజా సంగైక శృఙ్గారియగు శివుని మన్మధారాతినిగా నుపవర్ణిస్తూ యిలా పూరించేరు

**పూరణము**

కం ॥ **శీతల చంద్రకళాధరు**
**డీటెండెటు గలడొావెదకి హిమజని భక్తి**
**స్ఫీత ప్రీతుని మదనా -**
**రాతిని బొడగాంచి యువతి రాగము చెందెన్ ॥**

**వివరణ**

చల్లని చంద్రమౌళి యెటనున్నాడోయని వెదుకుచూ పార్వతి, భక్తవత్సలుడైన యా మదనారాతిని చూచి రాగము నందినదట అనగా ప్రేమ పరవశయైనదని భావము మదనారాతి యనగా మన్మధుని శత్రువని యర్థం.

**5. పృచ్ఛకులు : డా॥ విష్ణ్వాపూరి శ్రీరామశర్మ యమ్.ఎ.పి.హెచ్.డి.**

**సాహిత్య మీ మాంస - విద్యాప్రవీణ - భాషాప్రవీణ - శ్రీరామతత్త్వజ్ఞ - ఉభయభాషావధాని - రాజమండ్రి**

**సంస్కృత సమస్య**

'అనన్య రూపాః పురుషస్యదారాః'

**అవతారిక**

యేపురుషునకైనను తన భార్య నిరతిశయ సౌందర్యవతి గదా ! అని యర్థము. కాని యిచ్చట దారాః అనగా భార్యలు అను బహువచన రూపముండగా నేకవచనములో నర్థము చెప్పుకొనుట యెట్లు ? అను సంశయము సంస్కృత భాషా నుడికారము ల నెరుగని సామాన్యునకుదయించును. కాని దారాశబ్దాన్ని పుంలింగంలో తత్రాపి, నిత్యబహువచనాన్తంగా ప్రయోగించాలనేది సంస్కృత భాషా సంప్రదాయం 'దారాః పుంసి చ భూమ్న్యేవ' అనినామ లిఙ్గానుశాసనం. ఏ తదనుగుణంగానే అవధాని -

పూరణము

శ్లో॥ నిరన్తరం స్వీయ హృది ప్రసన్నే
పతిం స్మరన్తీం సుదతీం విలోక్య
జగాదభర్తా త్వయి సర్వభోగాః
అనన్యరూపాః పురుషస్యదారాః ॥ – అని పూరించేరు

వివరణ

ఎల్లప్పుడూ ప్రసన్నమైన మనస్సులో తననే స్మరిస్తూ ఉండే సుందరి యైన ార్యనుద్దేశించి, యామె భర్త నీయందే నా భోగభాగ్యములన్నీ యున్నవి ఏలన తన ార్యయే పురుషునకు నిరతిశయ సౌందర్యము కలదిగా భాసించును గదాయని చెప్తాడు సంస్కృత భాషా సంప్రదాయము నెఱిగిన రసజ్ఞుడీ సమస్యా పూరణ ములలోని చమత్కృతిని సంభావించి యానందింపగలడు

**6 . పృచ్ఛకులు : డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు యమ్.ఎ.పిహెచ్.డి. ారతాచార్య – రాజమండ్రి**

## తెలుగు సమస్య

"మాన్యన్ రతిగూడి కూతుగనె విశ్వామిత్రుడుల్లోలుడై"

అవతారిక : విశ్వామిత్రుడుల్లోలుడై పతివ్రతయగు రతిని గూడి కూతుర్ని న్నాడు అని, లేదా గౌరవనీయురాలిని లోలుడై రతిఁగూడి కుమార్తెను కన్నాడని ండర్థాలు యీ సమస్యలో స్ఫురిస్తాయి రెండూ సరియైనవి కావు విశ్వామిత్రుడు ునకను పరిణయ మాడి కూతురును గన్నాడు కాని రతిని గూడి కాదు ఆమేనక ్వర్వేశ్యయేగాని మాన్యురాలు కాదు కావున నిదియెట్లు పొసగుననే సంశయం లగడం సహజం దీన్ని పరిష్కరిస్తూ శ్రీ నాగఫణి శర్మ

పూరణము

శా॥ సామాన్యుండితడౌనె నిత్యసుకళా సర్వస్వ పారీణుడై
సీమా శూన్య సుఖానల జ్వలితుడై శృఙ్గార వారాశిలో
ప్రేమల్ మీఱఁగ మేటి మేనకను భూరిప్రౌఢ లీలా కళా
సామాన్యన్ రతిఁగూడి కూతుఁగనె విశ్వామిత్రుడుల్లోలుడై !

అని చాలా నేర్పుతో పూరించేరు

**వివరణ**

ఇది నేర్పుతో పూరించాల్సిన సమస్య శార్దూల పద్య పాదంలో మొదటి యక్షరాన్ని గుప్తంచేసి సమస్యనిచ్చేరు అవధాని తొందరపడి 'న్య' ప్రాసతో పద్యాన్ని ప్రారంభిస్తే తప్పినట్లే ! అవధాని యసామాన్యుడు కాబట్టి 'సామాన్యుండితడౌనె!' యని పద్యాన్ని ప్రారంభించేడు విశ్వామిత్రుడు సామాన్యుడా? అపారమగు మన్మధాగ్ని జ్వాలాదందహ్యమాన చేతస్కుడై శృంగార రసాంబుధిలో మునిగి భూరిప్రౌఢ లీలాకళా సామాన్యయగు మేనకను రతిఁగూడి కుమార్తెనుకన్నాడని భావం మేనకను భూరిప్రౌఢ లీలా కళా సామన్యగా వర్ణించడం ద్వారా సమస్య పరిష్కరింపబడిందని గ్రహించాలి

**7. పృచ్ఛకులు : శ్రీ యమ్. శ్రీనివాసు – రాజమండ్రి**

## తెలుగు సమస్య

"వ్యాప్తములయ్యెనిరులు ఖరకరుడుండన్"

**అవతారిక :** పై సమస్యలో వలెనే యిందులో కూడా అక్షరగోపనం చెయ్య బడింది. చండ కిరణుడైన సూర్యుడుండగానే చీకట్లు వ్యాపించినాయట అవధాని ఈ సమస్యనిలా పూరించేరు

**పూరణము**

**కం॥** **దివ్యద్దుర్దిన మనగా**
**భవ్యుండీ కరణి తరణి వటు మేఘాంత**
**స్సేవ్యుండై యిటు విలిచెను**
**ఖవ్యాప్తములయ్యె నిరులు ఖరకరుడుండన్ ।**

**వివరణము**

దుర్దినమంటే ప్రొద్దు పొడవని రోజు అని యర్థం. "మేఘచ్ఛన్నేஉహ్ని దుర్దినమ్" అంటే ఆకాశం మేఘావృతమై సూర్యుడసలు కానరాని పగలుస దుర్దినంగా నిర్వచింప బడింది. అలాంటి దుర్దినంలో తరణి, అంటే సూర్యుడు మేఘముల మాటున మరుగైన వాడు కాగా చీకట్లాకాశంలో వ్యాపించేయని పద్యానికర్థం. పై సమస్యలో లాగే యీ సమస్యలో కూడ మొదటి యక్షరం గుప్తం చేయబడింది 'వాపములయ్యె'

– అనే ప్రారంభాన్ని చూసుకొని అవధాని గుప్త, లుప్త మొదలైన 'ప్త' ప్రాసగలపదాలతో పూరణ ప్రారంభిస్తే పప్పులో కాలువేసినట్లే ! అధిక్షేపింప బడినట్లే ! అలాక్కాకుండా యీ రెండవ గుప్తిని కూడా గ్రహించి అవధాని చక్కగా సమస్యను పూరించడం అందరకూ అమందానందాన్ని కలిగించింది

**8 .పృచ్ఛకులు : శ్రీ బులుసు వెంకటరామ్మూర్తి –అష్టావధాన కళాభారతి – ఆశుకవి చక్రవర్తి – రాజమండ్రి.**

## తెలుగు సమస్య

'రావణ కుంభ కర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై'

**అవతారిక :–** రావణకుంభకర్ణులకు సకలగుణాభిరాముడగు రాముడు పుట్టెనట! ఈ సమస్యను శ్రీ రామావతార ఘట్టాన్ని వర్ణిస్తూ అవధాని అందంగా యిలా పూరించేరు.

**ఉ॥ భావుకతా మహర్షులకు భాసురరీతిని ప్రీతిగల్గగా**
**శ్రీ వృతరాఘవాన్వయ చరిత్రకు ధాత్రిని ఖ్యాతి గల్గగన్**
**భూ విభుడావిభూతిఁగన భూరితరస్థితి భీతి గల్గనా**
**రావణకుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై!**

**వివరణ :–** భావుకులైన మహర్షి బృందాలకు సంతోషం కలిగేలాగ, భూమిపై రఘువంశ చరిత్రకు ఖ్యాతి కలిగేలాగ, దశరధ మహారాజా విభూతిని కని యానందించేలాగ, రావణకుంభకర్ణులకు భీతిజనించేలాగ ( గుణాభిరాముడైన రాముడు జన్మించేడని యర్థం కాగా మూడు నాలుగు పాదాల తుదిమొదళ్లను కలిపి 'భీతి గల్గ నారావణకుంభ కర్ణులకు' – అని అన్వయించుకుంటే సమస్య దానికదే సమసిపోతుంది.

**9 .పృచ్ఛకులు : శ్రీ అబ్బిరెడ్డి పేరయ్య నాయుడు – భాషాప్రవీణ – అవధాని శేఖర – రాజమండ్రి**

## తెలుగు సమస్య

'రాజీవమ్ము ప్రభాకరోదయమునన్ రవ్వన్ కనుల్ మూసెడిన్.

**అవతారిక :–** పద్మం సూర్యుడుదయించగానే కష్టంతో కన్నుమూసిందట!

సూర్యోదయానికి పద్మాలు వికసించడం సాధారణమైన విషయం. కాని యీ రాజీవమేమో సూర్యుడుదయించగానే బాధతో కన్నుమూసిందట! శ్రీరాజీవ్ గాంధీ మరణించిన ఘట్టాన్ని విషయంగా స్వీకరించి యవధాని యీ సమస్యనిలా పూరించేరు.

**పూరణ**

ఉ॥ **రాజీలేని నిరంతరాటనములో రాష్ట్రప్రియం భావుక**
**భ్రాజత్కీర్తి నతార్తి బంధన కళాఢ్యుండు సౌమ్యుండునా**
**రాజీవుండటు వేకువన్ మడిసె ఘోరక్రౌర్యమాహార్యమై**
**రాజీవమ్ము ప్రభాకరోదయమునన్ రవ్వన్ కనుల్ మూసెడిన్‌॥**

**వివరణ**

తన తనతనాన్ని కోల్పోకుండా ఏవిషయంలోనూ రాజీపడకుండా, స్వతంత్రంగా వ్యవహరిస్తూ ,సౌమ్యుడై, ఆర్తత్రాణ పరాయణుడుగా కీర్తినందుచున్న రాజీవుడు (రాజీవ్ గాంధీ) ఘోరక్రౌర్యమున కాహార్యమై మరణించగా నా వేకువనాతని ముఖపద్మము ఉవ్వుతో మూసిన కన్నుదోయికలదై అచేతనముగా నుండి పోయెనని భావము.

**10. పృచ్ఛకులు : శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ యమ్.ఎ. వ్యాకరణ విద్యాప్రవీణ – న్యాయవిద్యాప్రవీణ – రాజమండ్రి**

**సంస్కృత సమస్య**

'కంఠీరవః పరిభవం సహతే మృగీభ్యః'

**అవతారిక :**– ఇది సంస్కృత సమస్య. మృగరాజైన సింహము హరిణాంగనల వలనైన యవమానాన్ని లేదా ధిక్కారాన్ని సహించు చున్నదని సమస్య. ప్రస్తుతావధానాన్నే వర్ణ్యంగా గ్రహించి శ్రీ శర్మ యీ సమస్యను యథోచితంగా

**పూరణము**

**శ్లో॥ అత్రావధాన విపినే బహు కష్టకార్యే**
**సింహాయమాన గమనోఽహి వధాని వర్యః**
**ప్రశ్నావళిర్భవతి మోహపరామృగే**
**కంఠీరవః పరిభవం సహతే మృగీభ్యః**

అని పూరించేరు.

**వివరణ**

బహు గొప్ప కంటకాల్లాంటి సమస్యలతో జటిలమైన యీ శతావధానారణ్యంలో అవధాని సింహగమనంతో (సింహమై) సంచరిస్తూంటే, మోహంలో పడద్రోసే, అంటే పెడదారిని పట్టించే ప్రశ్నావళి మృగీసమూహంలా పరివేష్టించి యున్నదట అదియవమానింపదలిస్తే మాత్రం సింహంలాంటి అవధాని సహిస్తాడా! ఎన్నటికీ సహింపడని తాత్పర్యం పృచ్ఛకమండలిని కాకుండా ప్రశ్నావళిని మృగీ బృందంతో పోల్చి ఎంతో ఔచిత్యాన్ని పోషించేరు అవధాని. ఈ విధమైన ఔచిత్య పోషణం ప్రతిభావ్యుత్పత్తులు కల యవధానికి మాత్రమే సాధ్యం

**11 పృచ్ఛకులు : విద్వాన్ గుబ్బల మాధవమూర్తి – కవితిలక –జగ్గన్నపేట**

**తెలుగు సమస్య**

"రంభయు రామచంద్రుడును రాత్రి పరుండిరి పర్ణశాలలో"

**అవతారిక** – రంభారాముడూ రాత్రిపర్ణశాలలో పరుండినారట ! ఇదికూడ ఒక విడ్డూరంలా కనిపించే సమస్య. దీన్ని శ్రీ నాగఫణిశర్మ రామాయణార్థంలోనే

**పూరణ**

**ఉ॥ దంభములేని వాడు గుణతత్త్వ రహస్య మెఱుంగువాడు సం**
**స్తంభిత రాజ్యభోగుడయి తానయివచ్చె వనాన్తసీమకున్**
**జృంభిత సద్గుణాకలిత సీతను గూడి మహోక్షమాగుణా**
**రంభయు రామచంద్రుడును రాత్రి పరుండిరి పర్ణశాలలో ।** అని పూరించేరు.

**వివరణ**

నిరహంకారియు, గుణ తత్త్వరహస్యములనెఱింగిన వాడును, తనపినతల్లిచేనిలిపి వేయబడిన రాజ్యభోగములు కలవాడూ అయిన శ్రీరామచంద్రమూర్తి, పితృవాక్య పరిపాలన కోసం, తానుగా వనాంతసీమకు వచ్చి, సద్గుణాలవాలయు, మహోక్షమాగుణా రంభయునైన సీతతో కూడి రాత్రి పర్ణశాలలో పరుండినాడని. భావము సీతను 'మహోక్షమాగుణారంభ'గా వర్ణించి కవి సమస్యను పూరించడం చాలా హృద్యంగాఉంది

**12 పృచ్ఛకులు: శ్రీ కోటమర్తి వెంకట నరసింహమూర్తి యమ్.ఎ. భాషాప్రవీణ – అష్టావధాని – కొవ్వూరు.**

**తెలుగు సమస్య**

' మాడుగులావఘూటు మన మాడు పగుల్చునె కాకినాడలో '

అవతారిక : ఇదొక చిత్రమైన సమస్య శ్రీ నాగఫణి శర్మ గారింటి పేరు మాడుగుల వారు మాడుగులనేది గ్రామనామం ఈ మాడుగుల గ్రామం ఘాటైన ఆవాలకు పెట్టింది పేరు, ప్రస్తుతం కొత్తావకాయ రోజులు కావడంచేత యా మాడుగులానఘూటు అందరికీ అనుభవంలో యున్నదే ఆ యనుభవానికి తన అవధానానుభవాన్ని జోడిస్తూ మన మాడుగులావధాని చమత్కారంగా యీ సమస్యనిలా పూరించేరు

**పూరణము**

**ఉ॥ దాడి సహించి పోటులకు తప్పికొనన్ ప్రయతించకుండతాన్**
**వీడని తద్రసంబులకు వీడుగమించి రుచుల్ ఘటింపగా**
**పాడిని దప్పి తప్పి రసభంగముగా కబళింపజూడనీ**
**మాడుగులావఘూటు మనమాడు పగుల్చునె కాకినాడలో॥**

**వివరణ**

పాపం ! మాడుగులావాలు రోకటి పోటుల దాడుల్ని సహిస్తూ తప్పించుకునే ప్రయత్నమేనా చెయ్యకుండా, వివిధములైన రుచులకు వీడుగానిలచి, యన్నింటి రుచులను ఘటిస్తున్నప్పటికీ, పాడిని తప్పి రసభంగముగా కబళింపచూస్తే ఆ యావఘూటు మన మాడును పగులగొడుతోందని వాచ్యార్థం. పృచ్ఛకుల దాడుల్ని సహిస్తూ, తప్పించుకునే ప్రయత్నమేమీ చెయ్యకుండా, ఓర్పుతో నేర్పుగా రసస్ఫూర్తికి భంగం రాకుండేలా యవధానాన్ని నిర్వహిస్తున్నా, రసాభాస చేద్దామనే తలంపుతో పాడిదప్పి యవధాని కీర్తిని కబళించే ప్రయత్నంచేస్తే గనుక, " ఈ మాడుగులావఘూటు మన మాడు పగుల్చునె కాకినాడలో ' ననే హెచ్చరికను వ్యంగ్య మర్యాదలో భాసించేలా చేసిన యీ పూరణ పద్యమొక రసగుళిక.

**13 పృచ్ఛకులు: శ్రీ చింతా యాజ్ఞవల్క్య మహర్షి**

**సంస్కృత భాషాకోవిద – భాషాప్రవీణ – పామర్రు**

## తెలుగు సమస్య

'కాంతుడు కాంతయై తనదు కాంతకుకాంచెను క్రాన్త దర్శనున్'

**అవతారిక :-** భర్త తన కాంతకు కాంతయై క్రాన్త దర్శనుడైన యొకనిని కనినాడట ఇది యొక విడ్డూరమైన సమస్య భౌతిక ప్రపంచములోనిది యసంభవము కావున దీనికి స్వప్న ప్రపంచంలో సంభావ్యతనుపకల్పిస్తూ అవధాని యిలా పూరించేరు

**పూరణ**

**ఉ॥ సంతసమంది సంతతము సంతమసంబులు జారిపోవగాన్**
**కాంతయు మన్మధోత్సవ సుఖార్ద్ర దినాంతము లెన్నియైననున్**
**సంతతి లేని యంధ తమసంబులు గూర్చగ స్వప్న సీమలో**
**కాంతుడు కాంతయై తనదు కాంతకు కాంచెను క్రాంతదర్శనున్ ।**

**వివరణ**

ఆదంపతులకిలా మన్మధోత్సవ సుఖార్ద్ర దినాంతాలెన్నో సంతోషంతో గడుస్తున్నా కూడా సంతతి లేమియనే అంధతామిస్రము వారికి జీవితంలో చీకటిగానే మిగిలిపోయింది ఇలా ఉండగా నొకనాడు స్వప్నజగత్తులో నా కాంతుడు, తాను కాంతయై తనకాంతకొక క్రాంత దర్శనుడైన కుమారుణ్ణి కాంచి నాడని భావం.

**14 పృచ్ఛకులు: శ్రీమతి డా॥ తటవర్తి నాగమణి – యమ్.ఎ.పిహెచ్.డి. – రాజమండ్రి.**

**తెలుగు సమస్య**

దొంగకుమ్రొక్కినన్ నవనిధుల్ లభియించు శుభంబు చేకురున్.'

**అవతారిక :** దొంగకు మ్రొక్కితే గనక, నవనిధులు లభించడమే కాకుండా శుభముకూడా కలుగుతుందట. వెన్నుని వెన్నదొంగగా వర్ణించి అవధాని ఈ సమస్యనిలా పూరించేరు

**పూరణ**

**ఉ॥ కొంగున కోకదాచెనని కోమలి చిత్తము దోచెనంచునే**
**ముంగిలి జూడ వెత్తైఆగు మోహన మోహకథాప్రపంచమే**

**వెంగలి కానివాడు పలువెన్నెల వన్నెల వెన్నదొంగ యా**
**దొంగకు మ్రొక్కినన్ నవనిధుల్ లభియించు శుభంబుచేకురున్ ।**

**వివరణ**

ఒకామె చేలాన్ని హరిస్తే వేరొకామె చిత్తాన్ని, యిలా ఏముంగిట చూచినా వెన్నదొంగయైన చిన్నికృష్ణుని మోహన చౌర్య కథా ప్రపంచమే కాన్పించు చున్నదట. అలాంటి యీ వెన్నదొంగకు మ్రొక్కినట్లయితే నవనిధులు లభించడమే కాకుండా శుభం కూడా కలుగుతుందని భావం ఏమిటా శుభమంటే మోక్షమేనని సమాధానం ' మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్ అని కదా సంప్రదాయం.

**15 పృచ్ఛకులు: డా॥ పన్నాలభట్టశర్మ యమ్.ఎ.పిహెచ్.డి**

**సాహిత్యవిద్యాప్రవీణ – సాహిత్యభూషణ, విద్యానిధి – భాషాప్రవీణ – పిఠాపురం.**

**సంస్కృత సమస్య**

'మత్తేభసర్పౌ నరతాం భజేతే '

**అవతారిక :–** ఇది సంస్కృత సమస్య మత్తేభ సర్పాలు రెండూ మనుష్యత్వాన్ని పొందుతున్నాయట అవధాని తన పేరునాలంబనంగా తీసికొని చేసిన పూరణయిది బహుశ : పృచ్ఛకులు కూడాయిదే ఉద్దేశ్యంతో సమస్యను కూర్చియుండవచ్చు

**పూరణ**

**శ్లో ।** **శ్రీ శారదా స్తన్యయుగ ప్రసన్నాం ।**
**శుభ్రాకృతిం ప్రాప్యరసస్వరూపాం ।**
**శ్రీ నాగఫణ్యాఖ్య కవిచ్ఛలేన**
**మత్తేభసర్పౌ నరతాం భజేతే ॥**

సంగీత సాహిత్యాలు రెండూ సరస్వతీ స్తన్యధారలే. అదృష్టవశాత్తూ ఆ రెంట గ్రావినట్టి మత్తేభ సర్పాలు రెండూ కవిరూపంలో యిలా నాగఫణి శర్మగా రూపొందే... అని శ్లోక భావం ఇలా సంగీత సాహిత్యాలు తన సహజగుణాలని, ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని చెప్పకయే చెప్పినాడు కడు గడుసరియైన అవధాని !.

**16 పృచ్ఛకులు: శ్రీ చోడ్నీరు శ్రీరామమూర్తి – భాషాప్రవీణ – సరసకవి – అమలాపురం**

## తెలుగు సమస్య

'కులటన్ గూడి వసించె రాముడు మదిన్ గోర్కెల్ పిసాళింపగన్'

**అవతారిక :** సకల సద్గుణధాముడుగా, పురుషోత్తముడుగా, తనువుదాల్చిన ధర్మువుగా అందరిచే కీర్తింపబడే రాముడు మదిలో కోర్కెలు చెలరేగుచుండగా కులటను గూడి వసించినాడట ! ఇదెలా సాధ్యమనే సంశయాన్ని కలిగిస్తుందీ సమస్య శూర్పణఖాతిరస్కారఘట్టాన్ని వర్ణిస్తూ అవధాని యీ సమస్యనిలా పూరించేరు

**పూరణ**

**మ:** విలసత్కీర్తి పరీత భూవలయ సంవిన్మూర్తియౌ రాముఁడే
కవితాధర్మ విచార శూర్పణఖకై కామాంధ చేతస్కకై
యలిగెన్, రాముడు నిప్పు, తప్పు మఱిహోహో యెట్లు రాగాకులా
కులటన్ గూడి వసించె రాఘవుడు మదిన్ గోర్కుల్ పిసాళింపగన్

**వివరణ**

విలసత్కీర్తి పరీత భూవలయుడగు శ్రీరాముడు, అధర్మ విచార పరాయణ మరియు కామాంధ చేతస్కయునైన శూర్పణఖ పై యలిగినాడు ఆఁ రాముడు నిప్పు తప్పుమఱి ! హో హో యెట్లు, అంటే ఏ విధంగా ఆ రాముడు రాగాకులాకులటన్ కూడి మదిలో కోర్కెలు పిసాళించేలా వసిస్తాడు ? ఏ విధంగాను వసింపజాలడని భావం రాముణ్ణలా ఊహించడమే తప్పని భావం

**17 పృచ్ఛకులు: శ్రీ పోచనపెద్ది సుబ్రహ్మణ్య రామనరసింహమూర్తి – యమ్.ఎ. భాషాప్రవీణ – గొల్లపాలెం.**

## తెలుగు సమస్య

' రతి పాదాలకు మ్రొక్కి యీకవన సామ్రాజ్యాన పేరొందుమా '

**అవతారిక :–** రతి పాదాలకు మ్రొక్కి, ఈ కవితాసామ్రాజ్యంలో పేరును గడించుమని సమస్యార్థం "సర్వశుక్లా సరస్వతీ" యనునట్లుగా నామెను వర్ణించి,యా 'భారతి పాదాలకు మ్రొక్కి ' యని సమన్వయించి యిలా పద్యం పూరించేరు శ్రీ శర్మ.

పూరణ

మ॥ అతులౌన్నత్య హిమాచలామరధునీ హాసప్రభావైఖరీ
శ్రుతి డిండీర మరాళ చంద్ర ఘన చక్షుశ్శ్రోత్ర కర్పూరనం
హతిశైరావత మత్కవి త్వ శ్రుతి శుభ్రాకార శ్రీ కీర భా
రతి పాదాలకు మ్రొక్కి యీ కవన సామ్రాజ్యానఁ పేరొందుమా !

వివరణ

అనుపమౌన్నత్యముకల హిమాలయము, ఆకాశగంగ, తెల్లని నవ్వు, వేదఘోష, రాయంచ, సుధాంశుడు, కర్పూరం, ఐరావతమువలె తెల్లనైన (నా) కవితా స్వరూపిణి యగు నీ కీరభారతి పాదాలకు మ్రొక్కి యీ కవితా సామ్రాజ్యమున పేరొందుమా ! అనియాశంస

**18 పృచ్ఛకులు : శ్రీ కాశీభొట్ల సుబ్రహ్మణ్య శర్మ – భాషాప్రవీణ – నరసాపురం.**

**తెలుగు సమస్య**

'కమలంబుల్ ముకుళింప విచ్చుకొన చక్కన్ సూర్యుడేతెంచెడున్

**అవతారిక :**– కమలములు కొన్ని ముడుచుకుంటూ, మరికొన్ని విచ్చుకుంటూ యుండేలాగ సూర్యుడేతించినాడట దీనికి భావగర్భితమైన చక్కటి పూరణపద్యం యిలా చెప్పబడింది

పూరణము

మ॥ అమరప్రౌఢ ధునీ సమాన కవితా వ్యాపారమేపారగాన్
రమణీ శ్రేణియు పూరుషప్రతతి సారంబంద శృఙ్గారవా
గమృత స్రావము గల్గుచో కవన సూర్య శ్రీ గనన్ నమ్మఖీ
కమలంబుల్ ముకుళింప విచ్చుకొన చక్కన్ సూర్యుడేతెంచెడున్ ।

వివరణ

ఆకాశగంగా ప్రవాహంలాంటి కవితాప్రసంగాన్ని స్త్రీలు పురుషులూ కలసి యాస్వాదిస్తున్న తరుణంలో శృఙ్గార ప్రసంగం వచ్చేసరికి ఆ కవనసూర్య శ్రీనిచూచి స్త్రీల ముఖకమలాలు ముడుచుకుంటే పురుషుల ముఖాబ్జాలు విచ్చుకొన్నాయని భావం.

**19 పృచ్ఛకులుః శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ – యమ్. ఎ. కాకినాడ.**

**తెలుగు సమస్య**

' మత్కపిత్రుకుఁ దెమ్మనె పతి మగువయు ( దెచ్చెన్ '

**అవతారిక :–** ఇది దుష్కరప్రాసతో క్లిష్టార్థపదఘటిత మైన సమస్య. పేరునకిది తెలుగు సమస్యే అయినా 'సమస్య' సంస్కృతానికి సంబంధించినదే. 'మత్కపిత్రుకు' అనే పదానికి ఝటిత్యర్థ బోధ కలిగితే గనుక సమస్య పూరింప బడినట్లే సంస్కృతాంధ్రాలలో సవ్యసాచి కాబట్టి యవధాని దీన్నిలా హేలగా పూరించేరు

**పూరణ**

**కం ।** **తాత్కాలికముగ రమణీ**
**సత్కావ్యములేవొ కొన్ని సంధించుచుకిం**
**చిత్కరునగు నవ్వానివి**
**మత్కపిత్రుకు దెమ్మనె పతి మగువయు ( దెచ్చెన్ ।**

**వివరణ**

ఒక కవి తాత్కాలికంగా సత్కావ్యములనదగిన పద్యాలను రచిస్తూ, ఆ సమయంలో కించిజ్ఞుడైన తన కుమారుణ్ణి తీసికొని రమ్మని భార్య నాదేశిస్తే యామె తీసికొని వచ్చిందని భావం. ఇక్కడ కుమారుడనే యర్థంలో 'మత్కపిత్రుకు' అనే శబ్దం సమస్యలో ప్రాణభూతమైనది 'అహంపితా యస్యసః – అనే యర్థంలో మత్కపిత్రుక శబ్దం ప్రయోగింపబడటం, అది 'త్క' అనే దుష్కరప్రాస యుక్తం కావడం, సమస్యకుపజీవ్యకాలైన విషయాలు. ఏమైనా సంస్కృతాంధ్రాలలో సమానమైన వైదుష్యంకల శ్రీ శర్మ దీన్ని సమర్థవంతంగా పూరించేరని చెప్పవచ్చు.

**20 పృచ్ఛకులుః శ్రీ రామకృష్ణ భరద్వాజ – యమ్.ఎ. – కాకినాడ.**

**తెలుగు సమస్య**

డప్పులు కొట్టనేల జగడంబు వధానికి చిత్రభంగిమన్

**అవతారిక :–** చిత్రభంగిమలో నవధానికి డప్పులు కొట్టడ మెందుకు జగడాని క్కాకపోతే నని సమస్యార్థం. ఇది కించిద్భావ గర్భితమైన సమస్య. ఇటీవల విడుదలైన ఒక సినీమాలో అవధాని ఒక పాత్రను పోషిస్తూ డప్పుకొట్టారుట ! దాన్నధిక్షేపిస్తూ

విసిరిన విసురుగా కనిపిస్తుందీ సమస్య. అవధాని ఎంతో సౌమ్యంగా దాన్నిలా పరిష్కరిస్తూ, పాటుగా చిన్న చురకనిలా తగులుస్తారు.

**పూరణ**

**ఉ॥ తప్పని వారలై హితులు తప్పదటంచు వచించి మించగా**
**కప్పుర మూర కీర్త్యమరకాంతను కాదను మూర్ఖుడుండునే**
**చప్పుననేను వీడ చడి చప్పుడు చేయక మీరు వెళ్లరా**
**'డప్పులు కొట్టవేల జగడంబు వధానికి చిత్రభంగిమన్' ॥**

**వివరణ**

హితులుగా శ్రేయోభిలాషులుగా తప్పదని బలవంతం చేస్తూంటే, కీర్తికాంత తనకు తానుగా వరించి వస్తే వలదని నిరాకరించే మూర్ఖుడుంటాడా? నేనూ అంతే వచ్చిన ఆ యవకాశాన్ని నేను వదిలేస్తే గనుక, చడీచప్పుడు కాకుండా మీరుగ్రహించరా? ఇలా చిత్ర భంగిమలో అవధానికి డప్పులెందుక్కొడతారు ? జగడానిక్కాకపోతే! నని భావం ఇలా పద్యంతోనే సమాధానంగా సరసంతో కూడిన చిన్న జగడమాడిన తీరు శ్రోతలను మురిపించింది

**21 పృచ్ఛకులు : శ్రీ దేవరకొండ శేషగిరి రావు – యమ్.ఎ. – కాకినాడ.**

## తెలుగు సమస్య

'మంచుమంగొండలు మండుచున్న వవిగో మాహేంద్ర నీలద్యుతిన్'

**అవతారిక :–** ఇంద్ర నీలకాంతితో మంచుకొండలు మండుతున్నాయట! మంచు కొండలు మండటమేమిటి? మండేయనుకున్నా ఆ మంట నీలంగా ఉంటుందా? ఇదెలాగ అని సమస్య స్వరూపం అవధాని శ్రీ నాగఫణి శర్మ ఎంతో హృద్యంగా యిలాపూరిస్తారు

**పూరణ**

**శా॥ కాంచన్ విచ్చలు కూడుగుడ్డలకునై కాట్లాటలే మించగా**
**చంచత్కాంచన సౌధవీథికలపై సౌధమ్ము నిర్మించుచున్**
**చుంచుల్ కొందరు వంచనాఢ్యులనగా చోద్యంబుపో గుండెలై**
**మంచుం గొండలు మండుచున్న వవిగో మాహేంద్ర నీలద్యుతిన్**

### వివరణ

ఒక వంక పేద ప్రజానీకం అనవరతము కూడుగుడ్డలకోసం ఆక్రోశిస్తూ గొల్లాడుకుంటూంటే, వేరొక వైపున వంచనా ప్రతారణా పరులైన కొందరు కోద్యంగా బంగారు రంగారు మేడలపై మేడలు నిర్మిస్తున్నారు ఇది చూస్తున్న నావుకులైన సహృదయ సామాజికుల గుండెలనే మంచుకొండలు సహానుభూతితో మహేంద్రనీల ద్యుతితో మండుతున్నా యని భావం

**22 పృచ్ఛకులు: శ్రీ విశ్వనాథ సత్యనారాయణ –కవి – కాకినాడ.**

### తెలుగు సమస్య

'బ్రహ్మ విధింప లేదిలను బామలకెందును బ్రహ్మచర్యమున్'

అవతారిక :– ఈ పుడమిపై బ్రహ్మ, స్త్రీలకు బ్రహ్మచర్యమును విధింపలేదని సమస్యాపాదము యొక్క అర్థము అవధాని దీనినిలా పూరించేరు.

### పూరణ

**ఉ॥ బ్రహ్మణి మానసంచరతి భవ్యమటన్నను 'బ్రహ్మచర్య' మా**
**బ్రాహ్మిని బుద్ధిలో నిలుప భవ్యముగా నది బ్రాహ్మ్యచర్యమౌ**
**బ్రాహ్మిని గూర్చి యివ్విధిని భామలకున్ విధియించినంతనా**
**బ్రహ్మ విధింపలేదిలను భామలకెందును బ్రహ్మచర్యమున్ ।**

### వివరణ

మానసమున నెల్లప్పుడూ తద్గతాంతర భావనతో బ్రహ్మమును ధ్యానించుట బ్రహ్మచర్య మనబడుతుంది అలాగే బ్రాహ్మిని (సరస్వతిని) బుద్ధితో నిలుపుట లేక నిరంతర విద్యావ్యాసంగము బ్రాహ్మ్యచర్యమవుతుంది ఈ విద్యోపాసనను విధించి నంతగా బ్రహ్మ స్త్రీలకు సాధనా సాధ్యమయిన బ్రహ్మచర్యమును విధింపలేదని భావం

**23 పృచ్ఛకులు: శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి యమ్.ఎ. గుంటూరు.**

### తెలుగు సమస్య

'కోతికి నాతికిన్ జటిగె కూరిమి పెండిలి వైభవమ్ముగా '

**అవతారిక :–** కోతికీ నాతికీ కూడ కూరిమితో వైభవంగా పెండ్లి జటిగిందట. దీన్ని రామాయణార్థంలో అవధాని యిలా పూరించేరు

పూరణ

ఉ॥ ఆతత కీర్తి శాలియగు నారఘురాముడు చేయిపట్టగా
సీతకు భూమిజాత కతసీకుసుమప్రియ కెంతమోదమో
స్ఫీత జలాబ్ధి దాటుటకు సీతను దెచ్చుట కంత మోదమా
కోతికి, నాతికిన్ జరిగె కూరిమి పెండిలి వైభవమ్ముగా ॥

వివరణ

శ్రీరామపాణిగ్రహణముచేత భూజాత సీతామాత యెంతటి యమందానందము నందినదో, జలనిధి దాటడానికి,సీతను తీసికొని రావడానికి, అంతటి యానందము జనించినదటా కోతికి, తరువాత పట్టాభిషేక సమయంలో మరల కూరిమియనే పాణిగ్రహణమత్యంత వైభవంగా ఆ నాటికి జరిగిందని భావం ఇక్కడ సీతను దెచ్చుట కంత మోదమా కోతికి, నాతికిన్ జరిగె కూరిమి పెండిలి వైభవమ్ముగా – అని అన్వయం చేయడం ద్వారా సమస్య పరిష్కృత మైనదని భావం

**24 పృచ్ఛకులు:డా॥ చామర్తి కనకయ్య - ఎమ్.ఎ.పిహెచ్.డి. – కాకినాడ.**

తెలుగు సమస్య

'వనితారత్నము మీసమంటిపలికెన్ వాల్లభ్యమొప్పారగా'

అవతారిక: కాంతామణి గోముతో మీసమంటి పలికిందనియర్థం సమస్యనుచూడ టంలో కించిత్పరిజ్ఞానంగల సామాన్యునికి, వనిత మీసమంటి పల్కుటేమి? అదియును వాల్లభ్యముతో నెటుల? అను సంశయముదయిస్తుంది దాన్నిలాపూరిస్తారు శ్రీశర్మ

పూరణ

**నను విన్నాళ్లుగ వీడిపోయితివి కాన్తా ! నీకు న్యాయమ్మెకో !**
**విను నా సర్వము నీకునై నిజముగా నెచ్చించితిన్, నన్నిదే**
**కనుమా ! నేనిక నీదు వాడననుమా ! కాంతా !యటంచున్ వెనన్**
**వనితా రత్నము మీసమంటి పలికెన్ వాల్లభ్యమొప్పారగా॥**

వివరణ

ప్రవాసము నుండి తిరిగివచ్చిన తన కాంతునితో కాంతామణి ఓ కాన్తా నన్నిన్నా ళ్లుగా వీడిపోయినావు. నీకిది న్యాయమా, విను నా సర్వస్వమును నీకు సమర్పిం చితిని కదా! నన్నికనైన నొకసారి చూడుము 'కాంతా నేను నీ వాడనే'అని యనుము అంటూ దుఃఖంతో వాల్లభ్యంతో గోముగా అతని మీసమును నిమురుతూ పలికిందని భావం

— రచయిత : **కొల్లూరు అవతారశర్మ,**
సంస్కృత లెక్చరర్, పి.ఆర్.జి. కాలేజి, కాకినాడ.

# దత్తపది

అవధానంలో పృచ్ఛక దత్త పదాలతో వారడిగిన విషయాన్ని (పదాలు గణబద్ధాలైన పక్షంలో) వారు కోరినవృత్తంలో ఆశువుగా చెప్పే అవధాన ప్రక్రియా ప్రభేదానికి " దత్తపది" అనిపేరు సాధారణంగా పృచ్ఛకులు నాలుగు పదాలనిస్తారు ఆ నాల్గింటిని నాలుగు పాదాలలో చొప్పించి వారడిగిన విషయాలను నిర్దిష్టవృత్తాలలో నప్పించి అటుపృచ్ఛకులను, ఇటు సభ్యులను కూడ మెప్పించాలి

సాధారణంగా ఇచ్చే పదాలునాలుగూ ప్రాసస్థానం కూడ సరిపోయేలా యిస్తూంటారు

ఉదా :- ఎద్దు, పద్దు, ముద్దు, కద్దు పద్యము, గద్యము, హృద్యము, మద్యము

ఈ దత్తపదిలో సరళమైన ప్రాసలతో కేవల భాషాపదాలనిస్తే గనుక అవధానికి పద్యం సులభంగా నడచిపోతుంది. కానీ చాలా చోట్ల అవధాని మెదడుకు పదును పెట్టేపదాలు ప్రదత్తములవుతూ ఉంటాయి ఉదాహరణకు అశుభవాచకములయిన 'రండ' , కుండ, ముండ, బండ, లాంటిపదాల నిచ్చి ఏ సీతా కళ్యాణాన్నో పద్యంగా చెప్పమన వచ్చు లేకుంటే 'కన్ను – మన్ను – మిన్ను – వన్ను ' లాంటి పదాలను ఇచ్చి ఆ అర్థాలలో వాటిని ప్రయోగించకుండా ఆ పదాల కవకాశంలేని యే రామరావణ యుద్ధాన్నో వర్ణించ మనవచ్చు వేరొక సందర్భంలో విపరీతపదాలనిచ్చి విపరీతార్థంలో పద్యం చెప్పమనవచ్చు ఉదాహరణకు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని నామాలను సంగతం చేస్తూ రామాయణ కధాంశాన్ని వర్ణించ మనవచ్చు లేదా ఒకేపదాన్ని పదేపదే ప్రయోగిస్తూ భిన్న అర్థాలలో ఒక విషయాన్ని వర్ణించమనవచ్చు ఎలాగంటే 'పది' అనే పదాన్ని నాలుగు పాదాలలో ప్రయోగిస్తూ ద్రౌపది స్వయం వరాన్ని కందపద్యంలో వర్ణించమనవచ్చు

ఉదాహరణ :

**కం ।** **పదిలముగ గోర్కెఁద్రుతిచెం**
**పదిగిచి పార్థుండు యంత్రమత్స్యమునేసెన్**
**పదిమంది యౌవన్ద్రౌ**
**పదిగొనె పాంచాల రాట్సభా భాగమునన్.**

పదిలంగా ఒక పది, పెంపదిగిచి ఒకపది, సంఖ్యావాచకంగా ఒక పది ద్రౌపదిలో ఒకపది, ఇలా నాలుగు పాదాలలో నాలుగు పదులు పొసగబడ్డాయి మరి కొన్ని సందర్భాలలో అన్య భాషాపదాలనిచ్చి పొసగని సందర్భంలో వర్ణించమన వచ్చు ఉదాహరణకు 'వేస్టక్టమీ - ట్యూబెక్టమీ - నిరోధ్- లూ ప్ల నుపయోగిస్తూ భారత కథలోని భగవద్గీతా ప్రబోధము వర్ణించమనవచ్చు

కొండొకచో 'ననా, నినినీ, నునునూ, నెనెనే' లాంటి అర్థరహితపదాలనిచ్చి ఏ రాధికామధురభక్తినో, వర్ణించమనవచ్చు వేరొకచో 'గ్రని - య్రని - బ్రని - స్రని' లాంటి ధ్వన్యను కరణ పదాలు, మఱియొకచో 'రాష్ట్రము - భ్రాష్ట్రము - ఉష్ట్రము - లోష్ట్రము మొదలైన దుష్కరప్రాసఘటిత పదాలు దత్తపదులలో ఈయబడవచ్చును

తెలివిగల పృచ్ఛకుడొకచో శాబ్యాభాసమును ప్రకటిస్తూ ఒక కందపద్యంలో నవగ్రహాల నామాలన్నీవచ్చేలా స్త్రీ సౌందర్య వర్ణనం చేయమనవచ్చు

ఇలాంటి దత్తపదులు, అవధానికి పచ్చి వెలక్కాయ లాంటివి అయినా ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసముల కారణముగా అవధాని కుంజరుడు దత్తపదీ కపిత్థాలనన్నింటిని హేలగా జీర్ణించు కొని తన యుక్తి చమత్కారాలతో వారడిగిన పద్యాలను చెప్పి కృత కృత్యుడౌతాడు

ఏవంవిధ దత్తపదులను ప్రస్తుత శతావధానంలో 26 మంది పృచ్ఛక శేఖరులు నిర్వహించారు ఆయా విశేషాలను సంగ్రహంగా సమీక్షిద్దాం

• • • • • •

శ్రీ మాత్రేనమః

# దత్తపదులు – వాటి భావములు

## తెలుగు దత్తపది

1 డా॥ నందుల గోపాల కృష్ణమూర్తి
ఆంధ్రభాషాధ్యక్షుడు, స్నాతకోత్తర విభాగము
ప్రభుత్వ కళాశాల రాజమండ్రి
దత్తపది :– గండ – మిండ – రండ – ముండ (ఓటు ప్రాశస్త్యము)

**పూరణము**

**ఉ॥** **గండములైదు నేండ్లకని గట్టిగ నెంచుచు వచ్చినప్డు తా**
**మిండని ఓటుకై యడిగి యిచ్చిన పిమ్మట నేగి చూడరా**
**రండని కూడ చెప్పరట రాక్షస తామస రాజకీయ మే**
**ముండగ నొక్కి చెప్పగల నోటును గూర్చి విశేషవైఖరిన్**

**భావము**

నాయకులకు 5 సంవత్సరాల వరకూ ఎన్నికల గండం ఉండదని తెలుసును కాబట్టి ఒకసారి కాళ్లావేళ్లా పడ్డా పరవాలేదనే భావంతో ప్రజల్ని ఓటు వెయ్యమని అడిగి (అడుక్కొని) వేయించుకొంటారు తీరా ఓటు వేశాక వాళ్ల ముఖాల్నైనా చూడకుండా, ఒకవేళ ప్రజలే వెళ్లి దర్శించుకొన్నా మర్యాదగా రమ్మనైనా పిలవకుండా ఉండే రాక్షసుల యొక్క తమోగుణంతో కూడుకొన్నది ఈ రాజకీయం అట్టి స్థితిలో ఓటు ప్రాశస్త్యం గురించి ఏమని చెప్పడం ?

ఇందులో కష్టం అంతా చివరిమూడు శబ్దాల్లోను ఉంది అయితే నిందార్థ స్ఫోరకాలైన ఆ శబ్దాల్ని అవధాని ఛందోవ్యాకరణ గంగలో స్నానం చేయించి "తాము +ఇండు' రండు + అని' 'ఏమి +ఉండగ' అన్న విభజనలతో శుభ్రం చేసుకొని వారిచ్చిన భావాని కనుగుణంగా విశేషించి మలుచుకోవడం జరిగింది

2 డా॥ బి వి.యస్. మూర్తి , యమ్.ఎ.యమ్.ఫిల్.పి హెచ్.డి. – రాజమండ్రి

**తెలుగు దత్తపది**

ఆజీవ – భూజీవ – సజీవ – సంజీవ (రాజీవ గాంధీ సంస్మరణ)

పూరణము

కం॥ ఆ జీవనమే ధన్యము
భూజీవన మల్పమైన పొందెను కీర్తుల్
రాజీవుండు సజీవుడు
సాజముగా వెలుగు కీర్తి సంజీవమునై.

భావము ః రాజీవ గాంధీ జన్మధన్యమైంది ఆయుష్షు అల్పమే అయినా చక్కని కీర్తి పొంది ఎప్పటకీ లమరుడయ్యాడు అతని కీర్తి సంజీవ పర్వతంలా సహజంగా ప్రకాశిస్తుంది రాజీవుని కోసమే పుట్టిన శబ్ద సంజీవాల్లా లవధాని ఈ దత్తపదిని హాయిగా నిర్వహించారు

**3. అల్లూరి వేంకట నరసింహరాజు, ఎమ్.ఎ. ఎమ్.యిడి. పి.హెచ్‌డి.,–ప్రజాహిత – ఏలూరు**

తెలుగు దత్తపది

కాకి – చాకి – కాక – వీక (మత్త కోకిల వృత్తంలో)

పూరణము

మ॥ కాకిణమ్మునకై జనమ్ములు కాకలెత్తుచు వెఱ్ఱులై
చాకి చీకిగ కేక వేయుచు చాల గోలను చేసి శో
కాకరమ్ముగ జీవనమ్మగునయ్య! యేమిటి యన్నవీ
వీకపోయితి వంచు నెంతగ యేమి నిందలు వేతురో.

**భావముః** కాసులు కోసం జనాలంతా వెఱ్ఱిగా తపిస్తూ మిక్కిలి చవకబారుగా మాట్లాడుతూ ఎక్కువ గోలతో దుఃఖ నిలయంగా జీవనం సాగిస్తుండగ, అయ్యో! నీవు మంచి నీయలేకపోతివే! అని ఎట్టి నిందలు వేస్తారో! కదా

ఇక్కడ 'కాకిణం' అనే మాండలికం "డబ్బులు" అన్న అర్థంలో వాడబడింది ఇక్కడిచ్చిన పదాలన్నింటిని పృచ్ఛకుని కోరికపై వానికున్న ప్రసిద్ధార్థాల్లో వాడకుండా అవధాని మరో అర్థంలో వాడడమే కాక "కాక" శబ్దాన్ని వేర్వేరు అర్థాల్లో రెండు మార్లు ప్రయోగించడం కూడా విశేషం.

**4. డా. కె.ఆర్. సూర్యనారాయణ, ఎమ్.ఎ., పి.హెడి., సాహిత్య విద్యా ప్రవీణ, రావులపాలెం.**

**సంస్కృత దత్తపది**

హీరో - జీరో - న్యారో - రైరో. (సభాసంచాలకుని వర్ణించుట)

**పూరణము**

**శా॥** **హీరో దీర్ణ కవిత్వ లాలిత గళ శ్రీరష్టి పార్శ్వ స్థలే**
**వాజీరోహణ వల్గు చాలన కళా కేళీ వ కావ్యాధ్వగః**
**ధ్వన్యారోపిత నిత్య వాక్య విభవైర్ధన్యోభిగణ్యోవ్యయం**
**కంఠైరోమితి రామ నామకచమముం చింతన్నిత శంసని**

**భావము:** వజ్రంలా సానపెట్టబడిన కవిత్వంచే లాలింపబడిన కంఠస్వర శోభకల సభాసంచాలకుఁడు ప్రక్కనున్నాడు అంతేకాక అతడు అశ్వగమన నియమన కళాప్రవీణునిలా కావ్యమార్గవిజ్ఞుడు మఱియు నీతడెప్పుడూ వ్యంగ్య వైభవోపేత వచస్సంపదచే ధన్యుఁడై గణింపఁదగిన వాఁడు అట్టి రామనామంకల (రామబ్రహ్మము) సంచాలకుణ్ణి జనులంతా బహు కంఠాలతో స్మరిస్తూ శ్లాఘిస్తున్నారు

అన్యభాషా పదాల్ని అవలీలగా సంస్కృతంలోకి మలుచుకొని పూరించిన ఈ పద్యం అవధాని ప్రతిభకు ఒక నికషోపలం. రెండుఅక్షరాలు కల ఈ పదాల్లో మొదటి పదాన్ని (హీరో) అభంగంగానే ఉపయోగింపగలగడం ఒక విశేషమైతే మిగిలిన వాటిని ప్రసిద్ధ పద సంయోగంలో ఆ పదాలు అందుకోసమే పుట్టాయా? అన్నట్లుగా ఉపయోగించడం మరో విశేషం అవుతోంది ( వాజీ=గుఱ్ఱాన్ని, రోహణ = ఎక్కుట) పెంకి గుఱ్ఱాన్ని ఎక్కి కళ్ళాన్ని చేతబట్టి దాన్ని అదుపు చేయడం ఒక కళ. అట్టి కళే రామబ్రహ్మంగారి క్రీడ అట్టి ఆటవలె వారు కావ్యం అనే మార్గంలో పయనించే వారు అనిచెప్పడం చేత సంచాలకుల అనర్ఘరాఘవాది కావ్య వ్యాఖ్యానాలు వ్యక్తం అవుతున్నాయి. అంతేకాకుండ శతావధాన సభారథాన్ని సారస్వతాకాశంలో యథేచ్ఛగా విహరింపఁజేయడానికి జాతిగుఱ్ఱంగా రూపొందిన అవధానిని తన సంచాలకత్వ సారథ్యంతో అదుపుచేస్తూ సక్రమ మార్గంలో సంశ్లాఘ్యంగా నడిపిస్తున్న వారని కూడ అర్థం.

కంఠైః + ఓమ్ = కంఠై రోమ్. వారు చెప్పిన ప్రతి మాటని తప్పక అంగీకరింపవలసి యుంటుంది 'ఓం' అంటే ప్రణవమంత్రమేకాక అంగీకారాన్ని సూచించే మాటకూడ వారు (ధ్వని + ఆరోపిత) వ్యంగ్యంగా జనరంజకంగా మాట్లాడే వచోవైభవం కలవారు కాబట్టి దాన్ని అందరూ అంగీకరిస్తూ అనేక కంఠాలతో శ్రీరామ బ్రహ్మంగారిని సెభాష్ అంటూ శ్లాఘిస్తున్నారని భావం

**5. డా॥ డి.యస్.వి. సుబ్రహ్మణ్యం. ఎమ్.ఎ.పి.హెచ్‌డి – భాషాప్రవీణ రాజమండ్రి**

**తెలుగు దత్తపది**

జానకి – ఊర్మిళ – మాండవి – శ్రుతికీర్తి (శారదా – రామకృష్ణుల పవిత్ర దాంపత్యంగురించి)

**పూరణము**

**ఉ॥ జానకియై పతివ్రతగ జన్మల జన్మల బంధమోయనన్**
**ఆనత యూర్మిళా మహిళయై పతిమాటకు మౌన భావ్యయై**
**సొనుగ మాండవేయ గుణ సంహతి మండితయైన శారదా**
**శ్రీనుత రామకృష్ణముని జీవితమే శ్రుతకీర్తి యయ్యెడున్**

**భావము :–** శారదా దేవి రామకృష్ణ పరమ హంసపట్ల జానకివంటి పాతివ్రత్యంతో జన్మజన్మల బంధమా ! అన్నట్లుగా, ఊర్మిళ వలె విధేయురాలై భర్త మాటకుప్రతి మాట లేక, మాండవి వంటిసుగుణగుణాలతో ఒప్పుచుండగా శ్రీరామకృష్ణపరమహంస జీవితం యశోవంతం అగుగాక.

**6. యస్. ప్రభంజనస్వామి యమ్.ఎ. బి.కామ్.బియి.డి, తూరంగి**

**తెలుగు దత్తపది**

కాక – కాకా – కేక – కోక (ఆధునిక సాహిత్య విమర్శ)

**పూరణము**

**తే॥గీ॥ కాకవిశ్రేణి కవితలో కాకలెత్తె**
**గాక, కాకా కపుల్ నేడు గలరు చాల**

**వేయు ప్రతికేక గేయమై వెలయునంట**
**తెగువ నేమందు నే తలదించుకోక**

**భావము :–** కుకవులు తమకవిత్వం తో నేడు కాకలు తీరుతున్నారు. తమ పనికై కాకా పట్టే కవులు కూడా చాలామందే యున్నారు వారు వేసే ప్రతికేకా (పనికి మాలిన) ఒక గేయంలా వెలస్తుందిట వారి తెగువ తనం చూచి తల దించుకోక తప్పదు.

**7. యడవల్లి పూర్ణయ్య సిద్ధాన్తి, కాకినాడ.**

**తెలుగు దత్తపది**

దత్తపది – హత్తెమది – ఉత్తవడి – మత్తకరి (నవ్యకవితానిరసనం)

**పూరణము**

**తేII** **దత్తపది పూర్తి చేయగా ధాటిలేదు**
**హత్తెమది యిదియనరాదు నాధునికము**
**ఉత్త వడిసెలవేటయౌ, తత్తరపడు**
**మత్తకరివంటి ప్రాచ్య వాఙ్మయము చూచి**

**భావము :–** నేటి కవిత్వంలో దత్తపది పూర్తి చేయంగల్గే దాడి కనిపించదు ఈ భావం హృదయానికి హత్తుకొంది సుమా, అని నిర్దేశించి చెప్పలేం. మత్తేభం వంటి ప్రాచీన సారస్వతాన్ని చూచి కేవలం ఒడిసెల వేటలా (పిట్టల్ని త్రోలడానికి రాళ్ళు దూరంగా విసిరే ఒక త్రాడు నుపయోగించే వేట) తొట్రుపడుతూ ఉంటుంది.

**8. డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు యమ్.ఎ.పిహెచ్.డి. అష్టావధాని, నేత్రావధాని, అమలాపురం.**

**సంస్కృత దత్తపది**

శ్రీ నాగఫణి శర్మ (మహా భారత విరాటపర్వ కథ)

**పూరణము**

**శ్రీ పూర్ణదేశ ఇతి చేతసి చిన్తయిత్వా**
**వాగాది సైన్యపరివేష్టిత భీమకర్మా**
**వైరాట మేవ మభియాతి ఫణిధ్వజో సౌ**
**శర్మాఽస్తు పాండవ గణాయచ గోగణాయ**

**భావము :–** పాండవులున్న ప్రదేశం సంపత్ సమృద్ధంగా వుంటుంది. కనుక అట్టి సంపన్నమైన విరాట నగరంలో పాండవులుండియుంటారన్న భావనతో సర్పధ్వజుడై ఏనుగులు మున్నగు సైన్యంతో పరివేష్ఠితుడై భయదకృత్యుడగు ఈ సుయోధనుడు విరాటనగరం గూర్చి పయనిస్తున్నాడు పాండవులకూ, గోవులకూ సంతోషం కలుగుగాక

భరత వాక్య సంప్రదాయంలో శుభకామనని సూచించే ఈ పూరణం మనోహరం గా వుంది 'భీమ కర్మ' అన్న దుర్యోధనుని విశేషణం శర్మాకాంక్షకి నిమిత్తమై అంద గిస్తోంది

**9. శ్రీమతి డా॥ పి. సత్యజ్ఞానేశ్వరి. యమ్.ఎ.పిహెచ్.డి. కాకినాడ.**

**తెలుగు దత్తపది**

బెట్ – సెట్ – నెట్–పెట్ (భారతరాజకీయాల వర్ణన)

**పూరణము**

**ఉ॥ బెట్టును కట్టి చెప్పెదను బెట్టును చూపని వారు లేరహో**
**సెట్టుగ సిండికేటనుచు చిత్రపుభావికి విందుకేటులై**
**నెట్టుకు వచ్చు చుందురట నెట్టును వేయుచుముందుకాళ్ళకున్**
**పెట్టుగ రాజకీయులొక పెట్టున నుందరు నిత్య జీవికన్.**

**భావము :–** బెట్ = పందెము . బెట్టు = గౌరవము, 2 పద్ధతి 3 అతిశయము 4. గొప్ప ప్రకటించుకొనుట.

రాజకీయాల్లో గొప్ప చూపెట్టని వారంటు ఎవ్వరూ ఉండరన్న విషయాన్ని పందెం కట్టి చెబుతాను అది అధికారుల సభాసంఘం అంటూ పై అధికారులు అంగీకరంపలేదంటూ విచిత్రమైన భవిష్యత్తు సూచించే వారై ముందరికాళ్ళకు బంధం వేస్తూ కాలంగడిపేస్తూ వస్తారు తప్ప ప్రజల కుపకరించరు ఈవిధంగా రాజకీయ జీవనం కలవారు ఒక మంచి మార్గంలో ఉండరు

ఇందు అవధాని తనకిచ్చిన పదాల్ని రెండుసార్లు అవృత్తి చేసి ఒకసారి ఆంగ్ల భాషా పదంగానూ, ఒకసారి ఆంధ్ర భాషా పదం గానూ పూరించడం విశేషం. ముందరి కాళ్ళకు బంధమనే అర్థంలో 'నెట్టును' ప్రయోగించడం చక్కని చమత్కృతి.

**10. మంగళంపల్లి రామనరసింహమూర్తి, కవి. వాస్తు జ్యోతిష శాస్త్రజ్ఞులు, అమలాపురం**

**తెలుగు దత్తపది**

భ్రష్టుఁడు – దుష్టుఁడు –శిష్టుఁడు– కష్టుఁడు (ధర్మదూరుడైన కుమారుణ్ణి చూచి బాధపడే తండ్రి వ్యధ)

**పూరణము**

**ఉ॥** భ్రష్టుడు ధర్మమార్గమున బాపురె ! వీడటులంతెగాదు ధీ
దుష్టుడు శశ్వదాచరిత దుర్మ్యృతి సర్వవిదష్టు డింకతాన్
శిష్టుడనంగ నెప్పటికి చేరువ యౌనొ కృతాపరాధమా
కష్టుడు కాని వాడు కలకాలము పుచ్చునొ మార్పు రాదొకో!

**భావము :–** అయ్యో ! వీఁడు న్యాయమార్గంలోంచి చ్యుతుడయ్యాడు అంతేకాక నిత్యమూ పాపకృత్యాలతో దుష్టబుద్ధి కలవాడయ్యాడు మంచివాడుగా ఎప్పటికి మారతాడో తెలియదు ఇదంతా మేం చేసుకొన్న అపరాధం ఎప్పటకీ ఇలాగే కాకుండా వానిలో మార్పురాదా ? అని ఒక తండ్రి ఆవేదన

**11. పి.బి.యస్. అప్పలాచార్యులు , కాకినాడ**

**తెలుగు దత్తపది**

భామిని – యామిని – కామిని – స్వామిని (ప్రకృతి వర్ణన)

**పూరణము**

**ఉ॥** భామినియై చరించి దిన బాంధవుని న్విడనాడె సంధ్య యా
యామిని యంతలో నడుమ నడ్డము వచ్చెను చీకటయ్యెనా
గామిని గాంచలేని యొక కామిని దుందుడుకుం దనమ్ముగా
స్వామినిగా వదస్థితిని చక్కగొనంగను వార్తయయ్యెడున్

**భావము :–** సంధ్యాదేవి కోపంతో సూర్యునికి దూరం అయింది. ఆ కోపం పోయేటంతలో వారిరువురికి మధ్య అడ్డంగా చీకటి వ్యాపించింది ఆ వియోగ బాధ భావిని ఊహింపలేని తన తొందర పాటుకు దుఃఖిస్తూ సంధ్య తాను మరల

తనస్వామితో యధాస్థితిని పొందడానికి నిరీక్షిస్తోంది సహజసిద్ధమైన ప్రకృతిని కవి తన చక్కని భావనాబలంతో నాయికా నాయకుల విరహ కాలంగా చిత్రించడం మనోజ్ఞం కలహాంతరితగా సంధ్య ఇందు చక్కగా చిత్రీకరింపబడింది దత్తపది పదాలు సామాన్యాలే అయినా పై విశిష్ట కల్పనతో వానికమూల్యత సిద్ధించింది

**12. ఆదిరాజు సత్యనారాయణ మూర్తిభాషా-ప్రవీణ – నరేంద్ర పురం**

**తెలుగు దత్తపది**

డైమను – కళావరు – ఇసిపేటు – అరకు (భారతార్ధంలో)

**పూరణము**

**చం॥ అరసి యధర్మ మార్గ చరుడై మనుధర్మమువీడ శ్రీ కళా**
**వరుడగు ధర్మరాజు నటు-వంచన గెల్చెను జూదమందుధీ**
**వరులిసిపేటు లెత్తి భగవన్ ఇటు శాంతము పాపమోయనన్**
**అరకుటిలంపు చేతలకు నంతము లేదయ కౌరవాకృతిన్**

**భావము :–** దుర్యోధనుడు అధర్మమార్గంలో నడచినవాడై శ్రీయుతుఁడగు ధర్మరాజును వంచన చేసి జూదంలో ఓడించడం జరిగింది బుద్ధిమంతులు దాన్ని గర్హిస్తూ "ఓభగవంతుడా! ధర్మరాజుయొక్క శాంతమే పాపమా! అన్నట్లు ఈకౌరవుల నీచపుపనులకు అంతం లేదా అని వాపోవడం జరిగింది.

పేకముక్కల ప్రక్కలను చక్కగా విరిచి విరిచి మిక్కిలి సులువుగా సాధించిన ఈ పూరణం అమోఘం

**13. కందుకూరి రామకృష్ణ సూర్యనారాయణ – యమ్.ఎ.,అవధాని శేఖర, భాషాప్రవీణ , చీపురుపల్లి.**

**సంస్కృత దత్తపది**

ప్రాక్కారం – శార్జ్గధన్వా – సుధర్మా ( శ్రీరామ ప్రశంస)

**పూరణము**

**ప్రాక్కారం ఘోషయిత్వా త్రిభువన భయదాం జ్యాంచ సంగృహ్య చాపం**
**సైషా హ్యేషా సుధర్మా భవతి చ విరాం తత్ర చైంద్రీ విభాతి**

**కోదండస్యైవ భేదే స్ఫురతిచ తదయం శార్ఙధన్వా పురేతి**
**సీతాకళ్యాణరీతిః ప్రభవతు భవతా మిత్థమానంద మూలా ॥**

**భావము:** దేవసభయైన సుధర్మవలె ఇంద్ర భోగంతో భావిస్తున్న సీతాస్వయంవర సభలో శ్రీరాముడు ముల్లోక భయంకరమైన శివధనుస్సును ఎత్తి, నారిని లాగి మొదట ధనుష్టంకారము చేసి భేదింపగా ఆ సమయంలో అతడు పూర్వంలో శార్ఙాన్ని ధరించిన విష్ణువుగా స్ఫురించడం జరిగింది అట్టి సీతాకళ్యాణ ఘట్టం మీ కానంద మూలమగు గాక

**14. నేతి సూర్యనారాయణమూర్తి . యమ్.ఎ. – ఏలూరు**

**తెలుగు దత్తపది**

ఓంకారము – ఐంకారము – హ్రీంకారము – శ్రీంకారము (సభా సరస్వతీ వర్ణన)

**శా॥ ఓంకార స్థిరవర్ణరూపిణీ! కవీశోత్సాహ సంధాయినీ**
**ఐంకార స్ఫురదర్ణవేషిణీ! సుధావ్యాపార సంభాషిణీ**
**హ్రీంకార స్వరతారహారతరళా! హిందోళరాగప్రియా!**
**శ్రీంకారాంశుక కింశుకాంత రుచిరా! శ్రీ శారదా! సన్నుతుల్.!**

**భావము:**–ఓంకారమువలె స్థిరమైన ఆకృతి కలిగినట్టియు, కవీశ్వరులకు ప్రోత్సాహము నిచ్చునట్టియు, ఐంకారమువలె ప్రకాశమానమైన వర్ణమును ధరించి నట్టియు, మధుమయభాషిణియు, హ్రీంకారస్వరం అనెడి ముత్యాల హారంలో నాయకమణియు శిశిర వసంతాల మధ్యలో పాడు హిందోళరాగమనిన ఇష్టము కలదియు శ్రీంకారమే పయ్యెదగా కలదియు మోదుగ పుష్పముల వలె మనోజ్ఞమైనట్టియు అగు ఓ సరస్వతీ! నీకునమస్కారములు."

శ్రీవిద్యా సంప్రదాయములో రహస్యార్థనిష్ఠాలైన మహామంత్ర బీజాల్ని దత్త పదులుగా స్వీకరించి అవధాని రమ్యమైనట్టి, సంప్రదాయావిరుద్ధమైన భావనతో పూరించడం రమణీయం అయింది.

**15. కొంపెల్ల వెంకటరామశాస్త్రి – యమ్.ఎ. కొవ్వూరు.**

**తెలుగు దత్తపది**

మైకు –రేకు –జోకు – చాకు (వేసవి కాలపు వర్ణన)

**పూరణము**

**తే॥గీ॥** **వర్షమైకురిసె చెమట హర్షమడగ**
**లెమ్ము రే కుమతి నిల్వలేము మేము**
**నీవు రాజో కులుకులతో తీవినుండ**
**చాకువలె గ్రుచ్చి యీయెండ చంపు చుండె.**

**భావము :–** ఓ దుర్బుద్ధీ ! మేము ఎండలో నిలబడలేము చెమట వర్షంలా కురుస్తూ సంతోషాన్ని హరించింది. ఎండచాకువలె శరీరాన్ని గ్రుచ్చుతూ హింస పెడుతోంది నీవు రాజువా ఏమి? తీవిగా సదుపాయాలతో కులకడానికి? ఇకలేచి నీడకురా. అని మిత్రులు – తన మిత్రునితో పలికిన పలుకులుగా అన్వయము ఇందులో మైకు –రేకు–జోకు శబ్దాల్ని కవి ప్రతిభావంతంగా విడదీసి పూరించడం హర్షింప దగిన విషయం

**16. శ్రీమతి డా॥ వాసా ప్రభావతి యమ్.ఎ. పిహెచ్.డి. సాహిత్య శ్రీ. సాహితీ సరస్వతి, హైదరాబాదు.**

**తెలుగు దత్తపది**

కొండలు – బండలు – మండలు – కండలు (అసెంబ్లీ లో గందరగోళం)

**పూరణము**

**మ॥** **అరెరే కొండలు మ్రింగె నీడనుచు దివ్యత్క్రోధుడై ఒక్కరుం**
**డరెరే బండలు నీని జీవితము హేయంబంచు వేరొక్కరుం**
**డరె మే మండలు మీకు నుంటిమనుచున్ హో కొందరీ రీతిగా**
**తిరమై కండలు చూపి శాసన సభన్ దీపించిరారీతిగా**

**భావము :** నీడుకొండలు సహితం మ్రింగాడని ఒకనేత కోపించి మాట్లాడగాఁ నీని జీవితం శిలామయమై హేయమైందని మరొకరూ, ఓ నాయకా ! మీకు మేము కొండంత అండగా ఉంటామని మరికొందరు మాట్లాడుతూ తమ తమ బలాల్ని ప్రదర్శిస్తూ రాజ్యాంగనేతలు దీపించినారు. ఇక్కడ కొండలు శబ్దాన్ని అవధాని ధనరాశులకు ప్రతీకగాను, బండలు శబ్దాన్ని – జనసామాన్యపు ఆర్తనాదం వినని పాషాణ హృదయాలకి పర్యాయంగాను వాడు కోవడం విశేషం.

**17. శిష్టి సూర్యనారాయణమూర్తి బి.ఎ. యమ్.ఓ.యల్. కావ్యాలంకారచూడామణి పరిశోధకులు, అమలాపురం**

**తెలుగు దత్తపది**

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు (భారతార్థంగా)

**పూరణము**

**మ॥ అరెరే అగ్రజుడడ్డు రానియెడ రామా మేము క్రోధాగ్నితో**
**బొరితాలక్ష్మణరేఖ యై నిలబడెన్ బోరన్నమాటెత్తడే**
**నరసంఘావృతమైన యీ భరత ఖండంబెల్లనొక్కుమ్మడిన్**
**దురమన్ వార్ధిని ముంచనే భయద శత్రుఘ్నుండనై ద్రౌపదీ**

బావము :– ఓ ద్రౌపదీ ! మా అన్నగారు ధర్మరాజు కనుక అడ్డు పడకపోయినచో మేము కౌరవులపై కోపాగ్ని తో విజృంభించెడివారము. అతడు మాకు హద్దును సూచించు లక్ష్మణ రేఖై నిలబడి యుద్ధమనే మాట సహితము పలుకడాయెను. భరత ఖండమంతయు ఎదురైనప్పటికి వారిని యుద్ధమనే సముద్రంలో ముంచి భయంకరమైన శత్రుసంహారకుడనయ్యేదను. అని భీముడు ద్రౌపదితో పలికినట్లు అన్వయము.

రామాయణపరమైన ఈ శబ్దాల్ని అవధాని భారతార్థంలో అక్రమంగా ప్రయోగించి సుందరమైన భావంతో పూరించడం విశేషం ఇట్టి వాగౌద్ధత్యం అర్జునునికి కాక భీమునకే ఉంటుందన్నది స్పష్టము.

**18. ముక్కవిల్లి సత్యనారాయణ శర్మ యమ్.ఎ. మోడేకుర్రు.**

**సంస్కృత దత్తపది**

కేశాలు – దంతాలు – నఖాలు – గజాలు (అవధాన సభావర్ణనం)

**పూరణం**

**కేశాలుశ్చన మార్మిక : కవయతాం క్లేశంకరాణాం సదా**
**దంతాలుంతిన కార్మికశ్చ నితరాం శ్రీ వావదూకత్విషాం**
**నూనం సంతి నఖాలులాయ సదృశా హంతుంక్షణాత్ సర్వతః**
**ఏతేమత్తగజాలులాయమహిష ప్రాయేష్వరణ్యేవయం**

భావము :- తలపై వెంట్రుకల్ని సహితం లాగివేసే నేర్పుగలవారు ఎల్లప్పుడూ కష్టకారకులయిన వారూ, యుక్తి యుక్తమైన మాటలతో దంతాల్ని ఊడబెరికే పనివారూ, పట్టింపబడెదరుగాక, క్షణకాలంలోనే నఖాలతో ముంచెత్తి చంపగలవారూ (సింహంవంటి వారు) ఇక్కడంతా ఉండి ఉన్నారు అరణ్యం వంటి ఈ ప్రదేశంలో మనముంటా మాదపుపాటులు, ఎనుబోతుల వంటి వారము అని అవధాన సభ వర్ణింపబడినది

ఇది మిక్కిలి కష్టాన్ని వేకూర్చే పదాలు చివర బహువచన ప్రత్యయం లు వర్ణంలేకపోతే కొంత సులభం అయ్యేది శ్లిష్టత కంతకి కారణమైన ఆ తెలుగు వర్ణకాన్ని ఎపదార్థం వేయకుండా నేర్పుగా లువర్ణమాదిగా కలలుపదాలకి ఆజ్ ఉపసర్గ చేర్చుకొని సగాంశమ అందంగా సమకూర్చడం అభినంద్యం అవుతోంది

19. పలకమర్రి సుబ్రహ్మణ్య శర్మ [illegible]

తెలుగు దత్తపది

వేడి - వాడి - మాడి - పాడి (గ్రీష్మర్తువర్ణన)

పూరణము

తే: వేడి తగ్గదు ఎవరెంత వేడుకొనిన
వాడిపోవని యెండల వాడి మిగుల
మాడిపోవక దుముమాడి మనము దాని
పాడి నిల్పుమె తపన రాపాడి వీడ

భావము :- నీ వెంతబ్రతిమాలినా ఈ వేసవికాలం వేడి తగ్గడం కష్టం అస్సలు తగ్గుముఖంలేని ఎండల పదును అతిశయంచేలా మనం కూడా దాని బారిన పడి మాడి పోకుండా ఖండించి దాని తపన శీలాన్ని గాల్చివీడకొట్టి పాడినిల్పుమా ! అని గ్రీష్మతాపానికి లొంగి పోకుండా నిలబడ్డానికి చెప్పే మిత్రుని ఉత్సాహ వచనాలుగా దీని అన్వయం

**20. యస్.టి.కె. జనార్దన స్వామి యమ్.ఎ. తాటిపాక**

**తెలుగు దత్తపది**

**లేపు - మాపు - పాపు - మోపు (భీమ కీచక వధ)**

**పూరణము**

**లేపురంధ్రి చంపెదను లేలెమ్మువావి**
**మాపు రేపులు పాపేరె మననోపేయ**

బాపు గొను వాడు పాపమ్మునంది
భరము నాపైన మోపుమీ పంచదార

**భావము :–** ఓ ద్రౌపదీ ! ఆకీచకుడు మరణించిన పిమ్మట కూడ రాత్రింబవళ్లు నా పేరే జపించునట్లు వానిని చంపెదనులెమ్ము వాడు పాపము యొక్క ఫలితమును పొంది ఆ విధముగా పోగొట్టుకొనును. భారము నాపై వేసి నిశ్చింతగానుండుము అని భీముడు పలికిన పలుకులు.

**21. డా॥పి.వి. మురళీకృష్ణ యమ్.ఎ.పిహెచ్.డి.ఎమ్,ఇడి, రాజమండ్రి**

**తెలుగు దత్తపది**

జ్ఞానము – గానము – మౌనము – పానము (రాధామాధవ ప్రణయం)

**పూరణము**

**ఉ॥** **జ్ఞానమె మోక్షసాధనకు జక్కని దంట నిజమ్ముకాదు. నీ**
**గానము కూడ తద్విధి వికల్పన జేయక యుక్త మౌనులే**
**మౌనము బూను మౌనులకు మాన్యతతో పశుపక్షి జాతికిన్**
**పానమునైన గానమున భద్రము గల్గును రాధికాధవా .**

**భావము :–** ఓ రాధికా ప్రియా ! జ్ఞానమే మోక్షమును సాధించుటకు చక్కని మార్గమనుట సత్యము కాదు నీ వేణు గానము కూడ సాధనమై పై మార్గమును వికల్పము చేయ సమర్థమైనది. మునివరులకుపశుపక్ష్యాదులకు కూడ ఆస్వాదయోగ్యమైన నీ గానము చేత మంగళము కల్గును.

సంగీతం కూడా మోక్షసాధకమనే విషయ ప్రతిపాదన కల ఈ పూరణం రమ్యంగా ఉంది.

**22. డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రి యమ్.ఎ. పిహెచ్.డి.వ్యాకరణసాహిత్య, విద్యా వాచస్పతి, అవధాన విద్యావాచస్పతి, అవధాని శేఖర – తణుకు**

**సంస్కృత దత్తపది**

"మండపేట పోదాం వస్తావా చిలకా (అమ్మ వారి ప్రార్థన)

**పూరణము**

**తపోదాంతే భక్తే కురుగురు దయాంతత్ హృదయమం**
**డపేటత్వం నిత్యం భగవతి ! శివానందలహరి**
**శివస్తావానేవత్వయిగత మహాశక్తి విభవః**
**వయం కేవాస్తోతుం శుభరుచిలకారార్థ విభవేం**

**భావము :–** శివునికి ఆనందలహరివగు ఓ భగవతీ ! తపఃక్లేశాన్ని ఓర్చుకొనగల భక్తుని హృదయ మండపంలో దయతో నివసింపుము. శివుడంతటి వాడే నీవలన మహాశక్తి మంతుడు కాగా మంగళప్రద దీప్తితో 'లం' బీజ మహార్థ వై భవంకల నిన్ను పొగడుటకు మేమెంత వారము ,

మొత్తం ఈ శతావధానానికే ఇదిమిక్కిలి కష్టమైన దత్తపది ఇటు అర్థపరంగా అటు శబ్దపరంగా కూడా ఇది అవధానికి విషమఘట్టం లౌకికంగా అన్యార్థస్ఫూర్తికల సామాన్య వాక్యరూప పదకదంబాన్ని అమ్మవారి కన్వయంగా పూర్తి చేయడం సామాన్యం కాదు. అంతేకాకుండా దీన్ని శిఖరిణి వృత్తంలో పూర్తి చెయ్యమనడం క్లిష్టమైన సమస్య. య,మ,న,స,భ,వ అను వరుసగణాలతో సిద్ధించే ఈ వృత్తంలో ఏ పాదంలోను కూడ "మండపేట" శబ్దం అమరదు ఎందుకంటే గురువు లఘువు, గురువు వరుసగా ఉండడం ఈ ఛందః పాదానికి విరుద్ధం కాబట్టి పూర్వ పాదాంత్యంలో గురువువచ్చేలా "మం" అక్షరాన్ని రెండవ పాదం ఆదిలో మిగిలినభాగాన్ని వేసుకోవాల్సి వచ్చింది నిజానికి సంస్కృతచ్ఛంద స్సంప్రదాయం పాదాంత యతుల్ని కలిగి ఏ పాదానికాపాదం విరిగి వుండాలి ఆ పద్ధతిలో పై పూరణం విరుద్ధమైనా అక్కడ తప్ప ఆ శబ్దాన్ని వేసుకొనే తావు లేకపోవడంతో అదే పృచ్ఛకుని ఇష్టంగా గుర్తించి పూరింపవలసి వచ్చింది అట్లున్నా ఒకే మార్గాన్ని సహితం శతవిషయ మధిత మేధకల అవధాని గుర్తించి పూరించడం ప్రతిభాపాటవాలకి నిదర్శనం. అట్లే పోదాం "వస్తావా" అను పదాలు కూడ మండపేటంత కష్టం కాకపోయినా సులభాలు మాత్రం కావు. అవి రెండూ తెలుగుపదాలవడమే కాకుండా శుద్ధ వ్యావహారికాలూ, గ్రామ్యాలు కూడ ఛందః కష్టం లేకపోయినా వానిని సంస్కృతీకరించడానికి ఆ శివుడు దిగిరావలసిందే. వాటిని ఏదో అతుకుల బొంతుకులుగా గాక ప్రసిద్ధ పద సంవిధానంతో అత్యుత్తమ భావంతో పూరించిన ఘనత అవధానికి దక్కింది. శ్లోకం చక్కని అన్వయంతో పూరణకి మరింత వన్నె తెచ్చింది.

**23. యమ్. పాండు రంగారావు యమ్.ఎ. యల్.యల్.బి., కాకినాడ.**

**తెలుగు దత్తపది**

శర్మ – వర్మ – మర్మ – ధర్మ (సత్యదేవుని వర్ణన)

**పూరణము**

**ఉ॥ శర్మదమీ పదార్చనము సౌఖ్యదమౌ భవదీయ సేవయున్**
**వర్మవు నీవు మీనముల వైఖరి చూచిన సంశయంబునౌ**

మర్మము తెల్పుమా! శ్రుతి రమారమణీయ విహారహార శ్రీ
ధర్మ రసావతార శతధానుతి నీకిదె "సత్యదేవరా".

**భావము :**– ఓ సత్యదేవా! నీ పాదాల్ని అర్చించడం శుభప్రదం నిన్ను సేవించడం సుఖప్రదం నీవు రక్షణ కవచానివి నీకు మీసాలుండడం మాత్రం సంశయం కలిగిస్తుంది అందలి రహస్యం ఏమిటో నువ్వే చెప్పాలి వేదలక్ష్మి చేత మనోహరమైన విహరణ శోభకల ధర్మావతారమైన నీకు వంద నమస్కారాలు

**24. డా॥ మేడూరి లక్ష్మనారాయణ యమ్.ఎ.పిహెచ్.డి., పెద్దాపురం**

**తెలుగు దత్తపది**

పారణ – పూరణ – వారణ – ధారణ (అవధాన కృత్యాన్ని వర్ణించుట)

**పూరణము**

**కం॥ అడుగుట యనగా పారణ**
**పొడిపలుకులు లేక చెప్పపూరణయే, నా**
**నుడుగులవారణ గమనము**
**బడిసాగదె ధారణంబుపటు కలిమినదా.**

**భావము :**– పృచ్ఛకులు ప్రశ్నలడగడం పారణ (ఉపవాసముండి మరునాడు చేయు భోజనం) అవధాని పొడి పొడి మాటలు లేక పూరించడం పూరణం (చక్కని) అవుతుంది. నా పదాల గజగమనం చేత ఎప్పుడూ చక్కని ధారణ సిద్ధిస్తుంది అని అవధాని తనపరంగాపూర్తి చేశారు. ఉపవాసం ఉండి మర్నాడు చేసే భోజనం ఎలారుచి కరంగా ఉంటుందో అలాగే బాగా ఆలోచించి వేసిన ప్రశ్నలు రమ్యంగా ఉంటాయన్నది భావం.

**25. పురాణపండ సత్యనారాయణ మూర్తి యమ్.ఎ. జగ్గంపేట**

**తెలుగు దత్తపది**

ఆట – పాట – బాట – మాట (వేంకటేశ్వరస్తుతి)

**పూరణము**

**మ॥ ఆటలాడగలేను నీ కొఱకామయూరము పోలికన్**
**పాటపాడగలేను కోకిల పాటిగా శ్రుతి పక్వతన్**
**బాట వెంబడి సాగి వచ్చెద పన్నగాచలమందిరా**
**మాట విల్పుము కోర్కె దీర్పుము మారమారసబంధురా**

**భావము :-** ఓ శ్రీనివాసా ! నెమలివలె నీ కొరకు నేను నాట్యం చేయలేను. కోకిల వలె శ్రుతి రమ్యంగా నీనామం గానం చేయలేను ఓ శేషాద్రివాసా ! నీవద్దకు కాలి బాట నంటి పోగి వచ్చెదను నా కోరిక తీర్చి మాటనిలబెట్టుము

**26. డా॥ సి. కమలా అనార్కాలి యమ్.ఎ. పిహెచ్.డి. కాకినాడ**

తెలుగు దత్తపది

గంగా - భంగా - రంగా - తుంగా

(పిఠాపురం రాజా శ్రీ రావు వెంకట మహీపతి గంగాధర రామారావు బహాదుర్ వారికి, శ్రీ పైండారామకృష్ణయ్యగారికి గల మైత్రిని వర్ణించుట)

పూరణము

**కం ॥** **గంగాధర రాముండే**
**భంగములేకుండ వెలిగె పైండా తోడన్**
**రంగ ద్వదాన్య మహిమో**
**త్తుంగ ప్రభ దిశల విరియ తోరపు మైత్రిన్**

**భావము :-** పిఠాపుర ప్రభువులైన రాజా శ్రీ వేంకట మహీపతి గంగాధర రామారావు గారు ఎట్టి ఎడబాటులూ లేక పైండా వంశంతో పొత్తు కలిసి ప్రకాశించారు. ప్రసిద్ధమైన దాన గుణం యొక్క మహిమౌన్నత్యపు కాంతులు దిక్కుల్ని ప్రసరించినట్లు బలమైన మైత్రిని కలిగి యున్నారు

సారాంశముల రచయిత

**శ్రీ ధూళిపాళ మహాదేవమణి యమ్.ఎ**

విద్యాప్రవీణ - భాషాప్రవీణ

లెక్చరర్

**పి.యస్.యమ్. సంస్కృత కళాశాల కాకినాడ.**

❄ ❄ ❄

# వర్ణన

అంతా కవులము కామా? కందపద్యమల్లగలేమా? యన్నట్లు పద్యమల్లే ప్రతివాడు కవి కాలేడు ఒక అనిర్వచనీయమైన చమత్కారమును పుట్టించే భావము, తదాలంబనమైన వర్ణ్యము తదను గుణమైన రసస్ఫూర్తి జనకమైన పదాను గుణ్య విశ్రాంతి తోకూడిన శయ్యాప్రకల్పనము ఇవన్నీరసవత్కవిత్వానికి మూలకారణాలై ప్రతిభావంతుడైన కవికి అహమిహమికతో సహజంగా సిద్ధిస్తాయి అలాంటి వానికి ఆశుకవితా సిద్ధికలుగు తుంది వానిగళము నుండి వెలువడిన కవిత్వము సర్వమూ రామణీయకతను సంతరించుకొంటుంది సహజ సుందరము కావచ్చు స్వభావనీరసము కావచ్చు జుగుప్సితము కావచ్చు ఏదైనా కవి హృదయనిర్గతమైతే అంతామధురంగానే భాసిస్తుంది ఇలాకవి హృదయం పరుసవేదియై కవితాసృష్టి సర్వమూ స్వర్ణమయము అవుతుంది అలాంటి లోకోత్తర వర్ణనా నైపుణ్యం కలవాడే కవి 1 వాడే అవధానం చెయ్యడానికర్హుడు

విషయం ఒక్కటే అయినా మహాకవి ముఖవినిర్గతమైతే అది సత్కావ్య కోటిలోచేరుతుంది ఉదాహరణకు ఎండాకాలంలో ఓ మోడువారిన చెట్టునువర్ణించాలనుకొందాం ఏ నాబోటిగాడో అయితే పద్యం చెప్పాలనేతపనతో "శుష్కోవృక్షస్తిష్ఠత్యగ్రే" అగ్రే అంటే ఎదురుగా శుష్క వృక్షము "తిష్ఠతి" నిలచియుంది అని చెపుతాడు సంస్కృతాంధ్రాలలో నిష్ణాతులైన మన నాగఫణిశర్మ గారి లాంటి వాళ్లే మనకా విషయాన్ని చెప్పేటట్టయితే "నీరసతరురిహ విలసతి పురతః "పురతః ఎదురుగా నీరసతరుః ఎండిపోయిమ్రానై పోయిన చెట్టు విలసతి ప్రకాశిస్తోంది వర్ణన – విషయం – అర్థం ఒక్కటే అయినా భావుకతలో, శిల్పంలో తేడా కనిపిస్తుంది పై దాంట్లో శైలి ఓజోగుణ భూయిష్ఠంగా అంటే పరుషములైన పదాలతోనే ఒత్తక్షరాలతో ఉండి ఈ శైలియే యుద్ధానికి వెళ్లేటప్పుడు ప్రయోగింపవలసినది రెండో వర్ణనలో పదాల్లోనే

---

లోకోత్తర వర్ణనా నిపుణః కవిః

నీరసత్వం,నీరవత్వం, కనిపిస్తుంది భావుక హృదయంలో మెఱసి అతణ్ణి మురిపిస్తుంది. స్థూలంగా ఇదీ లోకోత్తరవర్ణనావైపుణ్యం అంటే

## శతావధానంలో వర్ణన

ప్రస్తుతశతావధానంలో ప్రతీ అయిదవ వ్యక్తి సంస్కృతంలో వర్ణనను సమర్పిస్తారు. ఈ వర్ణనలో ప్రతి పృచ్ఛకుడు తనయిష్టాను సారంగా ఒక విషయాన్ని అవధానికి అందించి తాను కోరినవృత్తంలో దాన్ని చెప్ప మంటాడు

సహృదయుడైన ఒక్కొక్క పృచ్ఛకుడు వృత్తాన్ని చెప్పే స్వేచ్ఛను- అవధానికి వదలి వేస్తూ ఛందము స్వచ్ఛందము అంటాడు ఇదీ వర్ణన స్వరూపం.

ఇందులో కూడా సాధక బాధకములు లేకపోలేదు ఒక్కొక్కప్పుడు ఒకపృచ్ఛకుడు ఏ కురుపాండవ సంగ్రామాన్నో చిన్న ఆట వెలదిలోనో, తేటగీతిలోనో చెప్పమంటే అది అవధానికి పచ్చివెలక్కాయ అవుతుంది మింగుడుపడడం కష్టం ఇది బృహద్విషయాన్ని అల్ప పద్యం లో చెప్పమనడం తద్విపరీతంగా వేఱొకడు ఏధూళిరేణువునో ఓ సీస పద్యంలో చెప్పమనవచ్చు వెనుకటి కొకమహానుభావుడు తిరుపతి వేంకటకవులను ఒక శతావధానంలో దోమ కాలును మహాస్రగ్ధరావృత్తములో వర్ణించమన్నాడట ఇలాగే కొప్పరపుకవులొక చీపురుకట్టపై సీసాన్ని చెప్పేరట.

వేఱొక అవధానంలో నల్లసిరాచుక్కపైనొక సీసాన్ని చెప్పమన్నారట. ఈ విధంగా నే దశావతారాలను ఒక కందంలో అందంగా చెప్పమని, కేవలం జాను తెనుగులోనే వృత్తాలను చెప్పమని, ఎన్నివిధాలుగానైనా అవధానిని పరీక్షించవచ్చు. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ కదా!

ప్రస్తుతావధానంలో ఏవం విధవర్ణనమును 22మంది నిర్వహించియున్నారు. వానిలో సంస్కృతవర్ణనమును సంస్కృతములో 4మంది తెలుగున18మంది నిర్వహించియున్నారు

---

# శతావధాన వర్ణన పద్యములు—వాటి సారాంశములు

## శ్రీ నేమాని శ్రీరామసిద్ధాంతి, విద్యావాచస్పతి – వాస్తురత్న – బ్రహ్మరథారూఢ– గజారోహణ సమ్మానిత – కాకినాడ.

తెలుగు వర్ణనాంశం

వెంకట్రామన్, శంకరదయాళ్ శర్మ, పి వి నరసింహారావు, జనార్దనరెడ్డి పాలనగురించి

వర్ణనము.

**కం॥ వేంకట రమణుని కృపతో**
**సంకటములు పరిహరించు శంకరు దయతో**
**వింకన్ జనార్దనుడు గన**
**వంకలు లేనట్టి పీ.వి. పాలన నలుపున్**

సారాంశము.

శ్రీ తిరుమల వేంకట రమణుని దయతోడను, కష్టములు తొలిగించు నట్టి శంకరుని యొక్క దయతోడను విష్ణుమూర్తి దయతో చూచు చుండగ ఎటువంటిలోటు పాట్లులేని శ్రీ పి వి నరసింహారావు పరిపాలన చేయు చున్నాడు

ఈ పద్యంలో వేంకటరమణుడు అనుపదము రాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకట్రామన్ గారిని, శంకరు, దయ అనుపదములు ఉపరాష్ట్రపతి శ్రీ శంకరదయాళ్ శర్మ గారిని, జనార్దనుడు అనుపదము రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డి గారిని సూచించుచు ప్రధాని శ్రీ పీ.వి. నరసింహారావుగారి పరిపాలను తెలియ జేయు చున్నది.

## 2. శ్రీ సామవేదం జానకి రామశాస్త్రి ఎమ్.ఎ. (జానకీజాని) కాకినాడ.

తెలుగు వర్ణనాంశము

మంచినిద్రలో ఉండగా ఉన్నట్టుండి విద్యుచ్ఛక్తి సరఫరా నిలచిపోతుంది చెమటతో శరీరంతడిసి చిరాకు కలుగుతుంది ఎ.సి. గదుల్లో వాళ్లకి మరింత బాధకలుగుతుంది. విద్యుచ్ఛక్తి శాఖోద్యోగులపై ప్రజలక్రోధాగ్ని శార్దూలమై దూకుతుంది ఈ పరిస్థితిని వర్ణించండి

వర్ణనము.

శా॥ ఔ రా రాత్రులు ప్రొద్దులంచనక తామంధీభవత్ప్రక్రియన్
తోరంబై చను వెల్గు రేకులకళల్ దూరంబు గా జేతురా
తీరుల్ తెన్నులులేని యీనడతతో తీరుంగదాస్వచ్ఛతల్ యీ
ధారాపూర్ణ శతావధానము పయిన్ దర్పంబు జూపింతురా !

సారాంశము

రాత్రి, పగలు అనే భేదంలేకుండగ తాము గ్రుడ్డి వారివలె (ఆలోచన లేనివారై) గొప్పగా వెయిగు చున్న విద్యుల్ కాంతులను పోగొట్టు చున్నారా? ఔరా! దారీతెన్నూలేని ఈ విధమైన ప్రవర్తనలో స్వచ్ఛతలు నశించుచున్నవి గదా! ధారతో పరిపూర్ణమైన ఈ శతావధానము మీద కూడ మీ గర్వమును చూపించు చున్నారా?

తరచుగ కరెంటు కోతవల్ల ప్రజలకు కలుగు చున్న చికాకులను శార్దూలవృత్తంలో విద్యుచ్ఛక్తి వారికి తెలియ జేస్తూ, ఈ ద్వేషాన్ని మా శతావదానం మీదకూడ చూపిస్తారా అని అవధాని కన్నెర్ర చేశారు.

3. శ్రీ కందుకూరి సూర్యప్రసాదరావు – భాషాప్రవీణ – కాకినాడ.

తెలుగు వర్ణనాంశం

తే॥గీ॥ బాల్య వైవాహిక స్థితి బరితపించి
కందుకూరి దాని తరిమె కడలిదాక
అప్పరావు కన్యాశుల్కమడ్డ గించె
కాళ్లకూరి యణచె వరకట్న విరతి
నాడువారే మి భాషింత్రా నేడు కతిసి
తెలుపుడోయవధాని సుధీవరేణ్య

వర్ణనము

తే॥గీ॥ బాల్యవైవాహిక స్థితి బటిమదప్ప
కందుకూరియెయానంద మందెనేడు
మురిసిగురుజాడ నరసిపోవ
కాళ్లకూరును బెనుబల్మికందుకూరి.

## సారాంశము

బాల్య వివాహములు చేయు ఆచారము తొలగిపోయిన దని శ్రీ కందుకూరి వీరే శలింగం పంతులు గారు నేడు ఆనందించుచున్నారు గురజాడకూడ మురిసిపోవుచున్నా డు. గురువుయొక్క మార్గాన్ని అనుసరించి పోగా కాళ్లకూరివారు కూడ ఆనందించినారు

శ్రీ వీరేశలింగం పంతులుగారు బాల్యవివాహాలపైన, శ్రీ గురజాడ అప్పారావు గారు కన్యాశుల్క దురాచారంమీద, శ్రీ కాళ్లకూరినారాయణరావు గారు వరకట్న దురాచారంమీద తమరచనలతో దండెత్తి వాటిని రూపుమాపినారు అందువల్ల వారు ముప్పురు కలిసినపుడు తమలో తాము సంతోషిస్తూ ఉంటారు

### 4. శ్రీ వదలి సుబ్బారాయుడు ఎమ్.ఎ. భాషాప్రవీణ – పెద్దాపురం

**తెలుగు వర్ణనాంశం**

**మత్తేభ:** **గిరికన్యామణి, తల్లి పార్వతిని అంగీకారముప్ కాగ సుం**
**దరసంశోభిత భవ్యజానపద పాత్ర శ్రీ విచిత్రించి అ**
**క్షరసందర్శన భాగ్యమీయగదురే! శార్దూల పద్యమ్మునం**
**దరయన్ మాడుగులాఖ్య నాగఫణి శర్మా శ్రీ వధానిప్రధీ**

**వర్ణనము**

**శా।** **కొండల్ కోనల గిర్గిరన్‌దిరుగుచున్ కోయంచు భాషించుచున్**
**వెండిన్ వెన్నెల మేని పూతలనగా నీలంబులే బొట్టుగా**
**నిండారంగన నాకులాభరణముల్ నెమ్మావులే చేలముల్**
**కొండన్ కూతురుదైన జానపదమున్ కూర్పంగ నీసారులే**

## సారాంశము

పార్వతీమాతను కోయవనితగా చిత్రిస్తూ శార్దూలం చెప్పమని ప్రశ్న? కొండకోనలలో గిరగిర తిరుగుచు కో అని పలుకుచు, తెల్లని వెండి వెన్నెలలే మై పూతలుగ, ఇంద్రనీలమణులే బొట్టుగ, చెట్ల ఆకులే శరీరము నందలి సర్వాభరణములుగ, లేతమామిడి చిగుళ్లే వస్త్రములుగ, కొండలరేని కూతురైన పార్వతీదేవి జానపద వేషమునుధరించగ ఇట్టి అందములు ఏర్పడునని కవిభావన

పరమేశ్వరుడు కిరాతుడుగ, జగన్మాత కోయవనితగ సంచరించినారని కిరాతార్జునీయ

కావ్యంవలన మనకు తెలియుచున్నది పార్వతీదేవి యొక్క ఆరూపాన్ని అవధానిపై విధంగా భావన చేయడం జరిగింది

**5. డా॥ వేదుల సుబ్రహ్మణ్యం – ఎమ్.ఎ.పిహెచ్.డి. రీడర్ – విశాఖపట్టణము.**

## సంస్కృతవర్ణనాంశం

### "సుధర్మా ఇయంసభా"

### వర్ణనము

శిఖరిణీ: యదాపైండా వంశ్యః భువిసుమనసాం నాయకమణిః!
కవిర్ధారాదీనాగుణ గణవరాదైవతసదీ !
ముదారామబ్రహ్మం సురగురురథ ప్రాభవయుతః
సుధర్మేయందివ్యాబుధవరతతిస్సభ్యనితతిః॥

### సారాంశము

పైండా వంశము నందు జన్మించిన శ్రీరామకృష్ణమూర్తి, ఈ భూలోకమున, దేవతల కధిపతియైన ఇంద్రుడు కవితాగుణ గణములకు నిలయమైన, ధీరగంభీరమైన శతావధాని కవితాధార ఆకాశగంగ బుద్ధివైభవ సమన్వితుడైన రామబ్రహ్మందేవగురువైన బృహస్పతి, ఇందలి సభ్యసమూహము దేవతలసముదాయము కావునదివ్యమైన ఈ సభ దేవేంద్ర సభయగు సుధర్మయే

స్వర్గలోకమునందలి దేవేంద్ర సభావర్ణనములో ముఖ్యాంశములైన ఇంద్రుడు, ఆకాశగంగ, బృహస్పతి, దేవతాగణము అనువాటిని ఈ సభలోని పైండా శ్రీరామకృష్ణమూర్తి, శతావధాని కవితాధార, బేతవోలు రామబ్రహ్మం, సభ్యుల సమూహమును క్రమంగా పోల్చి చెప్పుట ఇందలి చమత్కారము.

**6. ఆకుల శ్రీరామమూర్తి – నటనకవి – కరప**

### తెలుగు వర్ణనాంశము

సత్యలోకంలో తెనాలి రామకృష్ణ కవి, విశ్వనాథాది కవీశ్వరుల సన్నిధిని రామాయణ కల్ప వృక్షముపై మాట్లాడిన ఎట్లుండునో!

### వర్ణనము

**మందా: శ్రీమద్రామాయణగురు కథన్ శ్రీ మదాంధ్ర ప్రశస్తిన్**
**ధీమత్ పూర్ణ ప్రతిభలు గనన్ ధీవరుల్ మెచ్చుచుండన్**

సీమాతూన్య ప్రథితయశముల్ చిత్రమై వెల్గు భూమిన్
శ్రీమన్నారాయణ వరకవీ! శ్రీకరా! రామకృష్ణ!

సారాంశము

శ్రీమన్నారాయణ వరకవీ! (సత్యనారాయణకవీ) ఆంధ్రభాషలో వెలువడిన మీ యొక్క శ్రీ మద్రామాయణ కల్పవృక్షప్రశస్తిని, బుద్ధి వైభవసమన్వితమైన ప్రతిభను చూచి పండితులు మెచ్చు కొనుచుండగ ప్రఖ్యాతములైన అవధిలేని మీ కీర్తులు భూమి యందు విచిత్రముగ వెలుగు చున్నవి.

శ్రీమద్రామాయణ కల్పవృక్షము - వాల్మీకిరామాయణమునకు యధామూల -కానువాదము కాదు దానియందు విశ్వనాధవారిప్రతిభ అడుగడుగునా గోచరించును ఈ విషయమునే తెనాలిరామకృష్ణుడు సత్యలోకంలో విశ్వనాథవారి ఎదుటనే చెప్పినట్లు పై పద్యమున వర్ణించబడినది.

**7. శ్రీ ఆకొండి శ్రీ వేంకట సూర్యనారాయణమూర్తి – బి.ఎస్‌ఇ. ఎమ్ఎ.ఎమ్. ఇడి.– కాకినాడ**

**తెలుగు వర్ణనాంశము.**

కింకవీంద్రఘంటాపంచాననబిరుదాంకితులు, తిరుపతి వేంకట కవులు కాకినాడలో ఈ రసజ్ఞులగు ఆహూతులనడుమ కూర్చొని నాగఫణిశర్మగారి శతావధానమును తిలకిస్తుంటే వారి మనోభావాలు ఎలా ఉంటాయో!

**వర్ణనము**

**చం॥** **చిరుతవయస్సు వాడయిన శేముషి కల్గినవాడు వీడహో**
**తిరముగ కాకినాడ చిరదీప్తులు వెల్గగ వాణివల్కగా**
**పరవతి విల్చినాడు గద భవ్యపదస్థితి మ్మాప్రతిష్ఠకున్**
**తిరుపతి వేంకటేశ్వరుల ధీగతి యీగతి నన్ను జూచినన్.**

**సారాంశము**

వయస్సులో చిన్నవాడయినను ఆహో! వీడు మంచిబుద్ధివైభవము కలవాడే. కాకినాడ-పట్టణంలో తనవాణిస్థిరముగ ప్రకాశములు వెదజల్లుచు పలుకుచుండగ,

మాకీర్తిప్రతిష్ఠలకు సుస్థిరత్వమును కల్పించినాడుగదా! అనియీసభలో నన్ను జూచిన తిరుపతి వేంకట కవులు భావింతురు

తిరుపతివేంకట కవుల తొలి శతావధానము విజయవంతంగా జరిగిందని అట్టి విద్యాపిరమగు కాకినాడలో పిన్నవయస్సువాడయిన ఈ అవధాని శతావధానం చేస్తూ మాకీర్తిప్రతిష్ఠలు నిలబెట్టుచున్నాడని, వారు హర్షిస్తారని అవధాని భావన

**8. శ్రీ కందుకూరి శ్రీకృష్ణమూర్తి – భాషాప్రవీణ – మోడేకుర్రు**

**తెలుగు వర్ణనాంశము**

పండితుడే ప్రధానియైనచో రాజ్యము ఎట్లుండును?

**వర్ణనము**

**ఉ। గుండియ నొచ్చుకోని దెసకూర్మిని పంచి మహాప్రజాళికిన్**
**వెండియు వెల్గు కల్గగ నువిస్ఫురణ స్థితి చెన్నుమీరగాన్**
**పండితుడే ప్రధానియయి భాగ్యము భోగ్యమునంతరింపగా**
**పండిన పాలవెన్నెలలు పర్వము పర్వమునన్ చెలంగెడిన్.**

**సారాంశము**

పండితుడే ప్రధాన మంత్రియై దేశప్రజలందరకు మనస్సులు నొచ్చుకొననిరీతిని ప్రేమనుపంచుచు, వారి జీవితములలో వెలుగులు నింపుచు, జ్ఞానమును పెంపొందింప చేయుచు, భోగభాగ్యములను అభివృద్ధి పరచుచుండగ, ప్రతి పర్వము నందును సుఖశాంతులే విరాజిల్లును

దేశాధినేత పండితుడైతే అతని నిర్ణయాలు దేశప్రజలకు సర్వసౌఖ్యాలు కలిగించేవి, ఎవ్వరినినొప్పించనివి విద్యావైజ్ఞానిక రంగాలలో అభివృద్ధిని సాధించేవియై ప్రజలకు ప్రతిపండుగను సుఖమయంచేస్తాయి పర్వమంటే పూర్ణిమ,పండుగ అని రెండు అర్థములు పూర్ణిమనాటి పండు వెన్నెలవలె పండుగలలో సర్వసౌఖ్యములు కలుగుతాయని చమత్కారము.

**9. పోతుకూచి సూర్యనారాయణమూర్తి హిందు విద్యాలయ కళాశాలాధ్యక్షులు – రాజమండ్రి.**

### తెలుగు వర్ణనాంశము

పద్యానికి రోజులు చెల్లాయని తస్మాత్ అవధానాలకికూడ అని కొందరంటున్నారు దీనికి మీ సమాధానం ఏమిటి?

### వర్ణనము

కం॥ పద్యాలకు కాదు సుమీ
పద్యమ్ములు చెప్పలేని వారికి సంవి
ద్వేద్యత చెప్పెద సమయం
బాద్యంతము నష్టమయ్యెనారసి చూడన్.

### సారాంశము

ఆలోచించి చూడగ పద్యాలకు కాదు, పద్యములు చెప్పలేని వారికి కాలంపూర్తిగ చెల్లిందని జ్ఞానముచే తెలిసికొని చెప్పుచున్నాను

పద్యాలకు, అవధానాలకు కాలం చెల్లిందని అనడమేకాని, చక్కని పద్యకవితలు, అనిదంపూర్వములనదగిన, అష్టావధాన, శతావధానాలు, ప్రజల మన్ననలను పొందుచున్నవని నాకు తెలిసిన జ్ఞానముచే చెప్పుచున్నానని అవధాని సమాధానము చెప్పినారు

10. శ్రీ మేకాసుధాకరరావు – కవి – పిఠాపురం

### తెలుగు వర్ణనాంశము.

"పిల్లలకుపాలునేనే ఎందుకివ్వాలని భర్తను ప్రశ్నించే విద్యాధికురాలి మనస్తత్వం."

### వర్ణనము.

కం॥ పాలీయలేని తల్లిని
పాలన్ మురిపాలఁబంచబడలెడు తల్లిన్
యే లీల మెచ్చు కొందును
చాలని కందంబెగొణిగి నణుగుచునుండన్.

### సారాంశము

పిల్లలకుచనుబాలు ఈయలేని తల్లిని, తనచను బాలద్వారా ముద్దుమురిపెములు పంచుటకు బద్ధకించెడి తల్లిని, ఏవిధంగా మెచ్చుకొంటాను. చాలని కంద పద్యమే ఈ

రీతిగ సణుగుమన్నది తమపిల్లలను శిశు సంరక్షణాలయాలకు, దాదులకు, అప్పగిస్తున్ననవనాగరిక స్త్రీలు, తమపిల్లలకు మాతృప్రేమను అందింపక దూరం చేస్తున్నారు దీనిని ఎవ్వరూహర్షించరు అచేతనమైన, ఏభావాన్ని పూర్తిగ చెప్పడానికి ఈ చిన్ని కంద పద్యయోడో"చాలు" అని సణుగుచున్న దనిచమత్కారము

**11. శ్రీ పేరి వెంకట సూర్యనారాయణమూర్తి ఎమ్.ఎ, భాషాప్రవీణ – సాహిత్యరత్న – కాకినాడ**

**తెలుగు వర్ణనాంశము**

"ఆధునిక వాఙ్మయంలో సంస్కృతాంధ్రముల స్థితి"

**వర్ణనము**

**తేII** ఆధునికవాఙ్మ యములందు సాధువసగ
సంస్కృతాంధ్రాల చెలిమి యొజరుగుచుండు
మన శతావధానమెచూడ మహితసాక్షి
భావితరముల శుభతరప్రభలు కలుగు.

**సారాంశము**

ఆధునిక వాఙ్మయము నందు బాగుగ సంస్కృతాంధ్రముల మైత్రియె కొనసాగుచున్నది దీనికి మన శతావధానమే ప్రత్యక్ష సాక్షి రాబోవుకాలమునకూడ ఇంతకంటె వైభవమేకలుగగలదు

సంస్కృతాంధ్రాల వైభవం నానాటికి పెరుగునేకాని తరగదని, దానికి మన సంస్కృతాంధ్ర శతావధానమే నిదర్శనమని, భావితరాలకు ఇది స్ఫూర్తియని అవధాని సమాధానము

**12. శ్రీ కొల్లూరు అవతార శర్మ–ఎమ్.ఎ–సాహిత్య విద్యాప్రవీణ – రాష్ట్రభాషాప్రవీణ సంస్కృత భాషాకోవిద – కాకినాడ.**

**సంస్కృత వర్ణనాంశం**

**"మూలాధారాత్ ఆబ్రహ్మబిల పర్యన్తం
బ్రహ్మరంధ్రాత్ ఆ మూలాధారాపర్యన్తం
ముముక్షూ మార్గేకుండలిన్యాః సంచారః వర్ణ్యతామ్!"**

## తెలుగు వర్ణనాంశము

"నేటి సినీమాలలో నాట్యము చూచి శ్రీ సిద్ధేంద్రయోగిపడే భాధ"

### వర్ణనము

స్రగ్విణి॥ వంకరటింకరై వాయువో భూతమో
అంకమందంకమై యంటినట్లుండురా
ఇంక నాట్యంబులిట్లేడరా సిద్ధయో
శంకరా! శంకరా! శర్వ! నాశంకరా

### సారాంశము

వంకరటింకరగ కదలుట, గాలియో, దయ్యమో, ఆవేశించి నట్లు ఊగిపోవుట, ఒడిలో దూరి పెనవేసుకొని నట్లుండుట, ఇట్టినాట్యములు ఎందుకురా! ఓ సిద్ధ! ఓశంకర! ఓలయంకర! అని సిద్ధేంద్ర యోగి మనోభావము

సిద్ధేంద్ర యోగి కూచిపూడి నాట్యమునకు మూలపురుషుడు నేటి చలనచిత్రాలలో కనుపించే వికృతములైన నాట్యాలను చూసి, వ్యధచెంది అసభ్యమైన ఈ అంగాంగ ప్రదర్శన నశించాలని, నాట్యాచార్యుడు, లయకారుడు, అయిన పరమశివునికి సిద్ధేంద్రయోగి మొరపెట్టుకొని నట్టు కల్పన. ఒక సంక్లిష్ట స్థితిని చక్కబరచమని కోరడం ఆ విషయంలో అధికారి సర్వసమర్థుడు అయిన వాని ఎదుట యుక్తంగా ఉంటుంది

## 16. శ్రీ చాగంటి సన్యాసిరాజు – కవి – కాకినాడ.

## తెలుగు వర్ణనాంశం

"అమెరికాలో ఉంటూ లక్షలు సంపాదిస్తున్న కుమారుడు తన అవసానదశలో రానందున భారతదేశంలో ఉన్నతల్లి మనో వేదన"

### వర్ణనము.

కం॥ అమరిన లక్షల సిరితో
అమరిక లేనట్టి అమెరికాంత స్థితితో
మమకారము విడనాడిన
అమ్మతత్వపుటంచు నందదుగదరా

### సారాంశము

లక్షల కొలది ధనం సంపాదించి, రాదలచు కొన్న వెంటనే వచ్చుటకు వీలు కాని అమెరికాఖండంలో ఉంటూ, మమకారానికి దూరమైన ఓ కుమారా! మమకారమనే అమృతము యొక్క అంచు (కొస) కూడ మీకు అందదుగదా! ధనార్జన నిమిత్తమై విదేశాలకు వెళ్లి స్వదేశంలో ఉన్న తల్లి దండ్రుల అవసరాలకు అందుకోవాలని కుమారుని గూర్చి తల్లిదండ్రుల మూగబాధ

17 శ్రీ తోపెల్లరామ జోగిశర్మ, సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ– ప్రిన్సుపాల్ – పి.ఎస్.ఎమ్ ఎస్. కాలేజి – కాకినాడ

సంస్కృత వర్ణనాంశము.

"శ్రీ మన్తం భీమమండలాంతర్గత ద్రాక్షారామస్థిత శ్రీ మాణిక్యాంబాప్రాణవల్లభం భీమనాయక ముత్పలమాలయాఽర్చయింతు"

### వర్ణనమ్

ఉ। రాజతి భీమనాథ ఇతిరాజదనన్యమహాప్రభావభూః
వీజతి తత్ర తత్ర కరవీరపరీమలదోఽ విలన్పదా!
కూజతి పంచమస్వర కుకూస్వర కోకిల విషహోసవాన్
భ్రాజతి దక్షవాటి రథభవ్య మహాశివ సత్కథారవైః।

### సారాంశము

గోదావరీమండలాన్ని భీమమండలం అని కూడ అంటారు. అందుండే దక్షారామక్షేత్రంలో వెలసిన మాణిక్యాంబాసమేత భీమేశ్వర స్వామిని ఉత్పలమాల(కలువ పూదండ) తో పూజించమని ప్రశ్న

ప్రకాశించు చున్న సాటిలేని గొప్ప ప్రభావమునకు నిలయ మైన "భీమనాధు"డను దైవము విరాజిల్లు చున్నాడు. అచట ఎల్లప్పుడు గన్నేరు పుష్పముల సుగంధమును ఇచ్చు వాయువు వీచుచుండును. పంచమస్వర "కుకూ" స్వర విశిష్టమైన కోకిల సంతుష్టమై కూయు చున్నది. మంగళ కరములైన మహాశివుని యొక్క సత్కథా ధ్వనులతో దక్షారామము ప్రకాశించుచున్నది. ముందు శ్రీభీమనాధుని, తర్వాత అచట ప్రకృతిని ఆతరువాత భక్తజనుల పురాణ కథా శ్రవణములను, ఈ శ్లోకము వర్ణించినది

18. శ్రీ బి.ఎస్.వెర్మా ఎమ్.ఎ.బి.ఎస్.సి.బి.ఇడి – ద్రాక్షారామం

## తెలుగు వర్ణనాంశం

"ఎంసెట్‌లో మంచి ర్యాంకు వచ్చింది. కాని ఇంటరు పోయింది. అప్పుడా విద్యార్థి భావాలు."

వర్ణనము

కం॥ అక్కడ ప్రథమ శ్రేణియె
ఇక్కడ నధమత్వమయ్యె నీరీతి ఫలం
బక్కడ నిక్కడ పొసగక
నిక్కిన ఫలముండి కూడ నిష్ఫల మయ్యెన్.

సారాంశము స్పష్టము

19. కావలి పురపురామచంద్రరావు L C E. M A B E D – మామిడికుదురు.

## సంస్కృత వర్ణనాంశం

"మన్దాక్రాన్త వృత్త మాశ్రిత్య కాళిదాస స్యమేఘసందేశ కావ్య వైశిష్ట్యమ్ వర్ణయత"

వర్ణనము.

శ్లో॥ శృంగారార్ద్రం ఘనగుణయుతం శ్రీమదానన్దవృత్తమ్
విద్వస్తుత్యం విషయ విశదం విశ్వవిఖ్యాత పూర్ణమ్
కావ్యాదర్శం కవికులగురోః కల్పనాకల్పకం తత్
మన్దాక్రాన్తం రసవరదృశామ్ రాజతే మేఘదూతమ్.

సారాంశము

మన్దాక్రాన్తవృత్తంలో కాళిదాసుని మేఘసందేశ కావ్య వైశిష్ట్యమును వర్ణించునది. మేఘ దూత కావ్యముప్రకాశించు చున్నది అనునది ప్రధాన వాక్యము. మిగిలిన పదములన్నియు మేఘ దూతమునకు విశేషణములై అన్వయించును. ఈ మేఘదూత కావ్యము శృంగార రసముతోకూడినది.(పరిప్లుతము) గొప్పకవితా గుణములుకలది. సహృదయులకు ఆనందమును కల్గించు కథా భాగము కలది. విద్వాంసుల చేతనుతింపదగినది. సందేహములకు తావులేని ప్రసన్నములైన విషయము కలది.

ప్రపంచసాహితిలో ప్రఖ్యాతి పొందినది. ఇతరకావ్యములకుఆదర్శమైనది. కవికులగురువగు కాళిదాసు యొక్కకల్పనలకు కల్పవృక్షము వంటిది. మన్దాక్రాన్తవృత్తముతో కూడినది. పై గుణములతో మేఘదూత కావ్యము రసపిపాసులగు సహృదయులను ఆహ్లాదపరచు చున్నది కాళిదాసుని మేఘసందేశ కావ్యమంతయు మన్దాక్రాన్త వృత్తములో నే రచింపబడుట గమనింపదగిన అంశము. ఆ సౌందర్యాన్ని మన్దాక్రాన్తములోనే వర్ణింపుమని కోరుట ప్రశ్నలోని ఔచిత్యము. ఇచట "ఘనగుణయుతం" అనుపదము మేఘునియొక్క గుణములను సూచించును. ఈకావ్యము అనేకమనోహర కల్పనలకు ఆలవాలమగుటచే కల్పవృక్షముతోపోల్చిచెప్పుటమనోహరముగనున్నది.

20 శ్రీ ఓలేటి శ్రీనివాసశర్మ – భాషాప్రవీణ – ఇంజరం

తెలుగు వర్ణనాంశం

"కవులవలన దేశానికి కలుగు ఉపయోగంస్వేచ్ఛా వృత్తములో వర్ణించుట."

వర్ణనము

మ॥ భువిచీకట్లను పారద్రోలు కవితాభూరి ప్రభాదీపికన్
కవిరాజా! వెలిగించవోయి! కవితాకర్పూర పాళీరసో
త్సవమైలోకముదీప్తులన్ మెరయగా సచ్ఛాంతి సాధింపగా
భవదీయప్రతిభాప్రభావగుణ సంపత్తిన్ ప్రశంసించెదన్.

సారాంశము

ఓ కవిరాజా! ఈభూమియందలి అజ్ఞానమనెడి చీకటులను పోగొట్టునట్టి కవిత్వమనెడి గొప్ప కాంతిగల దీపమును వెలిగింపుము. కవిత్వమనెడి కర్పూరసమూహపు వెలుగులో లోకము కాంతులతో ప్రకాశించగ, శాంతితో విరాజిల్లుచుండగ,దీనికి కారణమగు నీయొక్క ప్రతిభావిశేషమును, సామర్థ్యమును, గుణ సంపదను, కొనియాడెదను.

ఈ సమాజంలో కష్టాలకు అశాంతికి సదవగాహనలేక పోవుటయె ముఖ్యమైన కారణము. సమర్థుడైనకవి తనరచనల ద్వారా ఈ అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి సదవగాహనను పెంపొందింపగలడు. తద్వారా సమాజంలో శాంతి సౌఖ్యాలు అభివృద్ధి చెందుతాయి. సత్కవుల వలన సమాజానికి కలిగే ప్రయోజనమిదియే.

21. శ్రీ ఈమని సువర్ణ ఎమ్.ఎ. – కపిలేశ్వరపురం

తెలుగు వర్ణనాంశం

"దేశసమైక్యతకు, జాతిపునరుజ్జీవనానికి ధర్మసంస్థ స్థాపనపై"

వర్ణనము

తే||
ధర్మసందీప్తికై దేశదార్ఢ్యమునకు
స్వచ్ఛధార్మిక సంస్థలు సలిపె కృషిని
ఋషికృషీవలదివ్య శేముషుల వలన
దేశమున ధర్మ మర్మముల్ తేజరిల్లు

సారాంశము

ధర్మము యొక్క ప్రకాశమునకు, దేశము యొక్క సర్వతోముఖాభివృద్ధికి,నిర్మలమైన ధర్మ సంస్థలు నిరంతరము ప్రయత్నము చేయుచున్నవి అట్టి ధార్మిక సంస్థలలో క్రాన్తదర్శనులై లోకహితమునకై నడుము గట్టిన మహానుభావుల మేధాసంపత్తివలన దేశములో ధర్మమర్మములు ప్రకాశించుచున్నవి

22. శ్రీ పేరికామేశం – భాషాప్రవీణ – విశాఖపట్టణము.

తెలుగు వర్ణనాంశం

"ముగ్ధాప్రోషిత భర్తృకా"

వర్ణనము

ఛం||
నెరసుల నెన్ననేరను వినీతను పీకు ప్రియాంగనామణిన్
మురిపెముదీర్చుదాన రసముగ్ధ వదుగ్ధ పయస్సముద్రమున్
సరసుడరావదేమి తరసామనసా విను గొల్చుచుంటిరా
విరులవనమ్ము వాల్జడల పిడెనువాడెను జాగదేలరా!

సారాంశము

నూతనముగ అప్పుడే యౌవనము లోనికి అడుగు పెట్టిన దశలో సిగ్గువలన మనస్సులోని కోరికలను బయటపెట్టుటకు సమర్థురాలుకాని స్థితిలో, వివాహమైన కొలది రోజులలోనే భర్త దూరప్రాంతములకు వెళ్లుట వలన అతనినే తలంచుచు పరితపించుచున్న యువతి యొక్క మానసికస్థితి

నీయందెన్నడు చిన్న దోషములను కూడపట్టించు కొనిన దానను కాను, నియమము కలదానను నీకుప్రియురాలను, నీ కోరికలను తీర్చు దానను, సుకుమార శృంగారరస భావములు కలదానను, చిలుకబడని పాలకడలిని, ఓసరసుడా! వేగముగ రావేల? మనః పూర్వకముగనిన్నే ఆరాధించుచున్నదానను పుష్పసముదాయము వాల్జెడలనలంకరింపకయే వాడిపోవుచున్నది ఏల ఆలస్యము చేయుచున్నావు?

అదుగ్ధ పయస్సముద్రము అనుచోట "అనాఘ్రాతం పుష్పం" పాఠకులకు స్ఫురణకొస్తుంది. విరులవనమేవాడి పోవుచున్నదనుటలో ఎన్నాళ్లనుండియో ఎదురు చూచుచున్నట్లుతోచుచున్నది

**సారాంశముల రచయితలు**

**శ్రీ వింజమూరి శేషఫణి శర్మ–ఎమ్.ఎ.**

**లెక్చరర్, పి.ఆర్.జి.కాలేజి– కాకినాడ**

**డా॥ రాణీ సుబ్బయ్య దీక్షితులు. ఎమ్.ఎ.పి.హెచ్.డి**

**లెక్చరర్**

**శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత కళాశాల–కాకినాడ**

• • • • • • • •

## అనువాదము

ప్రస్తుతావధానమున అనువాదమొక ప్రత్యేక ప్రక్రియగా స్వీకరింపబడినది పృచ్ఛకుడిచ్చిన తెనుగు పద్యమున కాశువుగా సంస్కృతమున శ్లోకము చెప్పుట, సంస్కృత శ్లోకమును తెలుగున పద్యము నాశువుగా చెప్పుట యిందలి విషయము పూర్వ కవుల అవధానములలో వర్ణనలో అంతర్భాగముగా ఒకరిద్దరు పృచ్ఛకులీ అనువాదమును అవధానికి సవాలుగా నిచ్చియున్నట్లును, వారు దానిని స్వీకరించి కృతకృత్యులైనట్లును ఉల్లేఖములున్నవి. శ్రీ కాటూరి వారు ఆంగ్లమునుండి యాంధ్రములోనికి కూడ తమ యవధానమున భాషాంతరీకరణము గావించిరట కాని యిది ఆంగ్ల పద్యమునకు పద్యానువాదము. దీనినే ప్రత్యేక ప్రక్రియా విశేషముగా స్వీకరించి 32మంది పృచ్ఛకులను అనువాదములో చొప్పించిన ఘనత ఇప్పటికి శ్రీ నాగఫణి శర్మ గారిదే యనవచ్చును.

## అనువాదం అనుసంధించిన పృచ్ఛకులు.

సర్వశ్రీ

డా॥ సంపస సూర్యనారాయణ ఎమ్.ఎ.ఎమ్.ఫిల్.,పిహెచ్.డి భాషాప్రవీణ – ఉపన్యాసకేసరి – పెద్దాపురం

స్వీయ పద్యము

తే॥గీ॥ తెలుగు సాహిత్య సత్కృషీ వలులయందు
వేయి యెకరాల భూస్వామి విశ్వనాథ
వారి పొలమున పండని పంటలేదు
పండినది యెల్ల పసిడి కాకుండలేదు.

### అవధాని సంస్కృత అనువాదం

ఆర్యా॥ సాహిత్య వ్యవసాయిషు
భూస్వామీ విశ్వనాథ ఇతివచ్మి
క్షేత్రేఽత్ర నాస్త్యనుప్తం
ఉప్తం విఫలంచ నాస్తి నాస్త్యత్ర

**సారాంశము**

సాహిత్యవ్యవసాయం చేస్తున్న వారందఱిలో విశ్వనాధ సత్యనారాయణ గారు పెద్ద భూస్వామి ఆయన సాహిత్య క్షేత్రంలో నాటని విత్తనము లేదు. నాటినది ఫలింపక వ్యర్ధమైనది లేనేలేదు విశ్వనాధవారు చేపట్టని ప్రక్రియ లేదు. మహాకావ్యం, కావ్యం, ఖండకావ్యం, నవల, కథ, కధానిక, గేయం, నాటకం, శతకం మొదలైన వివిధ ప్రక్రియలలో అన్నీ అగ్రశ్రేణిలో నిలువదగినవే అందుకేపృచ్ఛకులు శ్రీ పంపనవారు తమ పద్యంలో విశ్వనాధను వేయి యెకరాల భూస్వామి అన్నారు

**2. శ్రీ ఎన్.సి.హెచ్. శ్రీనివాస అయ్యంగార్ ఎమ్.ఎ,బిఇడి.వాయులీన ప్రవీణ – కాకినాడ.**

స్వీయ తెలుగు పద్యము

కం॥ ఇదినాదేశము, దీనిని
పటిలముగా జూచుకొనుట భాష్యము నాకం
చెద భావింపని వారలు
చదువరులన వచ్చునే నృశంసులు గారే.

## అవధాని సంస్కృత అనువాదం

ఆర్య॥ దేశే మమతా రహితా
మాతృశ్రీ చరణ పూజనే సక్తాః
విఫలిత జన్మా వస్తే
విద్యావంతః కధంను భూయాసుః

**సారాంశము**

స్వదేశాభిమానం లేనివారు, తల్లి పాదములను పూజించుట యందాసక్తి లేనివారు, నిష్ఫల జన్ములు. (అంటే వారి పుట్టుకే వ్యర్థం) అట్టివారు విద్యా వంతులెట్లగుదురు?

చదువరులై యుండి కూడ – స్వదేశాభిమానం, లేని వారిని, చదువరులన రాదని, క్రూరులనదగుదురని పృచ్ఛకులు తమ పద్యంలో నిరసించారు.

3. శ్రీ రేకపల్లి శ్రీనివాసమూర్తి

మధురగాయక రత్న, సంగీత సాహిత్య భూషణ, సంగీత శారదామూర్తి – అమలాపురం.

స్వీయ తెలుగు పద్యము

ఆ|వె| మధుర భాష పొందు మాన్యత సర్వత్ర
మధుర భాషణమ్ము మంచి తెచ్చు
కాకి పొంద దెవుడు కోకిల విలువను
పసిడి తళుకు శ్రీనివాసు పలుకు.

అవధాని సంస్కృత అనువాదం

ఆర్యా| మధుర సంభాషణ మిహ
వరగుణ సంధాయి భవతి సర్వత్ర
కింకాకః కోకిల ఇవ
గౌరవముపయాతి జగతి వాక్చక్ర్యా

సారాంశము

అంతటా తీయగా మాట్లాడడం మేలు కలుగ జేస్తుంది సద్గుణంగా భాసిస్తుంది లోకంలో కాకి కోకిల వలె తన కంఠధ్వనితో గౌరవం పొందుతున్నదా?

పృచ్ఛకులు శ్రీ రేకపల్లి వారి పద్యానికి చక్కగా అతికినట్లు శతావధాని గారి అనువాదం సరి పోయింది.

4. శ్రీ కందుకూరి లక్ష్మీనరసింహమూర్తి ఎమ్.ఎ. భాషాప్రవీణ – పి.ఓ.ఎల్. పిఠాపురం.

తెలుగు పద్యము

ఆ|వె| మత్తగిల్లు నత్తు గిత్త తత్తడి వెక్కి
పిత్తి మొత్తి నత్తి నత్తి బత్తిఁ

బత్తి రిడిన బుత్తి ముత్తులు రెండును
నొత్తి గుత్త గట్టు చుండు వేడ!

## అవధాని సంస్కృత అనువాదం

వృషాధి రూఢం ఘనమృత్యు మృత్యుం
భక్తే రధీనాం వరముక్తి మూలం
నమామి శంభుం శిరసా శుభాంగం
సౌభాగ్య వర్షాయ నిరంతరంనః

### సారాంశము

నంది వాహనం ఎక్కినవాడు, మృత్యువుకే మృత్యువైనవాడు, భక్తికి వశమైన వాడు, శ్రేష్ఠమైన ముక్తి నొసగువాడు, మంగళ కరమైన శరీరం కలవాడు, అయిన శంకరుని, మనకు ఎల్లప్పుడు సౌభాగ్యములను వర్షించుటకై నమస్కరించు చున్నాను

అచ్చ తెనుగులో 'త్త' కారపునరా వృత్తంతో వృత్యనుప్రాసంకలిగి చాల అందంగా సాగిన శివస్తుతి పద్యానికి చక్కని సంస్కృతీకరణం

**5. డా॥ శివ లెంక ప్రకాశరావు ఎమ్.ఎ.పిహెచ్.డి.—కాకినాడ**

### తెలుగు పద్యము

తే॥గీ॥ నీలి నీలి దారాల తారాలతాంత
మాల లల్లును నా ప్రియురాలు రేలు
పువు పువుగ విడదీసి మబ్బుల చెరంగు
కొనల ముడివైచి యొడి దాచుకొను పవళ్లు.

## అవధాని సంస్కృత అనువాదము.

నీల నీల తంత్వాకృత తారా
పుష్ప హార మ్రాదియతే బాలా
తద్విభక్త దళ కందళితోష్ప
మేఘచేల పరివేష్టిత లీలా.

### సారాంశము

నా ప్రియురాలు రాత్రిళ్లనీలి నీలి దారాలతో నక్షత్రాల దండలల్లుతుంది. పగళ్లు వాటినే పువ్వు పువ్వులుగా విడదీసి మబ్బుల చెరంగులో ఉంచి దాని కొసలను ముడివేసి ఒడిలో దాచుకుంటుంది.

6. శ్రీ ఎస్.వి. రాఘవేంద్రరావు ఎమ్.ఎ. ఎమ్.ఫిల్–బి.ఇ.డి.– రాజమండ్రి

తెలుగు పద్యము

ఉ॥ ముద్దులు గారు బాలకుని మోహన మూర్తిని గాంచుచున్ సదా
విద్దవు జెక్కుటద్దముల పీడలు చూచుచు మోదమందుచున్
ప్రొద్దులు పుచ్చునా యమకు పుత్ర వియోగము గూర్చి నిర్దయన్
హద్దులు లేని శోక విపులాంబుధి ముంచితి మిత్తి దయ్యమా!

అవధాని సంస్కృత అనువాదము.

వసంతతిలక॥ ముగ్ధం మనోహర శిశుం ప్రమదాల వాల
మానంద కంద మతి లోక గుణార్ణ వంతం
లోకాంత రంగ తమను క్షణ శోక మూలమ్
పుత్రం నవిస్మరతి నైక సుతాహి మాతా

సారాంశము.

అమాయకుడు మనోజ్ఞమైన రూపంకలవాడు, సంతోష కారణమైనవాడు, సాధారణంగా లోకంలో కనుపించని ఉత్తమగుణములుగలవాడు, అయిన బాలుడు మరణించగా అనుక్షణము శోకమును గలిగించు చున్న ఆతనిని ఆతల్లి మరువలేకున్నది పాపమామె కత డొక్కడే కుమారుడు. ఇచ్చిన తెలుగుపద్యం, సంస్కృతీకరణం, కరుణ రసభరిత ములేఅయినా సంస్కృతీ కరణంలో ఆ తల్లి 'ఏకసుత' అనడం విశేషంగా రసపోషకము.

7. శ్రీ ఆకెళ్ల సత్యనారాయణ మూర్తి – విద్వాన్ – కడియపులంక

తెలుగు పద్యము

చం॥ అభిరతి కుంభజన్ము విజయంబున మో బిరులీకు సేయగా
విభవము దక్కిదల్చి అల వెన్నుడు చెప్పిన చొప్పు నాదఁగా
నభిమతి సత్య వర్తనము నందుఁ గళంక మటంచు ధర్మ రాజాం
డిభమది చచ్చెనన్న పలుకించుక నొందెను నార్తమూర్తి యై

## అవధాని సంస్కృతాను వాదము

వసంతతిలకః శ్లో॥ సత్యాత్చ్యుతిర్భవతి మానస ఏకతోత్ర
అన్యత్రద్రోణ గుణ ఘర్షణ భీతిరాతః
తత్ కృష్ణమాశ్రిత్యచ నూన మనన్య గత్యా
మందంహి కుంజర ఇతి స్వవదత్ సధర్మః ।

### సారాంశము

సత్యవ్రతము నుండి భ్రష్టుడన నగుదునే అని మనస్సులో ఒక వంక చింత వేరొక పక్క ద్రోణుని అల్లెత్రాటి మ్రోతల వలన భీతి అయినను గత్యంతరం లేక కృష్ణుని మాటననుసరించి ధర్మరాజు - అశ్వత్థామాహతః అని అందరికి వినబడునట్లు పల్కి కుంజరః అనుమాటను మాత్రము మెల్లగా పలికెను.

అశ్వత్థామయను కుంజరము (ఏనుగు) మరణించియుండగా ఈ మాటధర్మరాజు అశ్వత్థామ మరణించెనని గట్టిగా అనుటచే - ద్రోణుడు - తన ఏకపుత్రుడగు అశ్వత్థామ మరణ వార్తచే హతాశుడై యుద్ధ రంగముననే అస్త్రశస్త్రముల జారవిడచి రథముపై కూర్చుండి యోగముచే ప్రాణములు వీడుటయు - వెంటనే దృష్టద్యుమ్నుడు అతని తలవెంట్రుకలు పట్టి తల ఖండించుటయు భారతమున ప్రసిద్ధము.

8. శ్రీ కేసాప్రగడ సత్యనారాయణ ఎమ్.ఎ.ఎమ్.ఫిల్. – కిర్లంపూడి

### తెలుగుపద్యము

శా॥ గంభీరంబది బేలవోలు పలుకో గంగా ప్రవాహంబు సం
రంభం బెప్పుడు కానుపింపదెచటం బ్రాచీన సవ్యంబులున్
సంభావ్యంబొన రింపనేరికి నహో శక్యంబుగా దెంతయున్
దంభంబుల్మరిలేని లేవట నువన్యాసంబులం జేయుచోన్

## అవధాని సంస్కృత అనువాదము.

వసంతతిలకః గంభీర వాక్య మధురోదధి పూర్ణ చంద్రః
ప్రాచీన మార్గ పరికల్పిత కావ్య జాతం
శ్రీమత్స భాసరసీ రసరాజ హంసః
సోయం మహో నిహ విరాజతి రామబ్రహ్మం

**సారాంశము**

గంభీర వాక్యములనెడి మధుర సముద్రమునుప్పొంగ జేసే పున్నమి చంద్రుడు ప్రాచీన, నవీన రీతులలో కావ్యాలను రచించినవాడు, నిండైన సభలనే సరస్సులలో విహరించే రాజ హంసము, గొప్పవాడు, ప్రఖ్యాతుడు అయిన (బేత వోలు) రామబ్రహ్మము గారు ఇచట ప్రకాశించుచున్నారు.

తమకు గురువైన శ్రీ బేతవోలు రామబ్రహ్మముగారిని స్తుతిస్తూ కేసాప్రగడవార రచించినది పై పద్యం ఆచార్య బేతవోలు రామబ్రహ్మముగారు రాజమహేంద్రవరం తెలుగు విశ్వవిద్యాలయ ప్రాచార్యులు. ప్రస్తుత శతావధాన సభా సంచాలకులు శతావధాని రామబ్రహ్మం గారి యెడ తమకు గల గౌరవాన్ని వ్యంజిస్తూ పద్యానికి మెరుగు పెట్టే విధంగా సంస్కృతీకరించారు

**9. శ్రీ శిష్ట్లా వెంకట రమణ ఎమ్.ఎ.–భాషాప్రవీణ – ఇంద్రపాలేం**

**తెలుగు పద్యము**

**కం॥ మనమున నను మానము నూ**
**నను నీనామ మనుమను మననమును నేమ**
**మ్మున మాన నన్ను మన్నన**
**మను మను నానాము నీన మానానూనా**

**అవధాని సంస్కృతాను వాదము.**

**ఆర్యా॥ అనుమానం మమ మనసిన**
**మను మథమునినాథ మన్యేహం**
**అనవరతం తవ చరితం**
**మననేన సమాశ్రయేఽ హమద్యైవ**

**సారాంశము**

నామనస్సున నెట్టి యనుమానము లేదు. మునులకధిపతీ! నీ నామ మంత్రమును నేను తలంతును. నీ చరితము నెల్లప్పుడు మననం చేస్తూ నిన్నిప్పుడే ఆశ్రయించుచున్నాను.

పృచ్ఛకు లిచ్చిన పద్యం పారిజాతాపహరణంలోనిది. పద్యమంతా 'మ' 'న' అనే రెండక్షరాలలోనే నిర్వహింప బడటం అందలి చమత్కారం

10. శ్రీ గరిమెళ్ల రాధాకృష్ణ కుమారం ఎమ్.ఎ – భాషాప్రవీణ – కాకినాడ

తెలుగు పద్యము

చం॥ కెరటము పెద్దగా నిటను గెంతదు వార్ధి కాకినాడలో
పరువము దాటి పోయినటు వారిధి ముక్కుచు మూల్గు చుండు యీ
శరనిధిలోని దీవియిటు శాంతత నిచ్చును గాలివానకున్
పరుషతరంగ ఉన్నతకు పట్టణ పౌరులు మోదమందరే!

## అవధాని సంస్కృతాను వాదము.

వసంతతిలకః శ్రీ కాకినాడ నగరే జలధిః ప్రశాంతః
ఉల్లోలలోల నవభంగిత పూర్వరంగః
ఝంపా వినాద పరిఘూర్ణిత ఝూంఝువాతః
ఆనంద మాతర తిసత్కవి ధీవరాణాం

సారాంశము

సముద్రము ప్రశాంతమైనది. పై కెగ సిపడే పెద్ద పెద్ద అలలు దూరాన టాయి కాని పట్టణ సమీపానికి రావు. ఝూంకారంతో వీచే పెనుగాలులుంటాయి వీటితో యొప్పారు ఆ సముద్రం సత్కవులకు, ధీమంతులకూ ఆహ్లాదం కలిగిస్తుంది.

హోప్ ఐ లేండ్ కారణంగా కాకినాడ సముద్రం ప్ర శాంతంగా ఉండటం ప్రసిద్ధం. సత్కవులు, ధీవరులు అనుపదాలు జల పక్షులకు, చేపలు పట్టు వారికి ఆహ్లాదం కలిగిస్తుందని అర్థాంతరాన్ని సూచిస్తున్నాయి.

11. శ్రీ యర్రాప్రగడ రామకృష్ణ – రాజమండ్రి.

తెలుగు పద్యము

చం॥ వలిమల యల్లువాడు తలవాక ధరించిన పూవు గుత్తివే
ల్పులగమి జీవ గట్ట యుడివోవని చెల్వల పెంకి వెన్నెలల్
మొలచిన పాదు పాల్కడలి ముద్దుల పట్టి నృసింహ కృష్ణరా
యల కరుణా రసంబు నిను పొరెడి చూపుల చూచుగావుతన్.

## అవధాని సంస్కృతాను వాదము.

ఆర్యా: శివ శిరసి కుసుమ గుచ్ఛం
నవదుగ్ధ సముద్రజాత చంద్రోదయం
నరసింహ కృష్ణ విభవే
శుభ మంగళ మాతనోతు సర్వత్ర

**సారాంశము**

శివుని తలపై నలంకరింప బడిన పూవు గుత్తి, పాల సముద్రము నుండి జన్మించినవాడు అయిన ఈ చంద్రుడు నరసింహరాజు కుమారుడైన కృష్ణ రాయలకు అంతట శుభమును, మంగళమును కలిగించు గాక!

పృచ్ఛకులడిగిన పద్యం నంది తిమ్మన పారిజాతాపహరణంలో కృతిపతి కృష్ణ దేవరాయలను వర్ణించిన పద్యం. అదిముక్కు తిమ్మనార్యుముద్దు పలుకు.

**12. అక్కెళ్ల కృష్ణ మూర్తి – భాషా ప్రవీణ – పి.ఒ.ఎల్ – కాకినాడ.**

**తెలుగు పద్యము**

కం॥ తొగ నూడు గ్రుంకె దట్టం
బుగ జీఁకటులొదవె రిక్క మొత్తము పొడమెన్
లగనమును డాసె నయ్యెడఁ
దగఁబెద్దలు నైదువలును దద్దయు నెలమిన్

## అవధాని సంస్కృతాను వాదము.

ఆర్యా: అస్తం గచ్ఛతి తరణిః
నీడం వితరాం ప్రవిశతి పై కంచ
అస్మాభిర్గన్తవ్యం
కర్తవ్యం కిమపి తత్ర భవనేషు

**సారాంశము**

సూర్యుడస్తమిస్తున్నాడు కోకిలల సమూహం గూండ్లు చేరుచున్నది. మనము వెళ్లాలి. ఇళ్లలో చేయ వలసిన పనులేవో చేయాలి సూర్యాస్తమయ సమయ వర్ణనం రెండు పద్యాల్లో సమానము "కర్తవ్యం కిమపి భవనేషు" అనువాక్యం అందరిని ఊహాలోకాల్లో విహరింప చేస్తుంది.

13. శ్రీ యు. ఆంజనేయరాజు ఎమ్.ఎ. – కాకినాడ

తెలుగు పద్యం

కం॥ శిల వృక్షలతల బుట్టిన
చెలువలు మువ్వురును గూడి చిడి ముడిపడుచున్
తల వాకిట రమియింతురు
సలలితముగ వీని నెరుగు సరసులు గలరే!

## అవధాని సంస్కృతాను వాదం.

ఆర్యా: తరు ఘన శిలా లతాజం
తరుణీత్రిక మత్ర లసతి ముఖరంగే
రాగద మేతన్మేళన
మధకిం త్రికమిహ ప్రవదతు విబుధేశః

సారాంశము

వెట్టు నుండి పుట్టిన దొక్కతె, రాతినుండి పుట్టిన దొక్కతె, తీగనుండి పుట్టిన దొక్కతె ఈ ముప్పురుయువతులు ముఖరంగంపై ఒప్పుచున్నారు. ఈ ముప్పురికల యిక రాగ కారణంఅవుతుంది ఈ ముప్పురెవ్వరో కనుగొన్నవాడు పండిత శ్రేష్ఠుడు

పై తెలుగు పద్యం ఒక పొడుపు కథ తాంబూ లందాని సమాధానం చెట్టు నుండి పుట్టినది పోక చెక్క, రాతినుండి పుట్టినది సున్నం తీగనుండి పుట్టింది తమలపాకు. సంస్కృతంలో తెలుగు పద్యంలో లేని క్రొత్త సూచన ఈ మూడింటి మేళనం రాగ కారణం అనేది

రాగం అంటే ప్రేమ, – ఎఱుపురంగు.

## సంస్కృతంనుండి తెలుగు అనువాదం

14. శ్రీ వింజమూరి శేష ఫణిశర్మ ఎమ్.ఎ. – కాకినాడ.

సంస్కృత శ్లోకము

మాలిని వృత్తము: అపితు రంగ సమీపాదుత్పతన్తం మయూరం
సపది చిరకలాపం బాణ లక్ష్మీ చకారం
సపది గతమనస్కాశ్చిత్ర మాల్యాను కీర్ణే
రతివిగళిత బన్ధే కేశపాశే ప్రియాయాః

## అవధాని తెలుగు అనువాదం

కం॥ పింఛియమున జెలియ చికుర
మంచితముగ దలఁచి వగచి సాలోచనుడై
దించెను బాణము ధనువును
జంచద్విర హాతిరేక సమయము నందున్

### సారాంశము

నెమలి పింఛం చూడగానే ప్రియురాలి కురులుస్మరణకు వచ్చి మనస్సులో ఏవో ఆలోచనలు రాగా ప్రియురాలికి దూరంగా ఉన్న ఆ సమయంలో రాజు ధనుర్బాణములను దించేశాడు. ఆ నెమలిని కొట్ట లేక పోయాడు.

పృచ్ఛకు లిచ్చిన శ్లోకం రఘువంశకావ్యంలోని 9వ సర్గలోనిది దశరధుని వేట వర్ణనం. విప్పారిన నెమలిపింఛంస్మర కేళిలో వీడిపోయిన ప్రియురాలి కేశపాశాన్ని అక్క డక్కడ పుష్ప మాలికలు కలదాన్ని స్మరణకు తెచ్చింది. అందువలన దశరధుడు ఆ నెమలిని కొట్టలేక పోయాడు. అని శ్లోకభావం.

**15. డా॥ కందుకూరి సత్య సూర్య నారాయణ మూర్తి ఎమ్.ఎ.పిహెచ్.డి., విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ, – రాజమండ్రి.**

వసంత తిలక – శ్లోకము॥ ఆనంద మంథర పురందర ముక్త మాల్యం
మౌలే చిరాయ నిహతం మహిషా సురస్య
పాదాంబుజం భవతుమే విజయాయమంజు
మంజీర శింజిత మనోహర మంచి కాయాః

## అవధాని తెలుగు అనువాదం

తే॥గీ॥ పటుపురందర వందిత పదతలమున
భయదు రాక్షసు మర్దించు పాదమునను
నవ్వులొలికించి చెలరేగు మువ్వయందె
మనకు పెల్లుగా వెదజల్లు మంగళములు.

### సారాంశము

మహిషాసురమర్దిని అమ్మవారి పాదం ఇంద్రునిచే నమస్కరింప బడినది. భయంకరు

డైన మహిషాసురుణ్ణి మర్దించేది ఆ పాదము ఆనంద కరంగా అలంక రించి మ్రోయు చున్న మువ్వల అందె మనకు పుష్కలంగా శుభములు కల్గించుగాక!

శ్లోకంలో అందెల సవ్వడితో మనోహరమైన అమ్మవారి పాద పద్మం నాకు విజయాన్ని కల్గించు గాక అని ఉండగా అవధాని గారు ఆశీర్వచనాన్ని అందరికీ వర్తింప చేశారు మంగళ కర్తృత్వం పాదానికి కాక దాని నలంకరించిన అందె కిచ్చారు.

16. శ్రీ ధూళి పాళ మహాదేవమణి ఎమ్.ఎ. విద్యాప్రవీణ – భాషాప్రవీణ – కాకినాడ.

శా॥ శ్లో॥ భేదః కిమ్ ? భవదీ దృశః ప్రియతమేత్యన్నేత్రవహ్నేర్విభో
కించి ద్వేపిత మేతదిందు వదనే భోగీంద్ర భీతేస్తవ
రోమాంచః కథమేత దేవ భగవన్! గంగాంభ సాంశీకరైః
ఇత్థం భర్తరి భావగోపన పరా గౌరీ చిరం పాతువః

## అవధాని తెలుగు అనువాదం

ఉ॥ గౌరి భయం బదేల? యనఘా! మఱి పిదగు కంటి మంటచే
భూరితర ప్రకంపనలు బొందెద వేల? భుజంగ భీతిచే
నూరెడి పుల్క లేల? మెయి ఓ! ఆదియా తల దొల్కు నీటిచే
పారవు నర్మ భాషణలు సాగెను నీగతి గౌరి కీశుకున్

### సారాంశము

నవ సమాగమ సమయంలో క్రొత్తగా పతిని సమీపించిన నవవధువు గౌరికి భీతి, వణకు, గగుర్పాటు, కలిగాయి. వాటిని పసిగట్టిన శంకరుడ దేమి అని అడిగాడు అమె కారణాంతరా లేవో చెప్పింది. వారి నర్మ సంభాషణమిలా సాగింది.

గౌరి భయమేల? పవిత్రుడా! నీకంటి మంటచే
వణకేల? సర్పముల వలని భయంతో
ఈ గగుర్పాటేమి? నీతల మీది నుండి ఎగసి పడుచున్న నీటి స్పర్శచే

సంస్కృత శ్లోకం ఆశీస్సుగా ముగిసింది. తెలుగు పద్యంలో అదిరా లేదు. శ్లోక భావమంతా చక్కగా తెలుగు పద్యంలో ఒదిగింది.

**17. శ్రీ మల్లంపల్లి అమరేశ్వర ప్రసాద్ – భాషాప్రవీణ – కాకినాడ**

ఇంద్రవజ్ర శ్లో॥ నేదం నభో మండల మంబురాశిః
నేమాశ్చ తారాః నవఫేన ఖండాః
నాఽయం శశి కుండలితః ఫణీంద్రః
నాఽయం కళంకశ్శయితో మురారిః

## అవధాని తెలుగు అనువాదం

తే॥ గగనమా కాదు, మిత్రమా కనగ జలధి
తారలా కావు నురగల సొరు చెదరె
చంద్రుడా కాదు శేషుండు చాపఁజుట్టె
అంకమా కాదు శయిత నారాయణుండు.

సారాంశము

శరద్రాత్రి ఆకాశ దృశ్యాన్ని సమగ్రంగా అపహ్నవాలంకారంలో పాలకడలిలో శేష తల్పంపై శయ నించిన విష్ణు మూర్తిగా వర్ణించిన అందమైన పద్యమిది ఇది ఆ కాశం కాదు సముద్రం అందులో మెరిసేవి నక్షత్రాలు కావు – సముద్రంలో కన్పించే క్రొత్త నురుగుల సమూహాలు, వాటి మధ్యలో కనిపించేది చంద్రుడు కాదు, – అదిచుట్టు చుట్టుకొనియున్న ఆదిశేషుడు దానిమధ్య కనిపించేది మచ్చకాదు – పవళించినవిష్ణుమూర్తి.

ఇచ్చిన సంస్కృత శ్లోకం ఎంత సుకుమారంగా నడిచిందో అంత అందం గాను తెలుగు అనువాదం సాగింది సొంతం చేసు కోవలసిన చక్కని పద్యం

**18. డా॥ బి.వి. రమణ మూర్తి ఎమ్.ఎ.పి.హెచ్.డీ – అమలాపురం**

అనుష్టుప్॥శ్లో॥ చంచ చ్చంద్ర కరస్పర్శ
హర్షోన్మీలిత తారకా!
అహో! రాగవతీ సంధ్యా
జహాతి స్వయ మంబరమ్॥

## అవధాని తెలుగు అనువాదం

తే॥ చంద్రకరజాత సంస్పర్శ చకిత యగుచు
హర్ష సంఫుల్ల తారకోత్కర్ష యగుచు

**రాగవతి సంధ్య తానంబరంబు వీడి**
**వరలు వాల్మీకి కవితకు వందనంబు.**

**సారాంశము**

చంద్ర కిరణ స్పర్శ చే పులకించినదై ఆనందంతో వికసించిన తారకలు గలదై రాగవతి యైన సంధ్య తనంత తాను అంబరమును వీడుచున్నది అని తాత్పర్యం.

సమాసోక్తి అని ఒక అలంకారం ఉంది – ఏదో విషయాన్ని వర్ణిస్తూ ఉంటే మరేదో విషయం – అందలి విశేషాల చమత్కారం చేత స్ఫురింప జేయటం దాని లక్షణం సంధ్య అంటే సంజ వేళ రాగం అంటే ఎర్రదనం – అనురాగం అనే అర్థంలో కూడ ఉంది. అంబరం అంటే ఆకాశం – వస్త్రమని కూడ ఒక అర్థం ఉంది కరము అంటే కిరణము – హస్తము అనికూడ అర్థం ఉంది తారకలు అంటే నక్షత్రాలు–నల్లని కనుగ్రుడ్లు అనికూడ అర్థం ఉంది

ఎఱ్ఱని సంజ, చంద్ర కరములు సోకి – నక్షత్రాలను బయల్పరచి తనంత తానే ఆకాశమును వీడిపోవుచున్నది అని ప్రకృతార్థం కాగా ప్రియుని హస్త స్పర్శనందిన అనురాగవతి యైన ప్రియురాలు ఆనందంతో కనులు వికసింపగా తనంత తానే వస్త్రమును వీడుచున్న దను మనోహరమైన వృత్తాంతం ఒకటి స్ఫురించి చమత్కారం కలిగిస్తుంది

పై శ్లోకం వాల్మీకి మహర్షి రామాయణ మహా కావ్యం లోనిది అందుకే అవధాని గారు నాల్గవ పాదంలో వాల్మీకి కవితకు వందనము అర్పించారు

**19. శ్రీ రేకపల్లి వీర భద్ర శర్మ ఎమ్.ఎ,ఎమ్.డి.ఎల్. భాషాప్రవీణ – కొవ్వూరు.**

**స్వీయ శ్లోకము.**

**శార్దూల! శ్లో! ఏతత్కిం శిరసి స్థితం మమపితుః ఖణ్డం సుధా జన్మనో**
**లాలాటం కిమిదం విలోచనమిదం హస్తేన్య కింపన్నగాః**
**ఇత్థంక్రౌంచరిపోః క్రమాదుపగతే దిగ్వాససః శూలినః**
**ప్రశ్నే వామ కరోపరోధ సుభగం దేవ్యాః స్మితం పాతువః ।**

## అవధాని తెలుగు అనువాదం

శా॥ అమ్మా! తండ్రి శిరస్సు నేమి యది యయ్యా చంద్రవంకౌగదా
నమ్మీ ఫాలము నందదేమి సుతుడా చూడన్ తృతీయాక్షియౌ
నెమ్మిన్ దాభుజ మంద దేమి భుజగావీకంబు వీరీతిగా
నమ్మాధుండు కుమారుడేయడుగ హస్తం బడ్డెడిన్ గౌరియే.

### సారాంశము

కుమారస్వామి తండ్రిని చూపిస్తూ తల్లిని ఏవో ప్రశ్నలడుగు తున్నాడు. ఆ సమాధానం చెపుతోంది.

అమ్మా! నాన్న తలమీద అదేమిటి?అది చంద్రవంక గదా!?

నొసట మీదనున్న దేమిటి? కుమారా! అది మూడవకన్ను గాదా!

మఱీ ఆభుజం మీద నున్న వేమి? అవి సర్పాలు గావా!

అని ఈవిధంగా అమాయకుడైన కుమారుడడుగుతూ ఉంటే దిగంబరుడై ఆస్వామి అవయవాలనింకేమి అడుగుతాడో అని గౌరి తన చేతితో మూటు చేసిన

శ్లోకంలో ఇలా చేతినడ్డు పెట్టిన అమ్మవారి ముఖంలో చిఱునవ్వు తొ చూచిందనీ, ఆ చిఱునవ్వు మిమ్ము రక్షించుగాక అని ఆశీస్సు.

20\. శ్రీ మల్లాది సాంబ శివరావు ఎమ్.ఏ., భాషాప్రవీణ – మలికిపురం

శార్దూలశ్లో॥ తారానాయక శేఖరం సురనుతం మందాకినీ ధారిణమ్
హాలోద్భూత వినీల కంధర ధరం శ్రేయస్కరం శంకరం
కౌసల్యా తనుజాత సేవిత పదం శ్రీ పుత్ర దర్పావహమ్
క్షీరారామపురీ విహార రసికం శ్రీరామలింగం భజే॥

## అవధాని తెలుగు అనువాదం

శా॥ తారానాయక శేఖరున్ సురనుతున్ దైవాపగాధారునిన్
ఘోర క్రూర విషోత్థ నీల గళునిన్ గోదండ రామార్చితున్
పార స్ఫార గభీర ధీర కరుణా సారున్ ప్రశంసించెదన్
క్షీరారామపురీ విహార రసికున్ శ్రీరామలింగేశ్వరున్

**సారాంశము**

చంద్రుని తలపై ధరించిన వాడు, దేవతల చేనుతింపబడినవాడు దివ్య గంగను జటాజూటంలో దాల్చిన వాడు, భయంకర విషంచే నల్లనైన కంఠం

గలవాడు, ధనుర్ధారి యగురామునిచే పూజింప బడినవాడు, అతి గంభీరమైన దయ గలవాడు, క్షీరారామ(పాలకొల్లు) క్షేత్రమున విహరించువాడు, అయిన శ్రీ రామలింగేశ్వరుని స్తుతింతును సంస్కృత శ్లోకానికి సంపూర్ణంగా ధారా శుద్ధితో వచ్చిన ఆంధ్రానువాదం. శ్రీ పుత్ర దర్పాపహం=మన్మధుని గర్వాన్ని హరించినవాడు అనే విశేషణం రాలేదు

**21. శ్రీ వారణాసి రాజేశ్వర శాస్త్రి – భాషాప్రవీణ – పిఠాపురం**

శ్లో॥ **ఆర్యా! సంబాధ సురభీణాం అంబామాయాసయం తమను యంతం**
**అంబాలక మవలంచే తం బాలం తనువిలగ్న జంబాలమ్॥**

## అవధాని తెలుగు అనువాదం

కం॥ కమ్మని యావుల నడుమను
అమ్మను నాయాస పెట్టి యందని వాడై
దుమ్ముల ధూళుల దొరలిన
నెమ్మేను గలట్టి కృష్ణు నేను నుతింతున్

**సారాంశము**

అందమైన ఆలమందలనడుమ–తన్ను పట్టుకోవడానికి వస్తున్న తల్లికి(యశోదకు)) చిక్కకుండా కష్టపెట్టుచున్నవాడు, ధూళిచే ధూసరితమమైన శరీరంగలవాడు అయిన కృష్ణుని నేను నుతించుచున్నాను

బాలకృష్ణుని ముగ్ధ మోహనాకారం – చిలిపి చేష్టలు – భక్తులకు మహానందం ఇస్తాయి. వాటిని శ్రీ లీలాశుకుల వారు శ్రీకృష్ణకర్ణామృతంలో తనివి తీరా వర్ణించారు.

**22. శ్రీ సామ వేదం శ్రీ రామమూర్తి శాస్త్రి సాహిత్య విద్యా ప్రవీణ – భాషా ప్రవీణ – కాకినాడ.**

శార్దూలశ్లో॥ శాస్త్రం భూరి విజ స్వరూప మతయే స్వారాధ నార్థం వపుః
స్వధ్యానాయ మనశ్చ బుద్ధి మనఘాం లబ్ధుంచ తీర్థాదికం !
తత్వాన్యప్యుపదేష్టు ముత్తమ గురూన్ దత్వామగృహ్ణో తినః
సంసారే తదపి భ్రమే మయదికిం కుర్వీత సర్వేశ్వరః॥

## అవధాని తెలుగు అనువాదం

శా॥ నీనైజంబును గోరు వారలకు నై నిత్యంబు శాస్త్రంబునున్
నీ నానాఘన పూజకై తనువు తండ్రీ! చింతకై చిత్తమున్
జ్ఞానంబన్నది నిన్ను చేరుటకునై సర్వేశ్వరా దీనిపైన్
ధ్యానంబే మదిలేని వానిని కడుం రక్షింపగా నెవ్వరో

### సారాంశము

నీస్వభావముల నెరుగగోరు వారలకు శాస్త్రముల నొసగితివి. నీ వివిధములైన పూజల చేయుట కనువుగా శరీరము నిచ్చితివి నిన్ను గురించి మననము చేయుటకు మనస్సు యొసంగితివి నిన్ను చేరుటకు జ్ఞానము నిచ్చితి వి సర్వేశ్వరా! ఇన్ని చేసినను మనస్సు నీపై లగ్నము చేయక, నిన్ను ధ్యానింపక యుండు వాని నింకెవ్వరు రక్షింప గలరు?

సర్వేశ్వరుడు తాను సృజించిన జీవకోటిలోనుత్కృష్టుడైన మానవుని యెడ నెంత దయగలవాడో, తరించుట కెంత సాధన సామగ్రిని సమకూర్చి యొసగినాడో, ఈ శ్లోకము పరితలకు జ్ఞప్తికి తెచ్చుచు మేల్కొలుపుచున్నది భగవంతుడిన్ని యనుకూల స్థితులు కల్పించినను. నూటికి తొంబది మంది సరియైన మార్గము నను సరించి తరింపక సంసారమున భ్రమించుచునే యున్నారు వారిని భగవంతుడు మాత్రమేమి చేయగలడు?

### 23. కవిరత్న – శ్రీ భావరాజు సుబ్బారావు – భాషాప్రవీణ – రాజోలు

శ్లో॥ ముహు రంగుళి సంవృతాధ రోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లబాభి రామమ్!
ముఖమం సవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథ మప్యున్న మితంన చుంబితంతు॥

## అవధాని తెలుగు అనువాదం

కం॥ ఎలవ్రేళుల నడ్డిడు కొని
వలదోయీ యంచు ముఖ వివర్తన సేయన్
దలయెత్తెగాని లలనను
లలితుడు చుంబించ లేదు లాలసుడయ్యున్.

### సారాంశము

సుకుమారమైన వ్రేళ్లనడ్డు పెట్టు కొనుచు వలదోయి యని మొగము ప్రక్కకు త్రిప్పికొనిన శకుంతల యొక్క వంచిన తలను దుష్యంతుడు చేతితో పైకెత్తెను గాని ముద్దిడు కొను కోరిక గలవాడయ్యెను, చుంబించ లేక పోయెను

అభిజ్ఞాన శాకుంతలం తృతీయాంకం లోనిది ఈ శ్లోకము

శకుంతలా దుష్యంతు లిరువురు ఒకరిపై నొకరికిగల అనురాగం తెలిసి కొన్నారు. చెలులేకాంతం కల్పించి వెళ్లారు ఆమె నతడు చుంబించ బోయాడు. ఆమెకది సమ్మతమే అయినా లజ్జ అడ్డు వచ్చినది వ్రేళ్లతో క్రింది పెదవిని పలుమార్లు మూసికొనినది వలదు వలదను మాటలతో మొగము ప్రక్కకు త్రిప్పి కొన్నది అప్పుడామె ముఖము చాల అందంగా ఉంది. ఆ ముఖాన్ని ఎట్లో పైకెత్తి చుంబించ బోతుండగా చెలికత్తెలు గౌతమిరాక తెలియ జేయడంతో ఆమె వేగంగా అక్కడ నుండి వెళ్లిపోయింది. తరువాత ఆ సంఘటనను దృశ్యాన్ని తలచు కొంటూ దుష్యంతుడీ మాటలను కుంటాడు

**24. శ్రీ రేగెళ్ల సత్యనారాయణ శర్మ భాషా ప్రవీణ – రాష్ట్రభాషా విశారద – పిఠాపురం**

**శార్దూల శ్లో॥ రేరే రావణ, హీన, దీన, కుమతే, రామం నరం మన్యసే**
**శూరైర్వీర కపీశ్వరై రనుగతం లంకాం సమాసాదితం**
**కామామ్మోఘ మతేఽద్య భూమితనయా రామాయ సందీయతాం**
**ఆత్మానం నగరీంచ రక్షమసుగాం కృత్వా శుశాంతింగతః**

## అవధాని తెలుగు అనువాదం

**శా॥ లంకానాయక, రావణా! హతమతీ! రాముస్ నరున్ కందువా?**
**శంకల్లేని మహోగ్ర వీర కపి సత్సంఘమ్ముతో వచ్చినన్**
**ఇంకన్ చూచెద వేమి? ఈక్షణమె పాపీ! సీతనిమ్మా! మహో**
**లంకానాశము నాపుమా, నిను నమున్ రక్షింపుమా సోదరా!**

**సారాంశము**

లంకా నాయకా! చెడిన బుద్ధి గలవాడా! రావణా! రాముని సాధారణ మానవునిగా జూచు చున్నావా? ఏమాత్రం ఓటమి శంకలేని మహోత్కృష్టులైన వీర వానర సంఘముతో గూడి ఇక్కడికి వచ్చి యుండగా ఇంకను ఏమి చూచుచున్నావు? ఓ పాపీ! ఈక్షణమే సీతనిమ్ము. లంకా మహానగర వినాశము జరుగ కుండ ఆపుము సోదరా! నిన్నును నన్నును రక్షింపుము

పృచ్ఛకులొసగిన శ్లోకం – అంగదుని రాయబారం సమయంలో అంగదుడు చేసిన సదుపదేశం తెలుపుతోంది. అందుకే రే,రే, రావణ! అనేధిక్కారం కాని అవధాని గారు విభీషణోక్తిగా అనువదించారు అందుకేనిను, ననురక్షింపుమా సోదరా! అనిపద్యము ముగించారు

**25. శ్రీ గరిమెళ్ల సత్యసోమయాజులు : ఎమ్.ఎ.సహజ పాండిత్య విభూషణ – అవిడి**

**అనుష్టుప్ శ్లో॥ వందే హఠంభగవత్పాదం**
**వేదవేదాంత శేవధిమ్**
**చండ పాషండ శుండాల**
**శుండా మండల ఖండనమ్॥**

## అవధాని తెలుగు అనువాదం

**భగవచ్ఛంకర పాదుని**
**విగళీకృత కుమతి విమత వితతాహ్లాదున్**
**జగదేక సద్గురున్ నే**
**నగణితము గ గొల్తుదాల్తు నాశీర్వాదాల్.**

### సారాంశము

దుష్టులైన శత్రువుల ఆహ్లాదమును తొలగించువాడును, జగత్తున కంతయునొకే గురువైనవాడును, అయిన శ్రీ మచ్ఛంకర భగవత్పాదుని – లెక్కలేనంత యధికముగా నేను సేవింతును. వారి ఆశీర్వాదములను పొందుదును

ఆచార్య శంకరులు పాషండ మతస్థులనెడి ఏనుగుల తుండములను తమ వాదములచే ఖండించినవారు.

26. శ్రీమతి కె. హేమలత – భాషాప్రవీణ – రాజమండ్రి.

అనుష్టుప్ శ్లో॥ పూజార్థే సృజతే పుష్పం
సౌరభం తస్య తృప్తయే!
సౌభాగ్యం కవి భోగార్థం
భోగీత్యాగీచ సత్కవిః

## అవధాని తెలుగ అనువాదం

కం॥ పూజలకై సుమ కల్పన
భ్రాజిత సౌరభములతని పరితుష్టికినై
రాజట్ త్యాగియు భోగియు
ఈజగతిని సత్కవీశుడౌ వివరింపన్

### సారాంశము

పుష్పాలు పూజకై సృష్టింబడినవి అందలి సుగంధము పూజింపబడు వాని తృప్తికై ఏర్పరుపబడింది ఈ భూమి యందు త్యాగి – భోగి సత్కవీశ్వరుడే.

27. శ్రీ డి.వి.జి.ఎ. సోమయాజులు – ఎమ్.ఎ.పిహెచ్.డి – పొడగట్లపల్లి.

అనుష్టుప్ శ్లో॥ మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిమ్
యత్కృపాత మహం వందే
పరమానంద మాధవమ్॥

## అవధాని తెలుగు అనువాదం

తే॥ మూగవానిని వాగ్మిగా మ్రోగ జేయు
కుంటి వానిని గిరిదాటు బంటు జేయు
ఎవని దయ యిట్టి యద్భుత మెనగ జేయు
అతని మది నెంచి వినుతించి యంజలింతు.

### సారాంశము

ఎవని దయ అత్యాశ్చర్యకరంగా – మూగవానిని – మహావక్తగా – కుంటి వానిని పర్వతములను సైతము దాటజేయ గలదో అట్టి మహానుభావుడగు ( మాధవుని) మనసులో తలంచి – స్తుతించి నమస్కరింతును

28. శ్రీ అడ్డూరి సూర్యనారాయణ రాజు – ఎమ్.ఎ. – కాకినాడ

వసంతతిలకశ్లో॥ రాధా పునాతు జగదచ్యుత దత్త చిత్తా
మంథానా మాకలయతే దధిరిక్త పాత్రే!
తస్యాః స్తనస్తబక చంచలలోల దృష్టిః
దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్॥

## అవధాని తెలుగు అనువాదం

గీ॥ మాధవాంకిత మానస రాధ పెరుగు
పాలువులేనట్టి కుండను చిలుకు చుండె
రాధికాస్తన చంచల రమ్య దృష్టి
నతడు వృషభంబునే చేరి పితుక సాగె

### సారాంశము

గోపాల కృష్ణుని మీద మనసంతా నిల్పిన రాధ పెరుగులేని వట్టి కుండలో కవ్వముంచి చిలుకుతోంది ఆరాధ కుచముల పైదృష్టి నిలిపిన గోపాల కృష్ణుడు కూడ ఒక ఎద్దును బట్టి పాలు పితుకడానికి సిద్ధమగు చున్నాడు. ఒకరిపై నొకరికి వారికి గల అత్యాసక్తి ఇందులో అందంగా వర్ణింపబడింది.

29. శ్రీమతి జి.కాత్యాయిని – ఎమ్.ఎ.ఎల్.ఎల్.బి. ఎమ్.పి.ఇ.డి. – కాకినాడ

అనుష్టుప్ ॥శ్లో॥ జయత్యతి బలోరామః
లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో
రాఘవేణాభి పాలితః॥

## అవధాని తెలుగు అనువాదం

కం॥ అతి బలుడౌ నారాముడు
సతతము జయమందుగాక సహలక్ష్మణుడై
మతిమంతుడు సుగ్రీవుడు
పతి పాలితుడగుచు నెపుడు బడయును జయముల్

### సారాంశము

అతి బలవంతుడైన రాముడు, లక్ష్మణ సమేతుడై విజయమందుగాక! రామ రక్షితుడైన సుగ్రీవుడు మహాబుద్ధి శాలి జయమందుగాక!

30. శ్రీ ఆకెళ్ల లక్ష్మీనరసింహ శాస్త్రి – భాషా ప్రవీణ – కాకినాడ.

శ్లో॥ హేరంబ లంబోదర వక్రతుండ
సదా వతం సీకృత చంద్ర ఖండ
సమస్త భక్తాభయదాన శౌండ
నిజ ప్రభాభాసిత పద్మజాండ॥

## అవధాని తెలుగు అనువాదం

శ్రీ వక్ర తుండ గణపతి
మా వక్రతలెల్లదుల్చి మహివరదుడవై
ధీవిక్రమములు క్రమముగ
సేవించిన వారి కెల్ల చేకురు తండ్రీ

### సారాంశము

వంకర తుండము గలవాడా! గణపతీ! మాలోని వంకర భావములను చేష్టలను, నశింపజేసి – వరదుడవై – నిను సేవించిన వారి కెల్ల బుద్ధి శక్తులను చేకుర జేయుముతండ్రీ!

**31. డా॥ రాణి సుబ్బయ దీక్షితులు ఎమ్.ఎ. పిహెచ్.డి. – కాకినాడ**

**శ్లో॥ సరసీః పరిశీలితుంమయా**
**గమి కర్మీకృత నైకనీవృతా!**
**అతిధిత్వమనాయి సాదృశోః**
**సదసత్సంశయ గోచరోదరీ॥**

**అవధాని తెలుగు అనువాదం**

**తిరిగి గిర్గిరన్ దేశమ్ము దిరిగి తిరిగి**
**ఉండి లేనట్టినడుమున్నయువిద మిన్న**
**కమలనయనను రాకేందు క్రమముఖిని**
**వినతనాభిని భైమిని విభుడగంటి**

**సారాంశము**

ఓరాజా! (నలమహారాజా!) గిర గిర దేశములన్నింటిని తిరిగి తిరిగి ఉన్నదా లేదా అనుసంశయం కలిగించే చిన్ని నడుముగల స్త్రీ రత్నమును, పద్మముల వంటి కనులుగలదానిని పూర్ణ చంద్రుని వంటి మనోహరమైన ముఖముగలదానిని, లోతుపొక్కిలి గలదానిని భీమ రాజపుత్రియయిన దమయంతిని జూచితిని

ఇది హంస నలునితో చెప్పిన మాట ఇచ్చిన శ్లోకం – హర్ష నైషధం లోనిది శ్లోకంలో లేని చాల విశేషణములు అవధానిగారి పద్యంలో చోటు చేసి కొన్నవి అవన్నీ శృంగార నైషధంలో శ్రీనాధుని పద్యానికి చేసిన రెండు అనువాద పద్యాలలోనివి ఈ శ్లోకంలోని "గమి కర్మీకృత నైకనీవృతః"

సదసత్సంశయగోచరోదరీ, అనే రెండు పదబంధాలను వదల లేక రెండు మత్తేభ పద్యాలను (కమలేందీవర షండ ... .. ...... .. .

మృదురీతింబ్రతివాసరంబు....... .........' శ్రీనాధుడు వ్రాసిన విషయం అందరికీ తెలిసిందే.

**32. శ్రీ కాశీభోట్ల కామేశ్వర రావుగారు, భాషాప్రవీణ, ఇందుపల్లి,**

## స్వీయ పద్యము

శ్లో॥ బాలవ్యాకృతి పైవిమర్శయని యొప్రౌఢా వినోదంబనో
ఈలక్ష్యంబులకేది లక్షణమునో యీవళ్లపై లక్షణం
బేలాచెప్పగరాదటంచనుచునో యేదేదొ యెల్లప్పుడున్
గోలంజేయక నిద్రపోవడుగదా గోపాలకృష్ణయ్యతాన్

## అవధాని సంస్కృతానువాదం

బాలవ్యాకరణం వినోదతి సదా ప్రౌఢాతిరస్కృత్తథా
నిత్యం నిందతి శాస్త్ర వాక్యరచనాత్రైవళ్యకింపునః
నిందానందనవృత్తి మాత్రరసరో గోపాలకృష్ణాకః
కింవక్ష్యామితదీయ వృత్తమరసంకామేశ్వర శ్రీకరః

## సారాంశము

ఓ శ్రీకరులైన కామేశ్వర రావుగారూ! ఆ గోపాలకృష్ణార్యుల అరసమైన చరిత్ర మేమని చెప్ప గలను? ఎల్లప్పుడు బాలవ్యాకరణమును నిందించును - ప్రౌఢను గూడ ప్రౌఢవ్యాకరణమును) తిరస్కరించును శాస్త్ర వాక్యరచనలనెడు త్రివళులను నిత్యము నిందించును - నిందించుట లోనే ఆనందమును పొందు రసికుడాయన

ఇచ్చిన తెలుగు పద్యం శ్రీ కామేశ్వరరావు గారి స్వీయపద్యము. వారికి వాఙ్మయాధ్యక్ష డా॥ వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు సన్నిహిత మిత్రులు ఆ మైత్రిని పురస్కరించుకొని వీరాయన స్వభావ విశ్లేషణ చేస్తూ చమత్కారంగా వ్రాసికొన్నపద్యమిది

## సారాంశముల రచయిత

## శ్రీ వింజమూరి శేషఫణిశర్మ—ఎమ్.ఎ

## లెక్చరర్

## పి.ఆర్.జి. కాలేజి— కాకినాడ.



శ్రీ రస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

స్వర్ణకంకణ విభూషిత, శతావధాని సమ్రాట్

# శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారికి

శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠం (రిజిష్టర్డు)
కాకినాడ వారు గౌరవాదరాభిమాన పురస్సరంగా శతావధాన నిర్వహణ
సందర్భమున సమర్పించుకొను

# సుమనోహారము

1.) శ్రీయనురాగరాగమయ రేఖలు విచ్చిన పూలగుత్తులై
తీయని భావవల్లరుల దీప్తులు నింపుచునుండు "సత్యనా
రాయణ" దేవదేవుఁడు నిరంతరరాగ రసానుభూతుల
"చ్చా! యననిచ్చు "నాగఫణిశర్మ"కుశరమ్యశతావధానికిన్

2.) రారాజద్గిరి రాజ రాజనిలయ ప్రాచుర్య భావుండు, నో
రారన్ బిల్చిన ( బల్కు వేంకట విభుండైశ్వర్య దీర్ఘాయురా.
చారప్రాభవ రాజినిచ్చి, విజయస్వాతంత్ర్య మందించు సం
భారాప్యాయతఁ బ్రోచు "మాడుగుల శర్మన్" నాగభోగీంద్రుఁడిస్ ।

3.) సారతరార్థ విస్తారి సమస్యా ప్రపూరణముల్ చూడ పూలబాట
అప్రస్తుత ప్రసంగారూఢ చాతురీ చాకచక్యముచూడ సామూకోట
పద్య పఠన రూఢ పాండితీ గాంధర్వ లాలిత్యముల్చూడ లాలి పాట
సరళ శతవధాన సంచారి సాహితీ ప్రౌఢత్వముల్ చూడ రాచబాట

సుందర కవితా గానమ్ము జోలపాట,
ఘనమనీష "మాడుగుల నాగఫణిశర్మ"
చేసిన శతావధానమ్ము చేవబాట,
అంచు వినుతించుచున్నవారయ్య ప్రజలు

4.) పీమహనీయ సాధనము నిత్యము నూతన మౌచు వేనవే
లానులన్ రహించుత, కళాభ్యుదయంబుల గాంచుగాత! నా
నామురిపాలు, "మాడుగుల నాగఫణీశ! "శతావధాని చూ
డామణి" వై వెలుంగుము! ఎడంద పసందుల విందులందగన్"

5.) ఎన్నోదేశములందు పీప్రతిభ యెంతేవిన్ బురాణించె, నం
పన్నత్వమ్మును నంతరించుకొనె, భావ్యంబయ్యె, నాగాని వి
ద్యౌన్నత్యమ్మున "కాకినాడ పురి "లోనద్దాల మేడెక్కి ఆ
పున్నెంబున్ దిలకించుకొన్నది; మనో మోదంపు చెందళ్ళులన్

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు
శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి బి.కామ్.
అధ్యక్షులు
రచనః కవిరత్న – కవితా భూషణ – కవితా విశారద
శ్రీ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి యమ్.ఎ.
శతావధానవేదిక – టి.టి.డి. కల్యాణమండపము.
కాకినాడ
ది11–5–1992

# శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం (రిజిష్టర్డు)

**స్థాపితం - 1967**

**కాకినాడ**

పుంభావ సరస్వతీ స్వరూపులు

ద్విశతాధిక అష్టావధాన ధౌరేయులు

సుమధుర - సుమనోజ్ఞ - సుకవితా గాన గంధర్వులు

స్వర్ణ కంకణ విభూషితులు

శతావధాని సమ్రాట్

## శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారికి

శతావధాన విజయోత్సవ సందర్భమున

సంస్కృత విద్యా పీఠాధ్యక్షులు

## శ్రీ పైండా శ్రీరామ కృష్ణమూర్తి బి.కామ్. గారిచే

# "శతావధాని చూడామణి"

బిరుద ప్రదానము గావింప బడినది

కాకినాడ

**ది 11-5-1992**

**శతావధాన వేదిక**

**టి.టి.డి. కల్యాణ మండపము.**



శతావధాన ప్రారంభోత్సవ సభా వేదికపై ఆసీనులయినవారు
జ్యోతి ప్రజ్వలనం గావిస్తున్న శ్రీ మల్లాడి స్వామి M L A
శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్యప్రసాద్, ఆచార్య బి.వియస్. పాత్రుడు,
శ్రీ జ్యోతుల సీతారామమూర్తి, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం,
శ్రీ గ్రంధి వెంకట రమణ గారలు




శతావధాన విజయోత్సవ- సన్మాన సభా వేదికపై ఆసీనులయినవారు.
శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి, (సంస్కృత విద్యాపీఠాధ్యక్షులు),
శ్రీ పి. జగన్నాధులు నాయుడు (జిల్లాజడ్జి), శ్రీ సి.ఎన్. గోపీనాధ్ రెడ్డి (ఎస్.పి),
శ్రీ నల్లమిల్లి సత్యనారాయణ రెడ్డి, శ్రీ పైండా రామకుమార్ (బ్యాంకర్స్) గారలు

శతావధాన సభలో ఆసీనులయిన ప్రేక్షకులు



పురుషులు



స్త్రీలు



శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారికి
సన్మాన పత్రమును సమర్పిస్తున్న
డా॥ శ్రీ పైండా విశ్వనాధ కుమార్ M B ,B S , D A. గారు



శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠం తరపున
"శతావధాని చూడామణి" బిరుదు ప్రదానం గావిస్తున్న
సంస్కృత విద్యాపీఠం అధ్యక్షులు
శ్రీ పైండా శ్రీ రామకృష్ణ మూర్తి B Com గారు



శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారికి
ఘనసన్మానం గావిస్తున్న
SRMT మేనేజింగ్ డైరక్టరు శ్రీ కె.వి.ఆర్. చౌదరి గారి
సతీమణి శ్రీమతి సీతారత్నం గారు



శతావధాన సభాసంచాలకులు
ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికి ఘన సన్మానంగావిస్తున్న
శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాథ సత్య ప్రసాద్ గారు




శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారిని
నిలువెత్తు పూలమాలతో సత్కరిస్తున్న
శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్య ప్రసాద్ గారు



డా॥ శ్రీమతి పి సత్యజ్ఞానేశ్వరిని సన్మానిస్తున్న
డా॥ శ్రీమతి ఆలూరు విజయలక్ష్మిగారు



# జ్యోతుల సీతారామమూర్తి

## మాజీ మునిసిపల్ అధ్యక్షులు – కాకినాడ
## శతావధాన ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షులు.

వేదిక నలంకరించిన కవి పండిత పృచ్ఛక గణమునకు, ప్రేక్షక మహాశయులకు ఖమనస్సుమాంజలులు

కాకినాడలో అనేక సాహిత్య కార్యక్రమాలు జరుగుతూనే ఉంటున్నాయి అన్నింటికి కాకపోయిన కొన్నింటికైనా నన్ను రమ్మని ఆహ్వానిస్తే వెళ్లే వాణ్ణి కాని ఆ సాహిత్య సమావేశాలకు హాజరయ్యే వారి సంఖ్య అంతంత మాత్రంగానే ఉండేది కాని నేడు ఈ శతావధాన కార్యక్రమానికి వచ్చిన జనసందోహాన్ని చూస్తే కాకినాడలో సాహిత్యం పట్ల అభిమానం ఏమాత్రం తగ్గలేదనిపిస్తోంది

శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారు కాకినాడలో శతావధానం చేయ డానికి అంగీకరించారని మధుర కవి – శ్రీ శ్రీ శ్రీ గారు ఒక రోజున మా ఇంటికి వచ్చి చెప్పగా తప్పకుండా ఈ కార్యక్రమం జరిపించండి నేను చేయగలిగిన సహాయంచేస్తాను అని చెప్పాను

నా చైర్మన్ పదవీకాలం పదిసంవత్సరాల్లో భువన విజయాలు, కవి సమ్మేళనాలు, అష్టావధానాలు చూసినప్పుడు నాలో సాహిత్యం పట్ల, కవి పండితులపట్ల ఆదరాభిమానాలు పెరిగాయి శతావధానం కాకినాడలో జరిపించాలని అప్పుడప్పుడు మనసులో అనుకొనే వాణ్ణి కాని ఇంతటి బృహత్తర మహత్తరమైనది, సుమారు రెండులక్షల రూపాయల అధిక వ్యయంతోకూడు కొన్నది, మీదుమిక్కిలి ప్రయాసభరితమైనది అయిన శతావధాన నిర్వహణకు సంసిద్ధతవ్యక్తం చేసేవారు కనుపించలేదు

మధురకవి – శ్రీ శ్రీ శ్రీ గారి ఆలోచనముందుగా ఎవరికీ తెలియదు ఆత్మస్థైర్యంతో పురప్రముఖులెవరితోను సంప్రతించకుండా ఒక వ్యక్తిగా నిర్ణయం తీసుకొని 1992మే 9 10 11 తేదీలు కూడ నిర్ణయించి శతావధాని గారికి ఉత్తరంవ్రాయడం, వారు

అంగీకరించడం జరిగిపోయిందని విన్నాను తదుపరి శ్రీ శ్రీ శ్రీ గారు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారితో శతావధానం గురించి చెప్పించి వారిసహాయ సహకారములర్థించగా అందుకువారు సమ్మతించారని విన్నాను

శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠం ఆధ్వర్యమున శతావధాన ఆహ్వాన సంఘం ఏర్పాటుకు ప్రత్యేక సమావేశానికి హాజరు కావలసినదిగా ఆహ్వానం వచ్చింది కాని అనివార్య కారణమువల్ల ఆ సమావేశానికి హాజరు కాలేక పోయాను శతావధాన ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షుని గా నన్ను నియమించుకొన్న విషయం తెలియచేయగా అందుకు సమ్మతించాను

1992 మే నెల 9,10,11 తేదీలు రానే వచ్చాయి టి.టి డి. కల్యాణమండపం సాహిత్యాభిమానులతో కళ కళలాడుతూ కన్నులపండువులా ఉంది. ఈ శతావధానం ఒక మహాయజ్ఞంలా నడిచింది. కాకినాడ పౌరులు ఈ శతావధాన యజ్ఞంలో పాల్గొని తమ సహకార సమిధలను ఇందులో వేశారు ఈ శతావధాన నిర్వహణ బాధ్యత స్వీకరించిన శ్రీపైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారు బహుధాప్రశంసనీయులు. కాకినాడలో ఏ కార్యక్రమం జరిగినా పైండావారి సహాయ సహకారాలు లభిస్తూనే ఉంటాయి.

శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారు సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానాన్ని ఓర్పుతో నేర్పుతో వినయంతో చేశారు. శ్రోతలందరు హర్షించారు 104 మంది పృచ్ఛకులు అడిగిన సమస్య, దత్తపది, వర్ణన, అనువాదాంశముల పూరణములు పూర్తిచేసి 11వ తేదీ ఉదయము 12 గంటల వరకు ఆశువుగా పద్యాలు వినిపించిన పిమ్మట శతావధానం సంపూర్ణమయిందని ప్రయోక్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు ప్రకటించగా కొందరు పృచ్ఛకులు నావద్దకు వచ్చి శతావధానం సంపూర్ణం కాలేదు ధారణ చేస్తేనేగాని సంపూర్ణ శతావధానం అవదు అని చెప్పారు వెంటనే కార్యదర్శి గారైన శ్రీ శ్రీ శ్రీ గారికి ఈ విషయంచెప్పి దీనిపై ఏంనిర్ణయం తీసుకొంటారో ఆలోచించండి అని చెప్పాను వారు ఒక గంట వ్యవధిలోవచ్చి 11 వతేదీ మధ్యాహ్నము 3 గంటలకు ధారణ జరుగుతుంది. అనిచెప్పారు. 104మంది పృచ్ఛకులడిగిన విషయములకు సంబంధించిన 416 పద్యములను ఎక్కడాతడబాటు లేకుండా ఏక బిగిని అప్పగించి శతావధానిగారు రాత్రి 9 గంటలకు సంపూర్ణ

సంస్కృతాంధ్ర శతావధాన జయ పతాకాన్ని ఎగురవేశారు ఇలాంటి ప్రతిభావంతమైన కార్యక్రమం ఎన్నేళ్లకు చూస్తామో అని అనిపించిందినాకు

శతావధాన సభకు వేలాది మంది శ్రోతలు మూడురోజులు హాజరయి సాహిత్య రసప్లావంలో మునిగి పోతున్నారు అంటే అది నాగఫణిశర్మగారు చూపించిన కవితా నైపుణ్యం - గాన మాధుర్యంవల్లనే అని నా నిశ్చితాభిప్రాయం. నేను నాగఫణిశర్మగారిని పెద్ద వయస్సు పెద్దగల వారేమోనని మొదట్లో ఊహించుకొన్నాను కాని ప్రత్యక్షంగా చూసినప్పుడు ఇంత చిన్నవయసువాడు శతావధానం ఎట్లానిర్వహిస్తాడోనని ఆశ్చర్యపోయాను కాని శతావధానంలో పేరు పొందిన ప్రతిభా పాటవాలు అనుభవంలోకి రాగానే ఇది భగవంతుడిచ్చిన వరం - పూర్వజన్మసుకృతం - నిరంతర సాహిత్య కృషి ఫలం మూడింటి సమ్మేళనం అనుకున్నాను. కానీ కేవలం 30 ఏళ్లవ్యక్తికి ఇది సాధ్యమేనా అని అనిపించడం సహజం

శతావధాని గారు పద్యాలు చదువుతుంటే నాకు సగం నిజంగా అర్థం కాలేదు అయినా మధ్యేమధ్యే హాస్యంలూ, ప్రయోక్త రామబ్రహ్మంగారి అర్థవివరణం నన్నుకదలకుండా కూర్చోబెట్టింది నా మటుకు నాకు మూడురోజులు మూడుక్షణాలుగా గడచి పోయాయి అంటే అతిశయోక్తికాదు. ప్రతిరోజు ఒక వంక శతావధానిగారి సాహిత్య విందు, వేరొక వంక శ్రీ పైండా శ్రీ రామకృష్ణమూర్తి గారి షడ్రసోపేతమైన విందు ఆరగిస్తూ కాలగమనంతెలియని మానసికానందాను భూతిని అనుభవించాను

గోదావరి ఒడ్డున ఉన్న రాజమండ్రి, కృష్ణానది ఒడ్డున ఉన్న విజయవాడ పట్టణాలపై పోటీగా కాకినాడ పట్టణంలో శతావధానం నిర్వహించి వాటిని మించి పోయిన ఖ్యాతి సంపాదించగలిగినామని సగర్వంగా చెపుతున్నాను అవధానిగారే "కాకినాడ శతావధానం నాప్రతిభకు పరీక్ష వంటిది నూటికినూరుమంది ఉద్దండ పండిత పృచ్ఛకుల సమక్షంలో నెగ్గగలిగితే యావదాంధ్ర దేశంలో ఎక్కడైనా ఒక శతావధానం కాదు, ద్విశతావధానం చేయగల సమర్థవంతునిగా నిలబడగలుగుతాను" అని సభాముఖంగా చెప్పిన విషయాన్ని సార్థకం చేసుకొని విజయలక్ష్మిని చెట్ట బట్టారు

శతావధాన ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షునిగా, ప్రారంభోత్సవ సభాధ్యక్షునిగా, సన్మాన సభముఖ్య అతిథిగా శతావధాన కార్యక్రమంలో నాకు చోటు కల్పించిన శ్రీపైండా శ్రీరామకృష్ణమూర్తి గారికి శతావధాన ఆహ్వాన సంఘ గౌరవాధ్యక్షులు,

యస్.ఆర్ యమ్.టి. మేనేజింగ్ డైరక్టరు, శతావధాని సన్మాన కర్తలు శ్రీ కె.వి ఆర్. చౌదరి గారికి, డెబ్బై ఏళ్ల వయోవృద్ధులు, శతావధానానికి తొలి బీజంనాటి అహర్నిశలు విశ్రాంతి ఎరుగకుండా కృషిసల్పి శతావధాన కార్యక్రమ విజయానికి కారణసంభూతులైన కార్యదర్శి మధురకవి - శ్రీ శ్రీ శ్రీ గారికి, రాత్రింబవళ్లు తోడు నీడగనుండి సహాయ సహకారములందించిన సహాయకార్యదర్శి శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు (గాంధి) గారికి, మరొక సహాయ కార్యదర్శి శ్రీ కందుకూరి చినరామచంద్రమూర్తి గారికి, ఆహ్వాన సంఘ సభ్యులకు, పురప్రముఖులకు, ప్రాశ్రి కేయులకు, కార్యకర్తలకు , శతావధాని గారికి, ప్రయోక్త గారికి నాకృతజ్ఞతాసుమాంజలులు సమర్పించు కొంటున్నాను.





# మల్లాడి స్వామి

## కాకినాడ నియోజక వర్గ శాసన సభ సభ్యులు

• • •

శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యా పీఠం ఆధ్వర్యమున దీని అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారు శతావధాన కార్యక్రమ నిర్వహణభారాన్ని వహించి అందుకవసరమైన ఆర్థిక వనరులను, భోజన వసతి సౌకర్యములను కల్పించి, తమ వదాన్యతకు వన్నె చేకూర్చు కొంటున్నారు

నేను శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారి శతావధానం చూసిన తరువాత నాకు కలిగిన ఆనందానికి హద్దులు లేవు వందమందికి పైగా దిగ్గజముల వంటి పండితు లు అతి పిన్న వయస్కులైన శతావధాని గారికిచ్చిన సమస్యలనుఅవలీలగా పూరిస్తుంటే అది ఒక మహాద్భుతమైన విషయంగా నాకు తోచింది

ఎప్పుడో 70 ఏళ్ల క్రితం తిరుపతి వేంకట కవులు శతావధానాన్ని శ్రీ పైండారామకృష్ణయ్య టౌన్‌హాలులో చేశారని విన్నాను అంతటి పాండిత్యం గలవారు మన ఆంధ్రదేశంలో నేటికి ఉన్నారు సుమా అని శ్రీ నాగఫణి శర్మగారు ఋజావు చేశారు.

ఈ కార్యక్రమానికి అసలు బీజం నాటిన వారు శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి గారని విన్నాను ఆయన్ని అందరూ శ్రీ శ్రీ శ్రీ అని పిలుస్తుంటే ఆయన్ని పరిచయంచేసుకోవాలనిపించింది ప్రారంభోత్సవ సభావేదిక పై కూర్చున్న నేను ఒక బక్క పల్చని వ్యక్తి వేష్టుకోటుతో వేదిక మీద కనుపించగా ఈయనెవరని ప్రశ్నించినప్పుడు శ్రీరామకృష్ణమూర్తి గారు ఈయనే ఈ కార్య క్రమానికి పునాది అని చెప్పి నప్పుడు నమ్మ శక్యం కాలేదు నాకు కురువృద్ధునిలా కనుపించే ఈయనలో ఇంత ఓర్పు - శక్తి ఎలా వచ్చాయా అని ఆశ్చర్య పడ్డాను అయితే ఆయనకు ఎల్లప్పుడు శ్రీ జమీందారు గారి ఆంతరంగిక కార్యదర్శి శ్రీ అయ్యగారి వెంకట శ్రీనివాసరావు (గాంధి) గారు అండదండగా నిలిచారని విన్నాను

శ్రీ రామకృష్ణమూర్తిగారి ఆర్థిక శక్తి, శ్రీ శ్రీ శ్రీ గారి శ్రమ శక్తి ఇంతటి మహత్తర కార్యక్రమానికి దోహదకారులయ్యా యన్నది నగ్న సత్యం. ముఖ్యంగా శ్రీ శ్రీ శ్రీ గారు శ్రీ పైండా శ్రీ రామకృష్ణమూర్తి గారి కీర్తి ప్రతిష్ఠలను యావదాంధ్ర దేశం వ్యాపింప చేశారనడం అతిశయోక్తికాదు.

అసలు ఇటు వంటి సాహిత్య కార్యక్రమాలను ప్రభుత్వమే చేపట్టి, శతావధానులను, అష్టావధానులను సత్కరించి పోషించవలసి ఉంది కాని ఆపనిని శ్రీ రామకృష్ణమూర్తి గారు నిర్వహించడం ముదావహమైన విషయంగా భావిస్తున్నాను. నా నియోజక వర్గంలో ఇంతటి బృహత్తర శతావధాన కార్యక్రమాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభించే అదృష్టం నాకు కలిగించిన శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారికి, శతావధాన ఆహ్వానసంఘ సభ్యులకు కార్యకర్తలకు నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతలు తెలుపు కొంటున్నాను.

---



# వై.డి. రామారావు

## సూపర్ బజార్ ఛైర్మన్ - కాకినాడ

## శతావధాన ఆహ్వానసంఘ ఉపాధ్యక్షులు.

ప్రజ్ఞులైన కాకినాడ నాగరిక పారిషదులకు, శతావధాని శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారికి, ప్రయోక్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి, పృచ్ఛక మహాశయులకు, హృదయపూర్వకనమస్కారములు

ఏభాషలో లేని ఈ అవధాన ప్రక్రియకు తెలుగు భాషామతల్లి పట్టు గొమ్మగా నిలచింది ఆంధ్ర దేశంలో శతావధానం చేసేవారు నేడు వేళ్లమీద లెక్కించదగినవారు మాత్రమే ఉన్నారని అనుకొంటున్నాను సుమారు గత 70 ఏళ్ల కాలంలో కాకినాడలో శతావధానాన్ని ఎవరూ చూచినట్లులేదు ఈనాడు సంస్కృతాంధ్రభాషల లో నిష్ణాతులైన శతావధాని శ్రీమాడుగుల నాగఫణిశర్మగారి సంపూర్ణ సంస్కృ తాంధ్ర శతావధానం తిలకించే మహద్భాగ్యం మనకు కలిగింది వీరు మన జిల్లాకు కొత్తవారు కాదు గత రెండు సంవత్సరములక్రితం రాజమహేంద్రవరంలో శతావధానం చేసి తమప్రతిభా పాటవాలను ప్రదర్శించారని విన్నాను

రాయలసీమప్రాంతం వారైన శ్రీ నాగఫణి శర్మగారు 32 సంవత్సరముల వయస్సు గల చిన్నవారు తిరుమలతిరుపతి దేవస్థానం వారి ధర్మప్రచారపరిషత్తు అదనపు కార్యదర్శిగ పనిచేస్తున్నారు వీరు అన్నవరం వీరవేంకట సత్యనారాయణ స్వామి వారిమీద సుప్రభాతం రచించి స్వయంగా గానం చేసి భక్తులను పరవశింపజేశారు వీరి గాన మాధుర్యానికి, సంస్కృత భాషలో రచించిన సుప్రభాతానికి అమితానంద భరితులై అప్పటి ఉపరాష్ట్రపతి గౌ॥ శ్రీ శంకరదయాళ్ శర్మ గారిచే సన్మానింపబడ్డారు వీరు రచించిన సుప్రభాతాన్ని సుప్రసిద్ధ సినీ గాయకులు శ్రీఎమ్ బాలమురళీకృష్ణ, జానకి పాడగా రేపురికార్డు చేయబడింది ఆరేపురికార్డులువేడు అన్నవరం దేవస్థానంలోవిక్రయించ బడుతున్నాయి. వీరు ఆంధ్ర దేశంలోనే కాకపోట్నా, ఢిల్లీ మున్నగు పట్టణాలలో శతావధానాలు చేశారు వీరి అవధానపాటవాన్ని గుర్తించి సువర్ణ కంకణంతో, శతావధాని సమ్రాట్ బిరుదముతో సాహితీ సంస్థలు సత్కరించాయి.

1986లో సౌజన్య ఆర్ట్సు అకాడమి అధ్యక్షునిగ శతావధానిసార్వభౌమ శ్రీమేడసాని మోహన్ గారిచే చతుర్గుణిత అష్టావధానం సూర్యకళామందిరంలోను, 1992 మేనెల 9,10,11, తేదీలలో శతావధాన ఆహ్వానసంఘ ఉపాధ్యక్షునిగ శతావధానిసమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారి సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం టి టి.డి కల్యాణమండపంలోను నిర్వహింపబడడం నా అదృష్ట విశేషంగా భావిస్తున్నాను

కాకినాడ పట్టణంలో నాగఫణి శర్మ గారి శతావధాన కార్యక్రమానికి శ్రీకారంచుట్టిన మధురకవులు - శ్రీ శ్రీపాద శ్రీ రామమూర్తి - శ్రీ శ్రీ శ్రీ గారికి అండ దండగా నిలచి ఆర్థిక - హార్దికసహాయాన్ని, అంగబలాన్ని సమకూర్చి, పృచ్ఛకులకు, ఆహూతులకు భోజన - వసతి సౌకర్యములనేర్పాటు గావించి శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠం ఆధ్వర్యమున టి టి డి కల్యాణమండపంలో నిర్వహింపబడిన శతావధాన కార్యక్రమమునకు ప్రధాన సారధిగ నిలచిన శ్రీ పైండా శ్రీ రామకృష్ణమూర్తి జమీందారు గారు అభినందనీయులు.

1992 మే నెల 9,10,11 తెదీలు కాకినాడ చరిత్రకు సార్థకతను చేకూర్చిపెట్టాయి ఆంధ్రదేశంలోని వివిధ జిల్లాలనుండి వచ్చిన పృచ్ఛకు లందరి కందరు ఉద్దండపండితులేనన్నవిషయం శతావధానం చూస్తున్నప్పుడు నాకు అనిపించింది శతావధాని శ్రీ నాగఫణి శర్మ గారికి ఘన సన్మానం గావించేమహదవకాశాన్ని శతావధాన ఆహ్వానసంఘ గౌరవాధ్యక్షులు ఎస్ ఆర్.ఎమ్.టి మేనేజింగ్ డైరక్టరు మాన్య శ్రీ కె.వి ఆర్ చౌదరి గారు కల్పించడం మా అదృష్టవిశేషంగా భావిస్తున్నాము మూడు రోజుల శతావధాన కార్యక్రమంలో పాల్గొనేందుకు సావకాశమును కలిగించుకొని మాడుగుల వారి శతావధాన సాహిత్యామృతాన్ని ఆస్వాదించే సౌభాగ్యం కలిగినందుకు ఎంతో ఆనందిస్తున్నాను

శతావధాన ఆహ్వానసంఘ ఉపాధ్యక్షునిగ, శతావధాన ప్రారంభోత్సవ సభాప్రారంభకునిగ, విజయోత్సవ - సన్మానసభ అతిధిగా ఆహ్వానసంఘ సభ్యులకు, పృచ్ఛకులకు, శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యా పీఠం అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తిగారికి, శతావధాన కార్యక్రమ కార్యకర్తలకు, పురప్రముఖులకు, సాహిత్యాభిమానులకు నా కృతజ్ఞతాభివందనములు తెలుపు కొంటూ ముందు ముందు కాకినాడలో ఇటువంటి ఉత్తమస్థాయి సాహిత్య కార్యక్రమాలకు సంపన్నులైన పురప్రముఖులు చేయూత నివ్వగలరని, అట్టి త్యాగశీలతను భగవానుడు వారికి ప్రసాదించుగాకయని ప్రార్థిస్తున్నాను.

---



# సి.ఎన్. గోపీనాథరెడ్డి ఐ.పి.ఎస్.

## జిల్లా పోలీసు సూపరింటెండెంటు – కాకినాడ

ఎందరో మహానుభావులు–అందరికీ వందనములు రాయలసీమ పండితరత్నం–శతావధాని శ్రీమాడుగుల నాగఫణిశర్మ గారికి, వేదికనలంకరించిన పెద్దలకు, శతావధాన విజయోత్సవ -సన్మాన మహోత్సవ శుభసందర్భముగా నాసుమనస్సుమాంజలులు

మూడురోజులు ముచ్చటగాజరిగిన ఈ సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం విజయవంతంగా ముగిసి కాకినాడకు ఖ్యాతి సమకూర్చి పెట్టింది. ఆంధ్రదేశంలో అవధానవిద్య చాల ప్రాచీనమైనది ఈ చిన్నవాడయిన నాగఫణిశర్మ గారు అడిగిందే తడువుగా సమస్యలకు, దత్తపదులకు, వర్ణనలకు, అనువాదాలకు తడుముకోకుండా ఆశువుగా పద్యాలు చెప్పడం నాకు చాలా ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. చక్కని భావం, బహుచక్కని సమాసాలు, వ్యాకరణదోషాలు లేకుండా ఛందోబద్ధంగా చెప్పగలిగారంటే అది పూర్వజన్మ సంస్కారమని అనుకోవాలి. ఈయన ప్రతిభ నన్ను చాలా ఆనంద పరచింది ఈప్రతిభావంతుణ్ణి స్వర్ణకంకణంతో – శతావధాని సమ్రాట్ బిరుదుతో ఇతరప్రాంతాల్లో సన్మానించారని విన్నాను నేడు ఈ కాకినాడలో శ్రీ పైండాసత్యనారాయణమూర్తి సంస్కృతవిద్యా పీఠంతరపున దీని అధ్యక్షులు శ్రీపైండా శ్రీరామకృష్ణమూర్తిగారు "శతావధాని చూడామణి" బిరుదమిచ్చి సన్మానించడం సముచితమేకాక వారి సంస్కార ప్రియత్వాన్ని వెల్లడిస్తోంది.

నేను సాహిత్యంలో లోతులు తరచి చూడకపోయినా సహజమైన ప్రేరణతో కవిత్వం చేస్తున్న కారణంగా సాహిత్యమంటే అభిరుచిపెంచుకొన్నవాణ్ణి. పద్యం రాయలేక పోయినా పద్యరచనా ప్రక్రియ పదికాలాల పాటు బ్రతికి బట్టకట్టాలనే భావం కలవాణ్ణి. అందుకే పద్యరచనాప్రక్రియ ప్రచారం కావడానికి అవధాన ప్రక్రియ అంతరించి పోకుండా ఉండడానికి అష్టావధాన – శతావధాన కార్యక్రమాలు నిర్వహించవలసిన అవసరం ఎంతైనా ఉందని మనవిచేస్తున్నాను.

వందమంది పృచ్ఛకులకు సమాధానం చెప్పే శతావధానికి, వేలాది మంది ప్రజా బాహుళ్యాన్ని సక్రమ మార్గంలో నడిపించే మా పోలీసు శాఖకు దగ్గర సంబంధం

ఉంది. నామటుక్కునేను అటు ఆఫీసులో ఇటు బయటిప్రపంచంలో శతావధానమే కాదు సహస్రావధానం చేస్తూనే ఉన్నానని అనుకొంటున్నాను

అవధానంచేయడం ఆషామాషీవ్యవహారంకాదు. అనర్గళమైన ధార. అసాధారణమైన ధారణా శక్తి, బహుముఖ పాండిత్యప్రకర్ష, లోకజ్ఞత నిరంతర అధ్యయనం ఉండాలి పిన్నవయస్కులైన నాగఫణిశర్మగారిలో ఇవన్నీ మూర్తీభవించి ఉన్నాయి అనన్యసామాన్యమైన ప్రతిభ ఆయనకు పూర్వజన్మ సుకృతంవల్లనో లేక అవిశ్రాంత పరిశ్రమ వల్లనో లభించి ఉండాలి.

వృచ్ఛక శతకం ఆరితేరిన శాస్త్రార్థడిండిములు వీరిలో శతావధానులున్నారు అష్టావధానులున్నారు డాక్టరేట్స్, కవులు, పండితులు ఉన్నారు అందరికందరు లబ్ధప్రతిష్ఠులే

ఇంత చక్కని శతావధానం జరుగుతుండగా తక్కువేమి మనకు ఓపిక ఒక్కటుండు వరకు. సినీతారల - రాజకీయ సభలకు తప్ప శతావధాన సాహిత్య సభకు అధిక సంఖ్యలో జన సందోహం హాజరు కావడం ఇటివలికాలంలో అరుదైన విషయంగా భావిస్తున్నాను.

ఈ సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన విజయోత్సవ - సన్మాన మహోత్సవసభకు అధ్యక్షత వహించే అదృష్టం కలిగించి- పుర ప్రముఖులకు జ్ఞాపికలను బహూకరింప చేసినందుకు, ఈ శతావధాన కార్యక్రమ సారథులైన శ్రీపైండా శ్రీరామకృష్ణ మూర్తి గారికి శతావధానిగారిని సముచితరీతిని ఘనంగా సన్మానించిన శతావధాన ఆహ్వాన సంఘ గౌరవాధ్యక్షులు ఎస్ ఆర్ ఎమ్ టి మేనేజింగ్ డైరక్టరు శ్రీ కె వి.ఆర్. చౌదరి గారికి, కార్యకర్తలకు నా అభినందనలు తెలియ జేసుకొంటూ ఒకప్పుడు అవధాన విద్య గురించి శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి పద్యం సభాముఖంగావినిపిస్తున్నాను.

**సరిగ శతావధానమును చక్కగ చేసెడి వారు పూర్వమే**
**వరలిరినేడు లేరనెడి వార్తలు కల్లలు దివ్య వాగ్ఝరీ**
**భరపరిపూరితాద్భుత సభాసదలంకరణత్వ సారసం**
**దరతరభావ భావుకతలద్భవసీ యవధాన షంపదన్.**

---

## స్వర్ణ కంకణ విభూషిత – శతావధాని సమ్రాట్
## శతావధానిచూడామణి – శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారి
## ప్రశంసా ప్రసూనాంజలి

సీ॥ అమరవాణీయ విద్యాపీఠ కల్పనా
సల్పమౌ వజ్ర సంకల్పమందు
నిత్యాన్నదాన సంస్తుత్య సత్రవిశేష
నిర్వహణాభోగ పర్వమందు
అసమాన బహుళ విద్యా సంస్థలను బెట్టు
రసమనీషాక్రమాభ్యసనమందు
దానధర్మాది సత్కార్మాచరణ మహౌ
దార్య శౌండీర్య తాత్పర్య మందు
గీ॥ వెలిఁగెమీ కీర్తి వంశాను వృత్తరీతి
వెలుఁగు చున్నది భువి – భావి వెలుఁగగలదు
ప్రథిత పైండా కులాంభోధి పార్వణ శశి!
అనఘ! శ్రీ రామకృష్ణ మూర్త్యాఖ్య! శుభము.

2. పైండావంశము వితరణ
శౌండంబవి "ఆంధ్ర" లోయశంబునుగనె, తత్
డిండీర ధవళకీర్తి, య
ఖండంబై వెలుగు భరత ఖండము నందున్

3. విద్యాపోషకమమలం
విద్యావంతం యశస్వినం – మూర్తిమ్!
హృద్యం నకుటుంబమమృత
పాద్యోఽవతు నిఖిల సంపదా శర్వాణీ

4. మీకున్ కృతజ్ఞతాంజలి
శ్రీ కల్పిత శతవధాన సిత కీర్తికిది
వ్యాకల్ప కల్ప సుకృతికి
మీకున్ పైండా సువంశ్య మృదుచరితునకున్

5. రసికతలు లేని చవిటి పత్రలకు – వెదల
కమృతవర్షంబుఁగురిపించి – ఆర్ద్రతనిడు
అమృతమూర్తీ! త్వదీయ సౌహార్దమతికి
ఋతహిత సతత సంవత్సమృద్ధిరస్తు

6. సీ ॥ వార్ధక్యమా! నీకు వందనం బని చెప్ప
యౌవన శ్రీ దాల్చ సమరుఁడెవడు ?
ఆయాసమా! నీకు అభినందనంబంచు
బహుబల శ్రీఁ దాల్చ భవ్యుఁడెవడు?
నిద్రాప్రియా! నీకు నిజము వీడ్కోలంచు
నయనరాగ శ్రీ గుణాఢ్యుఁడెవడు?
కవి – కళాకల్పుండు – ఘను – డనఘుండహో
రాత్రీకృత శ్రమారాధ్యుఁడెవడు?

గీ॥ అతడుత్రి శ్రీల మిశ్రకృతార్ద్ర మూర్తి
అమృత మధురాయమాన శతావధాన
భువన భవనమూలస్తంభ, మవిరళాచ్ఛ
కీర్తి, శ్రీపాదశ్రీరామమూర్తి యతడె.

7. శ్రీపాద వంశ సుసదన
దీపం, – శ్రీ రామమూర్తి నామాభమ్!
ఆపాతమధుర హృదయం
శ్రీపతి రారోగ్య – సంపదాఽభ్యవతాత్

8. శుద్ధ సంకల్ప దీక్షతో సుమధురముగ
శతవధానంబు నాద్యంతహితమనంగ
దిద్ది చేసినయట్టి నీతిపిపేత
నేను మఱవలే నేనాటికైనగాని.

9. సీ॥ అనుచరుండై చూచి అధికారియై కాచి
విజయ కాంక్షా వీధి వేచి వేచి
పిడయై, అడుగుల జాడయై, సత్కార్య
కర్తృత్వ రీతిలోఁ గళలుఁ బెంచి
సాహిత్య తృష్ణతో సౌజన్యగరిమతో
తనశైలి తనదిగాఁ దళుకు మించి
చిఱునవ్వు మోముపై — చెరఁగని తరగని
తీరికెఱుఁగని సంచార శీలి

గీ॥ చెంగె నయగారి వేంకట శ్రీనివాస
శుభ సమాఖ్యను — ప్రఖ్యాతి విభవమూర
ఘన శతావధాన జయసంఘటకుఁడగుచు
నతని కగుగాక! సంపదున్నతులు — నతులు —

— కృతజ్ఞతా నమస్కారములతో
మాడుగుల నాగఫణి శర్మ

■ ■ ■ ■ ■ ■ ■

## ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

తెలుగు విశ్వవిద్యాలయం–సాహిత్యపీఠం–బొమ్మూరు – రాజమండ్రి
(శతావధాన ప్రయోక్త)

శ్రీ పైండాన్వయరాధికావిభుని రాశీభూత సౌహార్దరే
ఖాషామ్కుల్యుని సాహితీ ప్రియుని సత్కార్యైకనిష్ఠామతి
శ్రీపారీణునినైక సాంస్కృతికను శ్రీ మత్సభాధ్యక్షశో
భాపూర్ణాంగుని మెచ్చిగాని వరుసన్ వావిప్పనిప్పాటునన్

ఏ మి మహాత్మ్యవంబిది! మహేంద్ర సభంబురుడించి మించె, వా
గ్ధిమహితానుభావ పరిధంగన నాక్కొకప్పచ్ఛకుండును
శ్రామగురుండుగా, బుధవరప్రవరాంచితమై సుధర్మశో
భామహిమన్ వెలార్చె, మన పైండకులుండు మహేంద్రుడై తగన్

తనతమ్ముల్ తన పుత్రులున్ సుగుణ శీలాంశుల్ యధాజ్ఞప్తివ
ర్తనులైయందఱుగూడిరా ! పరిణయోత్సాహంబు దీపింపఁ జం
దనసుప్మేరుడు మేరుధీరుఁడు జమీందారుండు శ్రీరామస
ద్గుణ సంపన్నుఁడు కృష్ణమూర్తి జరిపెం దోరంపుటేర్పాటులన్

అల శ్రీనాథుఁడు మెచ్చురీతిగ సుదాత్తాహారసంభార సం
కలితంబై తగు విందు భోజనముఁ జక్కన్ బెట్టి శ్రీ శర్కరా
కలశంబుల్ సమకూర్చి యెల్లరికిఁ బ్రక్కన్ విల్చి వడ్డించెఁదృ
ప్తులు మిన్నందగఁ బండితప్రతతి మెప్పుల్ మీర దీవింపగన్

ఇంతటి కవితాప్రియుడును
ఇంతటి సౌజన్యమూర్తి యెచ్చటదొరకున్
సంతావకు నెమకించిన
సంతతియుఁ గన్పింపడనుచు సూరులు పొగడన్

ఎఱుజూచిన తానైము
చ్చటగాఁ గన్పించుచుండి సద్యఃస్ఫురణా
బఱుపగుసౌకర్యంబులు
జఱుకునఁ జేయించి మించె సామర్థ్యమునన్

పైడికివిలువనుగూర్పగ
నాడెంబునుదేర్చి చెప్ప నయవిదుఁడనగా
వై.డీ. రామారాయుడు
తోడై పేయూరొనిచ్చెఁ దోయజసఖుడై

జ్యోతుల సీతారాముఁడు
రాతిరియుంబగలు ననక రసికతరూపై
ధ్యాతావధానకపనుఁడు
చేతంబున మెచ్చివచ్చె సెహబాసనరే !

త్రి శ్రీ నామోజ్వలుడై
-ను శ్రీ చెలుగ్రొండ దీని శోభకుఁదానెం
తేశ్రమియించిన యొక్కటి
నాశ్రమతోలగింపగోరి యభినందింతున్

ఇఱువంటిది కనలేదిఁక
విఱువంటిది చూడమనఁగ హేలాపద్యా
ర్చటిరంజిల్లెను గవితో
త్కట సువిధానము శతావధానముజయమై

అవధానంబున నమరిన
కవితా విభవంబు సౌఖ్యకల్పనవిధమున్
నవురునఁ బోటీపడినవి
రవళించెను వాక్కుములల రసనాగ్రమణుల్

కవితామాధురి (జిక్కనైనలుకు పొంకం బెంతయుం జిక్కనై
యవధానంబును జేసితీవు, శతసంఖ్యన్ మించి యే తెంచిపెం
పు వరీక్షించిరి ప్రాశ్నికుల్, సరసతాపూర్ణంబుగా సంస్కృతాం
ధ్రవిశిష్టంబుగ విల్చె నాగఫణిశర్మ ! విన్ను ( గొండాడెదన్

తెలుగుం బల్కులవిచ్చి దత్తపదిగా దింద్రించి గీర్వాణసం
స్తుల(బూరింపుమటన్న – పీదయిన ప్రత్యుక్తిన్ "గజాలున్" శిరః
స్థలముల్ వంచె, "నఖాలు" విల్చునటవే" దంతాలు (గేశాలు నుం
"చిలకల్" బ్రాతియె మండపేట కవియిప్పు! పోయిదాగుండవే!

తెలుగుందోటల(బద్యకావ్య సుమముల్ దీపించునందాకవే
వెలుగున్ రేవెలు(గుండు నంతకును సంప్రీతాత్ములస్మద్బుధుల్
దెలుపన్సత్కవితా రిరంసువుల కందింపన్ ద్వితీయావధా
నలసద్భారతి సాగు(గాక సదసాస్నోంభోధి సాక్ష్యంబుగన్

అతులౌన్నత్య హిమాచలామరధునీ హాసప్రభావైఖరీ
శ్రుతిడిండీర మరాళ చంద్ర ఘన చక్షుఃశ్రోత్ర కర్పూరసం
హతికైరావత మత్కవిత్వశుచి శుభ్రాకార శ్రీకీరభా
రతిపాదాలకు మ్రొక్కి యీ కవన సామ్రాజ్యాన( బేరొందుమా !

(ఇది శీతాంశోరమృతార్పణము)

■ ■ ■ ■ ■ ■ ■

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

"శతావధాని చూడామణి" శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారి సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన రథసారథులు, పండిత పోషకులు, కళారాధకులు, నిరతాన్న ప్రదాతలు, కృతిభర్తలు, దాతృశిఖామణులు నిరాడంబరులు, జమీందారులునైన

## శ్రీ పైండా శ్రీ రామకృష్ణమూర్తి బి కామ్

వారికి సమర్పించు

## అభినందనలు

శ్రీపైండాన్వయరత్నదీధితులు వాసింబొందివాసించు కా
ర్యోపాస్తిన్ విహరించి మించుగుణధుర్యుండార్య భావోన్నతిన్
బ్రాపుల్ గూర్చెడి భాగ్యశాలి విజయస్వాంతుండు వర్థిల్లుతన్
శ్రీ పెంపారిన నిత్యభోగములతో శ్రీరామకృష్ణుండిలన్

సీ॥ ఆఁకలి ద్రోలుచు నాకలి ద్రోలుచు
నాకలు ద్రోలెడి అప్రతిముడు
కంకణరీతుల గంకణరీతుల
గంకణ రీతుల గాంతియుతుడు
అమరుల నమరుల నమరుల నమరుల
నమరుల నలరించు నమలయశుడు
ఆరతులారతు లారతు లారతు
లారతు లారతు లారహితుడు

గీ॥ పలుకు పలుకు పలుకు సతి భాగ్యవరుడు
కలిమి కలిమి కలిమి కల్కి కలికి మగడు
ఆరుగుణము లాఱుగుణములలరువాడు
హిత సుగుణవర్తి 'శ్రీ రామకృష్ణమూర్తి'

అల్లశతావధానకవితామృతవాహిని మున్కలేయుచున్
చల్లగ బుల్కరింపఁగరసాలఫలంబులు పిండివంటలున్
జల్లని తాలవృంతములు చాలిన విందులు గూర్చి తంచు మి
మ్మెల్లరు 'రామకృష్ణ ! నుతియించిరి దిక్కులు మారు మ్రోగగన్

కవిరత్న
కందుకూరి శ్రీ రామచంద్రమూర్తి, కాకినాడ

## శ్రీ ధూళిపాళ మహాదేవమణి

యమ్.ఎ. తెలుగు, యమ్.ఎ సంస్కృతం - భాషాప్రవీణ - విద్యాప్రవీణ
శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత కళాశాల - కాకినాడ.

విద్యల నెల్ల శేషఫణి వేయి ఫణంబుల మోయ వింతయే !
హృద్యతమీరి నాగఫణి హేలగనొక్క శిరానదాల్చెడో !
మద్యరతంబునట్లు ఫణి మస్తకమూపగ గానవశ్యుడై
పద్యము పాడి సూరిఫణి పండిత నాగశిఖాళి నూపెడిన్

భామను కూర్చి విద్దయను భార్యను కానకు బంపెరాముడున్
మామను చీల్చి గోపికల మానము వెన్నలు దోచెకృష్ణుడున్
ధీమణి దివ్యపైండకులదీప వదాన్యుడు రామకృష్ణుడో !
శ్రీమహితుండు వాగ్రమణి సేవల భోజుడు ధర్మ శీలియున్

రామత్వంబున రూపరమ్యత సభాభ్రాజిష్ణుతల్ చాతురుల్
ధీమద్గాఢవచః ప్రబోధనరణుల్ దివ్యత్వమున్ బ్రహ్మతన్
స్తోమంబై మను రూపుదోయి యొకటై సొంపారు వాజ్మూర్తికిన్
రామబ్రహ్మ విశిష్టమూర్తికి నుతుల్ రాజత్ సుధీకీర్తికిన్.

శ్రీపాదంబున శ్రీకిపాదమయిత్రి శ్రీ కాఖ్యతో వెల్గుధీ
వ్యాపారాంకిత రమ్య గేయ కవితా వైశారదున్ శారదా
రూపాలంకృత నైకగద్యకృతి ధుర్యున్ శిష్ట సంకల్ప పే
వాపారీణు శతావధాన విభవవ్యాలంబుగా వెన్నెదన్

వంధీకృత విజమేధా
సింధురుడున్ శతవధాన సేవాధురుడున్
బంధురకార్య విబద్ధుడు
గాంధీ జనబంధుడిద్ద కర్తవ్యుండున్

సీ॥ శారదా సంగీత సాహిత్య కుచదీప్తి
భవ్యమై భద్రమై సేవ్యమయ్యె
ప్రజ్ఞాప్రభాసమై ప్రతిభావికాసమై
ప్రేచ్ఛకప్రతతి నింపలర జేసె
ఆంధ్రీయ గైర్వాణ వాగ్ధునీ రసఝరుల్
భారతీ ధిమి ధిమి ధ్వానమయ్యె
ధారణాతుష్టమై ధీరణ విష్టమై
పూరణ హృష్టమై పుష్టి మీరె

గీ॥ మంద్రమధురోహసందోహ సాంద్రమయ్యె
సభ్య విస్తంద్ర ముఖచంద్రచాంద్రియయ్యె
సకలకవిచంద్ర విబుధేంద్ర సారమగుచు
తనరె నాగఫణి శతవధానమిలను.

— — — —

## ఎందరో మహాను భావులు – అందరికీ వందనాలు

సీ॥ శ్రీరామకృష్ణుండు శ్రీరామమూర్తియు
చినరామచంద్రుండు శ్రీనివాసు
చౌదరి గారిచే యౌదల యూహించి
మల్లాడి స్వామితో మాటలాడి
జ్యోతుల వారితో చేతులు కలిపియు
సత్యనారాయణు సాయమంది
సంచాలకత్వాన సభనెంతొ రంజింప
బేతవోలును తాము పేర్మిపిలిచి
పండిత శ్రేష్ఠుల స్రష్టల గావించి
ఎక్కడెక్కడి నుండొ ఏర్చి కూర్చి
శ్రీ నాగఫణి శర్మ చేతచేయించిరి
మేటి వధానమున్ మెచ్చ జనులు

తే।గీ॥ ఘనులు దాతలు శ్రోతలు కలసి రాగ
మూడు రోజుల వేడుక ముదమొసంగ
అందమైనట్టియనుభూతి నందినాము
అందుకొనరండి మీరు మా వందనములు

బి.యస్. నెహ్రూ
(హెడ్మాస్టర్, శ్రీ పైండా వెంకన్న రామకృష్ణయ్య
ఉన్నత పాఠశాల, ద్రాక్షారామ)



## ఓం శ్రీ పర దేవతాయైనమః
## అభినందన సౌగంధ్యము

శా। శ్రీ మంతుల్, గుణసాగరుల్ సువినయ స్ఫీతాంత రంగుల్ నయ
ప్రాముఖ్యజ్ఞులు, సాహితీ హితమతుల్ పైండాన్వవాయోద్భవుల్,
సామర్థ్యాఢ్య, శతావధానమహమున్ సాగించి వారొప్పగన్,
శ్రీ మాన్యుండు, తదీయ కార్య భరమున్ శ్రీరాముడై, పూనఁగన్!

శా। వైదుష్యాంచిత చాతురీ కలిత సద్వ్యాహార సంపన్నతా
ప్రాదుర్భూత విశిష్ట కావ్య వితతి ప్రాశస్త్య సంభావనీ
యోదారామల కీర్తి పుంజ జనన ప్రోత్సాహితోద్యోగ స
మ్మోద స్ఫూర్తినిఁజేసె నాగఫణి సంపూర్ణావధాన క్రియన్

మ। శత సంఖ్యాధికులైన సత్కవివరుల్, సాహిత్యపాథోనిధుల్
శత పత్రాననసన్నిభుల్ పటు గతిన్, సంధింపఁప్రశ్నా స్త్రముల్,
మతి మంతుండగు మాడ్గులాన్వయుడు, రామబ్రహ్మ సాహాయ్యల్లిన
ద్ధృతి యొప్పారశతావధానమున సాధించెన్, జయశ్రీ నాగిన్.

ఉ। చక్కని భాష దానికివి, సొటిగ నొప్పెడి, గొప్ప భావముల్,
నిక్కపు వర్ణన స్థితియు, నిద్దపు వృత్తులు, మేటివృత్తముల్
మక్కువ నింపు ధారయును, మానక నిల్చెడి ధారణార్థియున్
నెక్కొనజేసె మాడుగుల, నేరుపుమీర శతావధానమున్

చ। కవులకు మూడు నాడులును, గౌరవ మొప్ప నివాస సౌఖ్యమున్,
చవులను మించు, విందు విడి, సత్కృతిఁజేసిన, పైండ వారివిన్,
సువిశదనైజదక్షతను సొంపుగఁజూపిన, కార్య కర్తలన్,.
కవులను మెచ్చగా వలయు మేటివధానము తీరు సొరులన్,

— రచయిత

చోట్నూరు శ్రీరామమూర్తి ," సహజకవి" , అమలాపురం,

• • • • • •

సాహిత్య విద్యాప్రవీణ
సాహిత్య భూషణ – విద్యానిధి – భాషాప్రవీణ
రాష్ట్రభాషాప్రవీణ
డా॥ పన్నాల భట్టశర్మ ఎమ్.ఎ.పిహెచ్.డి పిఠాపురం

కరోతి శ్రీ నాగఫణీ మనీషీ
శతావధానం బహు శాస్త్ర దక్షః
యం ముఖ్యమంత్రి ప్రముఖా అనేకే
సమ్మాన్య ధన్యా వయ మిత్యవోచుః

ఒకచోటన్ గనకాభిషేక మొకచో ఊరేగ అందోళికల్
ఇక ముత్యాల ఝురుల్ ప్రజాప్రభుత వేయింపంగ పెంపెక్కుచున్
చకిత ప్రేక్షక సంభ్రమాప్లుత మహాశతావధానాబ్జకో
రకితా! మాడుగులీయనాగ ఫణిశర్మా! మీసరిన్ లేరిలన్.

శతావధానేన సభాప్రమోదం
కళావినోదంచ శతావధానీ
తనోత్యయం నాగఫణీ కవీశః
శ్రీ శారదానుగ్రహ లబ్ధ కావ్యః

ఒక్కడు కాదు నూరుగురు వొక్కనిచుట్టి సమస్య వర్ణనల్
పెక్కులు చెప్పుడంచు అతి భీషణ భంగుల ఆరడింపగా
ఒక్కడు సింహమై కలభయూథము గాసిని బెట్టు కైవడిన్
చక్కగ జేయు నాగఫణి శర్మయె పెక్కు శతావధానముల్.

సర్వత్ర నాగఫణిశర్మ శతావధానే
ప్రోద్భూత వాదముఖరాః కకుభోభవేయుః
శ్రీపాదవల్లభజగద్గురు దత్త పీనం
కుర్యాత్కవిం శతసమాయుష భాగ్యయుక్తమ్.

• • • • •

## ప్రశంసాపద్య సప్తకం

1. సైందా వంశోద్భవ గుణనిధిం రామకృష్ణార్య వర్యం
సద్విద్యాపోషణ వరమతిం దాన విద్యా సనాథం,
ప్రాక్ప్రంస్కారోద్ధరణ సుధియం సూరివర్గస్య మిత్రం
హంసారూఢా సుఖయతు ముదా సర్వదా కామదా సా।

2. మాడుగులాన్వయాబ్ధి శశి! మాధురులొల్క శతావధానమున్
నేడిట కాకినాడను మనీషులు మెచ్చగ, బుద్ధిసంపదన్
పాడియు వేడియున్ గలుగు పల్కుల సభ్యజనాళి పల్కుపూ
బోడియు నంతరంగమున మోదమునొందగ, జేసితెంతయున్

3. నాగమటన్న నల్లె ఫణినా నొకటేకద! యైనగాని యా
నాగఫణుల్ బుసల్ – విషము నల్గడ జిమ్ముచు భీతిదంబు ఈ
నాగఫణీశు నాస్యమున నవ్వుల జల్లు – సుధామయోక్తియున్
సాగును గావునన్ రసిక సంఘము మోదముతోడ మెచ్చదే?

4. అనమాన ప్రతిభావిశేషధిషణా ప్రారూఢి రాజిల్లగా
రస భావోన్నత మాధురీ వచన పూర్ణంబౌ కవిత్వంబు, నా
రసికానంద విధాయి, నాదమయమౌ రాగ – స్వరాలాప్తి వీ
రస నాగ్రమ్మున నిల్చి, భారతి దయా రాగాలతో నిచ్చుతన్.

5. శ్రీ శ్రీపాద శ్రీరా
మా! శ్రీత్రితయుండ వీవు, మాన్యుడ వై తెం
తో శ్రేయంబుగ నవధా
న శ్రీకార్యము వహించి నాడవు పేర్మిన్.

6. విద్యా పోషణ తత్పరు
విద్యా పరమార్థ తత్త్వ వేది వధానిన్
విద్యా కార్య సుచాలకు
విద్యాధిష్ఠాన దేవి వేడుక గాచున్

7. సంగీత సాహిత్య కళాప్రవీణైః
సర్వేషు- శాస్త్రేషు కృత ప్రయత్నైః!
ఆనంద పీయూష రసాను భావ్యైః
సంవేష్టితా దేవ సభేవ దృష్టా

రచనః—
భాషాప్రవీణ" వారణాసి రాజేశ్వర శాస్త్రి,

"భాషాప్రవీణ" "రాష్ట్రభాషా విశారద"
రేగిళ్ల సత్యనారాయణ శర్మ.



శతావధాని
మాడుగుల నాగఫణి శర్మ
అదనపు కార్యదర్శి

ఫోన్ :230852
ధర్మ ప్రచార పరిష
తిరుమల తిరుపతి దేవస్థానముల
బాలాజీ భవన్ – హైదరాబాద
ది23–6–9

## రసజ్ఞవతంసులు

మహోదారగుణసంపన్నులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి –
జమీన్‌దారుగారికి నమస్కారములు. పుణ్య సంస్కారహృదయా !కుశలమేగదా

కాకినాడలో రసికజనమనోరంజనంగా తామేర్పాటు చేసిన శతావధాన ఆబాలగోపాలాన్ని అలరించింది తమ అమృత కల్పనలో సుసంపన్నమైన కవిత సరస్వతీ సమారాధనం – తాతలనాటినుండీ మీ వంశోన్నతికి – మీ కీర్తికి జయపతా పడుతున్నది

శ్రీ శ్రీ శ్రీ గారి నుండీ– శ్రీ గాంధీ గారి నుండీ వచ్చిన లేఖలను చదవకుండటంతో (యిక్కడ లేనుగదా) అన్నింటికి బదులీయడంలో ఆలస్యమైనది. ఆలస్యంగా వ్రాస్తున్న ఈ కృతజ్ఞతాలేఖను తాము మనసారా మన్నిస్తారని ఆశిస్తున్నాను. పైగ ఈ కృతజ్ఞత చెప్పగానే తీరిపోయే బాధ్యతకాదు కలకాలం గుండెనిండా నిలుపుకోవలసిన అంత గుబాళింపు అంత అద్భుతంగా సభాసంధానం చేసి నా చేత అమృత స్వరూపిణియైన కవితాసరస్వతిని ఆవిష్కరింప జేసినారు ఈ పట్టున వయస్సును –ఆరోగ్యాన్ని సైతం లెక్క జేయకుండా, సంకల్పం చేసిననాటి నుండీ సాఫల్యం పొందేదాకా అనుక్షణం నవయువకులై పరిశ్రమించిన పూజ్యులు శ్రీ శ్రీ శ్రీ గారి పూనిక – వారిని నీడవలె ననుసరించి అవిశ్రాంతిగా – కవిత్వాభిరుచితో అహరహమూ పరిక్రమించిన అయ్యగారి వేంకట శ్రీనివాసరావు – శ్రీ గాంధీ గారి చేరిక – నేనేనాటికీ మరచిపోలేక నన్ను కృతజ్ఞతా వినమ్రుణ్ణి చేస్తున్నాయి. వారికి అండగా మీరుండనే వున్నారు మీరుగాక – శ్రీమంతులైన మీకుమారులు – మీ కుటుంబము అందరూ దత్త చిత్తులై ఒక వైవాహిక శోభతో ఈ కార్యక్రమాన్ని మధురీకరించినారు. పండిత పామరజన మనోరంజకం –అమృతం – శాశ్వతం అయిన కవిత్వాన్ని నాచే పలికించినారు. ఇటువంటి మీకు మీ కుటుంబానికి – నేనేరీతిగా కృతజ్ఞతల

తెలుపుకోగలను !! మౌనంతో ముకుళిత నయనాలతో - ఆ పరమేశ్వరుడు మీకు బహ్మాయురైశ్వర్యభోగాది సకల సంపత్సమృద్ధిని - ఇట్టి సత్కార్యదృష్టిని - సదా ప్రసాదించాలని మనసారా ప్రార్థిస్తున్నాను

మన శతావధాన సౌందర్య ధుర్య మాధుర్యాన్ని శాశ్వతీకరించాలనీ ఆ సారస్వతం అచ్చు వేయించాలని తాము సంకల్పించడం శతధా సమీచీనమైనది ఇదిగో కొన్ని పద్యాలు పంపుతున్నాను. నా మనస్సులో కుసుమించిన ఆ నాటినాభావాలను ఇతరత్రా కొంత వ్యగ్రతతో చెప్పలేక పోయాను ఇప్పుడు చెబుతున్నాను ఇవి ఆనాటివిగా భావించి - స్వీకరించి - అచ్చు వేయవలసినదిగా మనవి

ఆనాటి సభలో విజయసారధిగా విజృంభించి సౌజన్యంతో సంయమనంతో తోడై నిలచిన సద్యశ్చమత్కారవాగ్విలాసి - పండితోత్తంసులు అయిన శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారికి వినయంతో - కృతజ్ఞతలతో అజంలిఘటిస్తున్నాను

ఈ విధంగా ఎంతవ్రాసినా యింకా వ్రాయవలసియున్నట్లు మనస్సు రసబంధుర మౌతున్నది. ఆ సభలో పాల్గొన్న ప్రతి పండిత ప్రకాండ మహాశయునకు సాంజలి బంధ కృతజ్ఞతలు సమర్పించు కొంటున్నాను మీకు చేదోడుగా నిలచి సఫలీకృతం చేసిన వదాన్యులు-పట్టణ ప్రముఖులందరికీ శుభాశంసలు. ముఖ్యంగా సౌజన్యమూర్తులు- సత్కార్యాచరణ వ్రతశీలురు అయిన శ్రీ కె వి ఆర్. చౌదరి గారికి, జ్యోతుల సీతారామమూర్తి, వై.డి రామారావు గార్లకు, శ్రీ గ్రంధి వేంకట రమణగారికి- శ్రీ బదరీనారాయణలునానీగారికీ - సర్వశ్రేయస్సులు కలగాలని వేదనాద స్వరూపిణి అయిన సరస్వతీ దేవి యొక్క మధు మంజీర శింజనీ కలిత చరణయుగళానికి నివేదిస్తున్నాను.

ఇంతటి సౌష్ఠవమైన పరివారబలంతో జగజ్జేగీయమానంగా సర్వసఫలంగా - మహితోదారంగా సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన సదస్సును నిర్వహించిన - మీ మహనీయతకు

మరోమారు అంజలి ఘటిస్తూ సెలవా ! మరి

మీ

**మాడుగుల నాగఫణి శర్మ**



వినోదరత్నాకర, హాస్యభారతి
అమళ్ళదిన్నె గోపీనాధ్ బి.ఎ.,బి.యల్.యస్.,సి ,
3-229/ఎ-2, సోమనాధనగరం, అనంతపురం - 515004

జిల్లా గ్రంధాలయ సంస్థ అవార్డు గ్రహీత తేది 15-5-92
రాఘవరెడ్డి అవార్డు గ్రహీత
అయ్యంకి శతజయంతి అవార్డు గ్రహీత
డా॥ వెలగా వెంకటప్పయ్య అవార్డు గ్రహీత
కళాజ్యోతి స్వర్ణకంకణ సత్కార గ్రహీత
తెలుగు విశ్వవిద్యాలయ, శ్రీకృష్ణదేవరాయ
విశ్వవిద్యాలయ సత్కార గ్రహీత
అధ్యక్షులు : జానపద కళాపరిషత్
కార్యవర్గ సభ్యులు : లలితకళాపరిషత్
సభ్యులు : జిల్లా సాంస్కృతిక మండలి

మాన్యమహోదయ పైండా శ్రీరామకృష్ణమూర్తి గారి
దివ్య సన్నిధికి,

కళాభినందనములతో వ్రాయు లేఖ మీ సహృదయ సౌజన్య ఆదరణ అభిమాన ఆతిధ్యములతో ఏర్పాటయిన మూడు రోజుల పాటి సాహిత్య విందులో పాల్గొన్న మేమంతా ఇల్లూ, వళ్లూ, మైమరచి ఆనందపారవశ్యముతో భువన విజయంలో అందరితో పాటు ఆడి, పాడుకొనగలిగే మహద్భాగ్యము షాకబ్బడము మా సుకృతము. ఇంతటి మరువరాని, మరువకూడని, మరువలేని మహదనుభూతిని కలిగించే చక్కని రసవత్తర సంస్కృతాంధ్ర సంపూర్ణ శతావధాన నిర్వాహకులుగా మీ పాత్ర ఆబాలగోపాలమును ఆకర్షించినది. కాకినాడలో మీనేతృత్వమున ఈ జరిగిన సంపూర్ణ శతావధానము "నభూతో నభవిష్యతి" అన్నట్లుగ ఋజువైనది

మూడు రోజుల పాటు వందలాది కవి, పండిత, గాయక, నట, విమర్శక సకల శాస్త్ర ప్రవీణులైన ఎందరో మహానుభావులను ఒక వేదిక మీదకు చేర్చి వారెల్లరకు

అవసరమైన సకలోపచారసదుపాయములు షడ్రసోపేత పిండివంటలతో విందు భోజనాదులతో సర్వులను సర్వవిధముల తృప్తి పరచిన మీ ఆదరణ అభిమాన ఔదార్యమునకు మా కృతజ్ఞతాభివందనములు.

ఏడు జిల్లాలు అధిగమించి విచ్చేసిన నన్ను ఉభయ గోదావరుల మధ్యనున్న వేత్త పండితుల సరసన కూర్చో బెట్టి నాజానపదకళకు పెద్ద పీటను వేసి గౌరవించి ఆదరించిన కాకినాడ రసహృదయులకు, ఆదరింప జేసిన పైండా వారి వంశీయుల సహృదయతకు నేనెలా కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

మాటలతో వర్ణించలేని నా అశక్తతను వ్యక్త పరచుచూ నా హృదయ పూర్వక సాష్టాంగకళాభి వందనములు స్వీకరించి సదా మీ సౌజన్య సౌహార్దతకు నోచుకొనేవిధంగా మీవాడనుగా భావింప ప్రార్థన.

ఈ సాహితీ యజ్ఞములో మీకన్ని విధములా సహకరించితోడ్పడిన కార్యకర్తలకు ముఖ్యంగా శ్రీపాద శ్రీరామమూర్తి శ్రీ శ్రీ శ్రీ గారికి, అయ్యగారి వేంకట శ్రీనివాసరావు (గాంధి) గారికి సర్వులకు నా కళాభివందనములు

సదా మిమ్ము సందర్శింప గోరు

భవదీయ

అమ్మళ్లదిన్నె గోపీనాథ్

15-5-92.

---

Phone : 383202

*Dr. R.V. Vaidyanatha Ayyar*

JOINT SECRETARY
DEPARTMENT OF EDUCATION, M/HRD
GOVERNMENT OF INDIA R.NO. 120, 'C' WING, 1ST FLOOR
SHASTRI BHAWAN, NEW DELHI INDIA (PIN : 110001)

May 12, 1992

Dear Shri Murthy,

Thank you for inviting me to attend "Satavadhnam" by Shri M.N. Sarma. I wish the function all success.

With best wishes,

Yours sincerely,

*(Dr. R.V. Vaidyanatha Ayyar)*

Shri Pydah Sreerama Krishna Murthy,
Door No. 27-5-7, Buddhavarpu vari Street,
Kakinada - 533 001. (Andhra Pradesh)

• • • • • • •

# శ్రీ నేమాని శ్రీరామ సిద్ధాంతి

వాస్తు రత్న-విద్యావాచస్పతి - దైవజ్ఞరత్న - కనకాభిషిక్త-గజారోహణ - బ్రహ్మరథారూఢ సమ్మానితులు - కాకినాడ

బ్రహ్మకులమండనా! వదాన్య శిరోమణీ! శ్రీ నాగఫణి శర్మ ఆచార్య వర్యా!

ధనిష్ఠా నక్షత్రములో జన్మించుటచే, మీ జాతకమునందలి గురు, శుక్ర చంద్ర బలముచే నవగ్రహములను కరగించి అందలి మాధుర్యమును మా హృదయ చషకాలలో పంచుతున్నారు. ఎంతటి ప్రసన్న మధురము

ఆంధ్ర సారస్వత, వాఙ్మయ పారిజాత దురంధరా! వదాన్య శిరోమణీ! అభ్యుదయ క్రోడమైన తెలుగు సాహితికి కళ్యాణ క్రీడా కాలము ఆసన్నమయినది "శుక్రేణ కవిర్వాగ్మీ, గురుణా సాంబశివే "అనుటచే విద్వజ్జన పరిషత్ రసజ్ఞావర్ణనము చేయుటలో గ్రహధారణ స్ఫురణములనే ప్రతిభ మీ జిహ్వాగ్రమున చిందులాడుట మా భాగ్య విశేషముగదా!

భావనా జగజ్జాకరూకమైన మీ శతావధాన ప్రక్రియ, దైవదత్తమైన ప్రజ్ఞా పాండిత్య బలము. ఆంధ్రీయ కళ అనుటలో సందేహములేదు శివాత్మకమై ఆ దేవి అనుగ్రహము కూడాపొందవలెను గదా!

చిత్ర, విస్తర, మధురాశులీల గవితలే రచియింపగ నేర్చిన మీరు సర్వాంధ్రభావుక సమక్షములో, నానార్థ రత్నమాల స్ఫూర్తి రసభావధ్వని, రసవత్కల్పనము మీకురాస క్రీడవంటిది గదా!

కవిరాజహంసా! స్వర్ణోజ్వల శతతేజిన్యవధాన, పద్యరచనా సంధ జగదాశ్చర్య కరావధానా! మీ కవితా సామ్రాజ్య రమణీయ ప్రక్రియా కళావిష్కరణ సంరంభము సర్వజ్ఞ చక్రవర్తిత్వమునకు నేడే జేజేలు.

• • • • • • •

## సాహితీ బంధు శ్రీ పెంటరామచంద్రరావు

శతావధాని సమ్రాట్, శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారు, తిరుమల తిరుపతి దేవస్థానములోని ధర్మ ప్రచార పరిషత్ యొక్క అదనపు కార్యదర్శిగా యుంటూ, 33 సంవత్సరముల అతిచిన్న వయస్సులో మన దేశములో అనేకచోట్ల శతావధాన కార్యక్రమములు చేసి, రాజకీయ నాయకుల యొక్కయు, పండిత పామరుల యొక్కయు మన్ననలందుకొన్నటువంటి, అనేక ఘనసన్మానాలు పొందినటువంటి మహాపురుషులు కాకినాడ ప్రజలముందు శ్రీ నాగఫణిశర్మ గారు సంస్కృతాంధ్ర శతావధానమును ప్రదర్శించి, కను విందు, చెవులవిందు కావించినారు ముఖ్యముగా శ్రీ నాగఫణిశర్మ గారు కవులు, మహాకవులు అయిన పృచ్ఛక మహాశయులు యిచ్చిన సమస్యలను పూరణముకావించి, సమస్య యిచ్చిన నాటి నుండి రెండు రోజులు గతించిన తరువాతకూడ, ఏకవి సమస్య యిచ్చినదీ గుర్తుంచుకొని చేసిన ధారణ కార్యక్రమములో ప్రదర్శించిన జ్ఞాపక శక్తి అమోఘము.

యికపోతే, - ఈ శతావధాన సభాసంచాలకుల పాత్ర నిర్వహించిన, తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి వారయిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు సామాన్యమయిన వ్యక్తి కాదు. నిజం చెప్పాలంటే - ఈ శతావధానమహోత్సవ సారధులు వీరే శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారు నిజంగా మేలిమి బంగారమే అట్టి మేలిమి బంగారమునకు మెరుగులు దిద్దిన సాహితీ స్వర్ణకారులు శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు. శ్రీ రామబ్రహ్మంగారు ఈ మూడురోజులు సభ నడపడములో తమ అనన్యసామాన్యమయిన ప్రతిభాపాటవాన్ని, వారి స్వతసిద్ధమయిన ఉపన్యాస ధోరణి, వాక్చాతుర్యమును సభకురుచిచూపి, సభను తన్మయం చేసినారంటే అతిశయోక్తి కాదు. నిజంగా శ్రీ నాగఫణి శర్మ గార్కి శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు తగిన జోడు

ఇటువంటి శతావధానమహోత్సవము కాకినాడ ప్రజలు చూచే భాగ్యము కల్గించినటువంటి, అచంచలమైన వితరణగుణము కల్గినటువంటి, నిరతాన్నదాతలుగా పేరెన్నికగన్న శ్రీ పైండా శ్రీ రామకృష్ణమూర్తి జమీందారు గార్కి, యస్.ఆర్.యమ్.టి మేనేజింగు డైరక్టరు శ్రీ కంటిపూడి వీర్రాజు చౌదరిగార్కి, దాతలయిన ఈ శతావధాన ఆహ్వానసంఘ సభ్యులకు నావందనములు.

శతావధాన పాత్ర నిర్వహించిన శతావధాని సమ్రాట్ శ్రీ మాడుగుల నాగఫణి శర్మ గారిని, ఈ శతావధాన సభాసంచాలకుల పాత్ర నిర్వహించిన శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారిని, పృచ్ఛక మహాశయుల పాత్ర నిర్వహించిన సుమారు వందమంది మహాకవులను చూచే భాగ్యము కాకినాడ ప్రజలకు కలిగించినటువంటి శ్రీపైండా శ్రీరామకృష్ణమూర్తి జమీందారు గార్ని అభినందిస్తున్నాను వీరి కుమారులయిన సుబ్రహ్మణ్య జగన్నాధ సత్యప్రసాద్ గార్కి, డాక్టర్ విశ్వనాధ్ కుమార్ గార్కి , యింకా యిందుకు సహకరించిన దాతలందరికి మరొక్కసారి నా ధన్యవాదములర్పిస్తూ, శ్రీ నాగఫణిశర్మ గారు యింకా శతావధాన ప్రక్రియలో ఉన్నత శిఖరాలనధిరోహించాలనీ, యింకా అనేక ఘన సన్మానాలనందుకోవాలనీ, వీరి కీర్తి ప్రతిష్ఠలు దశదిశలా వ్యాప్తి చెందాలనీ, ఆశిస్తూ వీరిని అభినందిస్తూ, ఆశీర్వదిస్తూ సెలవు తీసుకొంటున్నాను

పెంటరామచంద్రరావు

**జాషువా కవిపీఠం, అధ్యక్షులు, కాకినాడ.**

-----

## కవులకు ప్రోత్సాహం లేక అణగారిపోతున్న పాటవం

కాకినాడ, మే 15 (న్యూస్‌టుడే): సరైన ప్రోత్సాహం లేక నేటి కవులలో ప్రతిభా పాటవాలు అణగారిపోతున్నాయని జిల్లా అదనపు మూడవ జడ్జి జగన్నాధులునాయుడు పేర్కొన్నారు స్థానిక తిరుమల తిరుపతి దేవస్థానం కల్యాణమంటపంలో శనివారం నుంచి సోమవారం వరకు జరిగిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన కార్యక్రమం దిగ్విజయంగా ముగిసిన సందర్భంగా శ్రీమాడుగుల నాగఫణి శర్మకు సన్మానం చేశారు ఈః కార్యక్రమంలో ముఖ్య అతిధిగా పాల్గొన్న జగన్నాధులునాయుడు మాట్లాడుతూ అవధానప్రక్రియ చాలా ఖర్చుతో కూడుకున్నది కనుక దీనికి ప్రభుత్వ ప్రోత్సాహం అవసరమని అన్నారు అవధానం నేర్చుకుంటే వచ్చే విద్య కాదని ఇది జన్మతః అలవడాలని అన్నారు శతావధానం అంటే వందమంది పృచ్ఛకుల సమస్యలను, వర్ణనలను, అనువాదాలను, దత్తపదులను తెలుగులో నుంచి సంస్కృతంలోకి, నంస్కృతంలోనుంచి తెలుగులోకి మారుస్తూ పూరించాలన్నారు ఇటువంటి కార్యక్రమాలలో సంపూర్ణ విజ్ఞానాన్ని పొందిన శ్రీమాడుగుల నాగఫణి శర్మను ఆయన అభినందించారు.

సభకు అధ్యక్షత వహించిన సి.ఎన్ గోపీనాధరెడ్డి జిల్లాయస్ పి గారు మాట్లాడుతూ సత్కళలకు పేరు గాంచిన కాకినాడలో ఎంతోకాలానికి శతావధానం నిర్వహించడం ఆనందదాయకమని అన్నారు అవధాన ప్రక్రియలో మేటి అనిపించుకున్న నాగఫణి శర్మ ఆంధ్రదేశానికి , యావత్ ప్రపంచానికి పేరు ప్రఖ్యాతులు తేవాలని అన్నారు. శతావధాన ఆహ్వాన సంఘం అధ్యక్షులు శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి మాట్లాడుతూ నైతిక విలువలను పెంపొందించటానికి ఇటువంటి అవధాన కార్యక్రమాలు ఎంతగానో ఉపయోగపడతాయన్నారు. శతావధాన సభా సంచాలకులు ఆచార్య బేతవోలురామబ్రహ్మం మాట్లాడుతూ ఆశుధార, ధారణాశక్తి, సమయస్ఫూర్తి ఛందోవ్యాకరణాలంకార శాస్త్రాలలో పాండిత్యం, ఉభయ భాషా సాహిత్యాలలో ప్రావీణ్యం ఉన్న శర్మ అభినందనీయుడని అన్నారు. ఈః సందర్భంగా నాగఫణి శర్మకు నూతన పట్టువస్త్రాలను బహూకరించి శ్రీకె.వి.ఆర్ చౌదరి, శ్రీపైండా సుబ్రహ్మణ్య, జగన్నాధ సత్యప్రసాద్, డా॥ విశ్వనాధ్ కుమార్ గారలు సన్మానించారు.

తనకు జరిగిన సన్మానానికి ఆయన ఉచితరీతిని బదులు పలికారు ఎన్ని ప్రదేశాలు తిరిగినా అవధానాలు చేసినా కాకినాడ కవులలో ఉన్న రసజ్ఞత, ఔదార్యం ఇతరులకు లేవనటంలో అతిశయోక్తి లేదన్నారు

ఈ శతావధాన కార్యక్రమంలో పాల్గొన్న పృచ్ఛకులందరికీ ఆహ్వానసంఘం వారు జ్ఞాపికలను బహూకరించారు. సభలో నల్లమిల్లి సత్యనారాయణ రెడ్డి, వై.డి రామారావు, ఆర్.వి ఆంజనేయశర్మ, గోపాల సూర్య భాస్కరరావు, జువ్వనపూడి ఆంద్రూపాల్, అయ్యగారి వేంకట శ్రీనివాసరావు, ఆచార్య బి.వి ఎస్ పాత్రుడు ప్రభృతులు పాల్గొన్నారు ఈ సందర్భంగా నూరుమంది పృచ్ఛకులకు ఆహ్వాన సంఘం సభ్యులు సన్మానం చేశారు.

16 05 92 ఈనాడు

■ ■ ■ ■ ■ ■

# పట్టణంలో మరుపురాని "శతావధాన" సంక్రాంతి పండుగ

• • • • •

సాధారణంగా పుష్యమాసంలో (జనవరి) చలిగాలుల చక్కిలి గింతల మధ్య సంక్రాతి పండుగ ఓ సారి వస్తుంది. అలాంటిది ఈ సంవత్సరం మండే మండుటెండల మధ్య వైశాఖ మాసంలో మరోసారి " సంక్రాతి పండుగ " మన పట్టణానికి వచ్చింది అదీ "శతావధాని సమ్రాట్" శ్రీ మాడుగుల నాగఫణి శర్మ శతావధానం రూపంలో

శనివారం నుండి పట్నంలో మూడు రోజులు జరుగుతున్న శ్రీ మాడుగుల నాగఫణి శర్మ శతావధానం కవిత్వాభిమానులను సంక్రాంతి పండుగకు మించిన పిండివంటలతో కూడిన పసందైన విందును అందజేస్తోంది వంద మందికి పైగా పండితులు, ఉభయ భాషా ప్రవీణులు, అష్టావధానులు సరస్వతీ స్వరూపులైన పృచ్ఛకులతో వేదిక కన్నుల వైకుంఠంలా శోభిస్తోంది మధ్యలో "పుంభావ సరస్వతీ స్వరూపుడై " శ్రీ నాగఫణిశర్మ ఉచితాసనాలంకృతుడై అక్షరలక్షలు విలువ చేసే సంస్కృతాంధ్ర పద్యాలను సమయోచితంగా, ఆశువుగా, అనర్గళంగా గళం నుండి గంగా ప్రవాహంలా వెలువరిస్తున్న విధానం చూసి తీరవల్సిందే. పృచ్ఛకులకు, శతావధానికి అనుసంధాన కర్తగా, అవధాన ప్రక్రియ ప్రయోక్తగా కార్యక్రమాన్ని ప్రజానీకానికి వివరిస్తు, మధ్యలో చెణుకులు విసురుతూ సభను రక్తి కట్టిస్తున్న ఆచార్య బేతవోలు రామబ్రహ్మం ప్రతిభ వేరే వివరించనవసరం లేదు

శతావధాన ప్రక్రియలో సమస్య దత్తపది, వర్ణన, అనువాదాలు ముఖ్య అంశాలు. చమత్కారంతో కూడి,సామా[illegible]సు అసాధ్యంగా కనుపించే సమస్యను శతావధాని ముందుంచగా, దానిని మార్చి సా[illegible]ప్యం చేసి పద్యంలో చెప్పడం "సమస్యా" పూరణం అవుతుంది. పృచ్ఛకులు ఇచ్చిన నాలుగు "పదాలను" పద్యపాదాల్లో అమరుస్తూ, వారు కోరిన ఛందస్సులో చెప్పమన్న భావార్థంతో పద్యాన్ని చెప్పడాన్ని "దత్తపది" అంటారు. రామాయణ, భారతాది పురాణాల్లో ఒక సందర్భాన్ని లేదా పృచ్ఛకుల ఇష్టానుసారం ఒక అంశాన్ని పద్యరూపంలో వర్ణించడాన్ని "వర్ణన" అంటారు. ఇక

అనువాదంలో పృచ్ఛకులు సంస్కృతం, తెలుగులో అడిగిన అంశాలను ఒక దాని నుండి మరో దానిలోకి అనువదించవల్సి ఉంటుంది వీటి మధ్యలో శతావధాని ఏకాగ్రతను భంగం చేస్తూ వారిని ప్రక్కదారి పట్టించడానికి ప్రయత్నం చేసే "అప్రస్తు ప్రసంగీకులు " ఎలానూ ఉంటారు వీరికి సందర్భానుసారంగా "కిలెరిగివాతపెట్టే" విధానంలో "ఛెణుకులు" విసురుతూ ఒక్కో విభాగంలో ఇరవై అయిదు మంది చొప్పున ఉండే పృచ్ఛకులకు వారి వారి అంశాన్ని ఒక్కో పద్యపాదం చెప్పుకుంటూ శతావధాని సాగిపోతారు ఒక ఆవృత్తం పూర్తయ్యాక తిరిగి రెండు, మూడు, నాలుగవ పాదాలు చెప్పడం మూడవరోజున మొత్తం పద్యాలను "ధారణ" చేసి ఒకేసారి వప్ప చెప్పడంతో "శతావధానం" పూర్తి అవుతుంది

ఈ ప్రక్రియలో శనివారం మొదటి పాదాలు అవధాని విజయవంతంగా పూర్తి చెయ్యడంతో ఒక అంశం పూర్తి అయింది. పృచ్ఛకులు కూడా పండితులు, సగం మంది అష్టావధానులు కావడంతో శతావధానం హెూరా హెూరీ గా సాగి, ప్రేక్షకుల వీనులుకు, చక్షువులకు పండుగే అయ్యింది అవధాని కూడా అంతకు మించిన ప్రతిభతో ఆశువుగా పద్యాలను మృదుమధురంగా గానం చేసిన విధానమునకు పట్టణ ప్రజలు పరవశులయ్యారు ఆదివారం కార్యక్రమంలో పద్యాల నాలుగు పాదాల, పూరణం పూర్తవుతుంది సోమవారం ఉదయం "ధారణతో" కార్యక్రమం ముగుస్తుంది మధ్యాహ్నం విజయోత్సవ సభ. అవధాని, పృచ్ఛకుల సన్మానాలతో ఈ బృహత్తర కార్యక్రమం పూర్తవుతుంది ఎప్పుడో ఈ శతాబ్ది ప్రారంభంలో జరిగిన తిరుపతి వేంకట కవుల "శతావధానం" తర్వాత, చాలా సంవత్సరాలకు తిరిగి పట్నంలో ఇటువంటి భారీ కార్య క్రమాన్ని ఏర్పాటు చేసి పట్టణ ప్రజలు తిలకించే అవకాశం కల్గించిన నిర్వాహకులు అభినందనీయులు.



# సాహిత్య అభిమానులకు షడ్రసోపేతవిందు - "శతావధానం"

దాదాపు అరవై సంవత్సరాల తర్వాత కాకినాడ పట్టణంలో శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృతవిద్యాపీఠం ఆధ్వర్యంలో జరిగిన "సంస్కృతాంధ్ర శతావధానం" సాహితీప్రియులకు షడ్రసోపేత విందు భోజనాన్ని మించిన సంతృప్తిని మరపురాని మధురానుభూతిని అవకాశాన్ని కల్గించింది వందమందికి పైగా పృచ్ఛకులుగా ఇటు విజయనగరం నుండి అటు అనంతపురం, హైదరాబాద్ వరకు పండితుల్ని ఎంపిక చేసి, ఏర్చి కూర్చి ఒకే వేదిక పైకి తీసుకువచ్చిన నిర్వాహకులు అభినందనీయులు వీరిలో పలువురు కవులు, పండితులు, డాక్టరేట్‌లు, ఉభయభాషా కోవిదులు, అష్టావధానులు కావడం విశేషం, ఒక్కొక్కరు ఒక్కొక్క "మత్తేభమై" వారి ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించారు "సింహపురి" వాసుడైన శతావధాని శ్రీ మాడుగుల నాగఫణి శర్మ కూడా "పాండిత్య సింహమై" విజృంభించి, తన అద్భుతమైన ప్రతిభతో, వైదుష్యానికి మధుర గానాన్ని జోడించి, పండిత, పామర, ప్రేక్షక హృదయాల్ని దోచుకుని 'జయభేరి" మ్రోగించారు. సమస్య, దత్తపది, వర్ణనలతో పాటుగా అనువాదాన్ని కూడా అవధానంలో చేర్చారు అందులో తెలుగు నుండి సంస్కృతంలోకి, సంస్కృతం నుండి తెలుగులోకి కూడా అనువాదం చేసి, సంస్కృతాంధ్ర భాషల్లో ఒకే సారి అవధానం నిర్వహించి, "శహభాష్" అనిపించుకున్నారు సాధారణంగా శతావధానంలో వుండని "అప్రస్తుత ప్రసంగాన్ని" కూడా నిర్వహించి మెప్పుపొందారు అధిక సమయమ్మం పట్టినా కూడా, ఎక్కడా రాజీ పడకుండా, అపూర్వమైన రీతిలో ఆఖరున అన్ని అంశాలు "ధారణ" చేసి అభినందనలు అందుకున్నారు

మొత్తం మీద అవధానంలో ఇరవయ్ నాలుగు "సమస్యలు" ఇరవై ఆరు "దత్తపదులు" ఇరవై రెండు "వర్ణనలు", ముప్ఫయ్ రెండు "అనువాదాలు" రెండు "అప్రస్తుత " ప్రసంగాలతో "సెంచరీ" దాటించారు శనివారం ఉదయం పది గంటలకు "సమస్యలు" తో మొదలైన అవధానం సోమవారం రాత్రి పది గంటలకు "ధారణ" తో పూర్తి అయ్యింది. కవిత్వమంటే కేవలం "కడుపునిండిన" వారి కాలక్షేపం అనుకునే రోజులు పోయాయంటూ అందుకు నిదర్శనంగా జరిగిన శతావధానంలో "సామాజిక స్పృహ"

తో నిండిన ఎన్నో సమస్యలతో శతావధానం సాగింది. వరకట్న సమస్యలు, విద్యార్థుల సమస్యలు, నాగరికత పెరగడంతో మానవుడు ఎదుర్కొంటున్న కష్టాలు, విద్యుత్ కొరత వంటి ఎన్నో అంశాలు ప్రస్తావనకు వచ్చాయి. దీనికి తోడు చమత్కారభరితమైన సమస్యలు, అందమైన కవితా మధురిమల్ని వెదజల్లే అంశాలు సరేసరి. వీటన్నింటికీ సమయోచితంగా మరింత చమత్కారంగా, పాండిత్య ప్రతిభను రంగరించి, చక్కని పదాల అల్లికతో ఆశువుగా పద్యాల్ని గుప్పిస్తూ శ్రీ నాగఫణి శర్మ అవధానాన్ని దిగ్విజయం చేశారు. ముఖ్యంగా శ్రీ శర్మ పదాల్ని " ట్యూనింగు " చేసుకుంటూ, దానికి తగ్గట్టుగా పదాల్ని కూర్చినతీరుకు రసజ్ఞులు పరవశించారు. ప్రత్యేకించి ఆ పద్యాల్ని తన మృదుమధుర కంఠంతో గానం చేసినతీరు అమోఘం. ఆయన స్వరం మరీమరీ వినాలని పించేలా వుండడం ఆయనకు అదనపు ఆకర్షణ అయ్యింది.

ముఖ్యంగా శతావధాన యాగంలో ఆచార్య బేతవోలు రామబ్రహ్మం ప్రయోక్తగా అనిర్వచనీయమైన పాత్ర పోషించారు. ఒక ప్రక్క శతావధానికి ఉత్సాహం కలిగిస్తూ, అద్భుతమైన కవిత్వం పెల్లుబుకిన ప్రతిసారీ అవధానిని అభినందిస్తూ అవధానికీ పృచ్ఛకులకు మధ్యవర్తిగా పలు అంశాలకు వివరణలిస్తూ కవిత్వానికి అర్థాన్ని ప్రేక్షకులకూ వివరిస్తూ "ఆల్ ఇన్ ఒన్" అయ్యారు. మొత్తంమీద అరుదైన ఈ మహత్తరఅవకాశాన్ని విశేష సంఖ్యలో హాజరైన ప్రేక్షకులు వినియోగించుకుని పట్టణ ప్రజల్లోని రసజ్ఞతను నిరూపించారు.

**ఆర్.పి. మల్యాల**

• • • • • •

# శతావధానంలో సాహిత్య సుమ సౌరభాలు

రామచంద్రపురం, మే 17 (న్యూస్‌టుడే) : లలితకళలలో ప్రథమ స్థానాన్ని అలంకరించిన కవిత్వంలో అవధాన ప్రక్రియకి ఒక విశిష్టస్థానం ఉంది దీనికి ఆద్యులైన వెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి, దివాకర్ల తిరుపతి శాస్త్రి (తిరుపతి వేంకటకవులు) అవధానానికి శ్రీకారం చుట్టారు కాకినాడ పట్టణమేడెనిమిది దశాబ్దాల నాటి ఆ తిరుపతి వేంకటకవుల శతావధానాన్ని గురించి నేటికి కథలుగా చెప్పుకొని కాలం వెళ్ళబుచ్చుతున్న సాహితీప్రియులను ఇటీవల కాకినాడ తిరుమల తిరుపతి దేవస్థాన కళ్యాణమండపంలో స్వర్ణకంకణ విభూషిత శతావధాని సమ్రాట్ మాడుగుల నాగఫణిశర్మ శతావధానం అలరించింది

సమస్య, దత్తపది, వర్ణన, అనువాదం, అప్రస్తుత ప్రసంగం అంశాలతో కూడిన ఈ శతావధానం కేవలం భక్తి శృంగారాలకే పరిమితం కాకుండా సామాజిక స్పృహని ప్రతిబింబిస్తూ సమకాలీన సమస్యలకి అద్దమై నిలిచింది

"రతి పాదాలకు మ్రొక్కి ఈ కవన సామ్రాజ్యాన పేరొందుమా!" అనే సామరస్యంలేని సమస్యని నాగఫణి శర్మ .

**"అమితౌన్నత్య హిమచలామరధునీ హాసత్ప్రభావైఖరీ**
**శ్రుతిడిండీర మరాళ చంద్ర ఘనచక్షుశ్శ్రోత్ర కర్పూర సం**
**హతి కైరావత మత్కవిత్వ శుచి శుభ్రాకార శ్రీ కీర భా**
**రతి పాదాలకు మ్రొక్కి ఈ కవన సామ్రాజ్యాన పేరొందుమా !"**

అని సారస్యంగా పూరించారు భారతి పాదాలకు మ్రొక్కి అనడం సామాన్యమే కాని, ఆ భారతికి వాడిన విశేషణాలు అనన్య సామాన్యమై ఫణిశర్మ శేముషీధురీణతని చూపాయి

"మంచుం గొండలు మండుచున్నవవిగో మాహేంద్రనీలద్యుతిన్" అనే సమస్యని నేటి పరిస్థితులకు అనుగుణంగా పూరించారు

పూటతిండికోసం, కట్టేబట్టకోసం, జీవన పోరాటం సాగిస్తున్న వారు కొందరైతే సమాజాన్ని మోసంతో దోపిడికి గురిచేసి మేడపై మేడలు కట్టే

బడాబాబులింకొందరు - ఈ ఆర్థిక అసమానతల్ని చూసిన గుండెలై మంచున్ కొండలు అంటూ గుండెమంటలను కవి పద్యంలో రగిల్చారు

"కాంచన్ విచ్చలు కూడుగుడ్డలకునై కొల్లాటలేమించగా
చంచత్కాంచన సౌధవీధికలపై సౌధంబు నిర్మించుచున్
చుంచుల్ కొందరు వంచనాఢ్యులవగా చోద్యంబుగా గుండెలై
మంచుం గొండలు మండుచున్నవవిగో మాహేంద్రవీలద్యుతిన్ "

దోపిడీ దారులను చుంచులుగా పేర్కొనడం భావగర్భితంగా ఉంది

"దొంగకు మ్రొక్కినన్ నవవిధుల్ లభియించు శుభమ్ము చేరున్"

అనే విచిత్రమైన సమస్యని "పలు వన్నెలచిన్నెల వెన్న దొంగయౌదొంగకు మ్రొక్కినన్" అని పవిత్రత ఆపాదించి పూరించారు.

హాస్యప్రియుడైన కోటమర్తి నరసింహమూర్తి అవధాని పేరుగుచ్చి ఆవకాయ సీజన్‌లో సమయోచితంగా కూర్చియిచ్చిన

"మాడుగులావఘాటు మన మాడు పగుల్చునె కాకినాడలో " అనే సమస్యని

వీడని షడ్రసనంబులకు వీడుగ మంచి రుచుల్ ఘటింపగా
పాడివి దప్పి తప్పిరసభంగముగా రవళింపబూనవీ
మాడుగులావఘాటు ... ... .. " అని పూరించారు.

పన్నాల భట్టశర్మ ఇచ్చిన అర్థవంతమైన "మత్తేభ సర్పౌనరతాంభజేతే" (ఏనుగు పాము రెండు నరరూపాన్ని పొందాయి ) అనే సంస్కృత సమస్యని

" శ్రీ శారదాస్తన్యయుగ ప్రసన్నాం
శుభ్రాకృతిం ప్రాప్యరస స్వరూపాం
శ్రీ నాగఫణ్యాఖ్య కవిచ్ఛలేన
మత్తేభసర్పౌనరతాంభజేతే "

సమర్థవంతంగా పూరించి నాగఫణి సార్థక నామధేయులయ్యారు

ఇక రెండవ అంశం 'దత్తపది' లో డైమను, కళావరు, ఇస్పేటు, ఆఠకు అనే పదాలిచ్చి భారతార్థంలో పద్యం చెప్పాలని నిర్దేశిస్తే దానికి సరిపడు భారతంలోని మాయాద్యూతాన్ని ఎంచుకొని....

**"అరసి యధర్మ మార్గచరుడై, మనుధర్మమువీడి శ్రీ కళా**
**వరుడగు ధర్మరాజునటు వంచనగెల్చెను జూదమందు ధీ**
**వరులిసి ! పేటులెత్తి భగవన్ ఇటు శాంతము పాపమోయసన్**
**అరకుటిలంపు చేతలకు నంతము లేదయ కౌరవాకృతిన్**

అని చెప్పిన పద్యం చక్కగా వచ్చింది

"హీరో, జీరో, న్యారో, రైరో" అనే సంస్కృతం, తెలుగుకాని పదాలిస్తే వాటిని "హీరోద్దీర్ణ, వాజీరోహణ, ధ్వన్యారోపిత, కంరై రోమితి" అని సంస్కరించి చెప్పడంలో నాగఫణిశర్మ ప్రజ్ఞాపాటవాలు ద్యోతకమవుతాయి దత్తపదుల్లో గట్టిది తణుకు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ వెలువు సత్యనారాయణ శాస్త్రి ఇచ్చారు "మండపేట పోదాం వస్తావా చిలకా " ఇవి అచ్చమైన తెలుగుపదాలు వీటిని ఉపయోగించి అమ్మవారిని ప్రార్థిస్తూ ఓ సంస్కృత శ్లోకం చెప్పాలి ఇదెలా సాధ్యం అనుకున్న శ్రోతలను అద్వితీయంగా శ్లోకం చెప్పి ఆశ్చర్యాంబుధిలో ముంచెత్తారు నాగఫణి శర్మ

**తపో దాంతే భక్తే కురుగురు దయాంతత్హృదయమం**
**డపేటత్వం భగవతి! శివానందలహరీ !**
**శివస్తావానేవ త్వయిగత మహాశక్తి విభవః**
**వయం కేవాస్తోతుం శుభరుచి లకారార్థ విభవేం**

ఇక వర్ణన అంశానికి వస్తే అందులో మచ్చుకి ఒకటి మాటలాడని మొగుడు, కట్నం కోసం సాధించే, వేధించే అత్తమామలు, ఇటువంటి అత్తవారింట్లో ఆరళ్ళు పడే కోడల్ని ఉద్దేశించి నాగఫణిశర్మ చెప్పిన పద్యం హృద్యంగా ఉంది

**" మాటల్ జారని మౌని యొక్కడు మహామాయావి యింకొక్కరై**
**మూటల్ జూచినగాని మూల్గని ధనామోహుండు వేరొక్కడై,**
**బోటీ ! విన్నిటు చుట్టుముట్టుకొనగా భూర్యుగ్రనాగావళీ**
**వాటీ చందనమైతి వీవయిననున్ వాసించు సౌగంధ్యముల్ "**

భయంకర విష సర్పాలవాటిగా అత్తింటిని, ఆ విషసర్పాలచే చుట్ట బడిన మంచి గంధపు ముద్ద (ముగ్ధ) రాలిగా ఆ యింటి కోడల్ని పోల్చి చెప్పిన పద్యం జేజేలు

అందుకుంది 24 సమస్యలు, 26 దత్తపదులు, 22 వర్ణనలు, 32 అనువాదాలు వెరసి 104 ఇవికాక మధ్యేమధ్యే పానీయం అన్నట్లు అనంతపురంవాస్తవ్యులుగా హాస్యభారతి అమళ్ళదిన్నె గోపినాథ్, కాకినాడ ఉపన్యాస చక్రవర్తి బి వి యస్ పాత్రుడు గారల అప్రస్తుత ప్రసంగాలు మొత్తం మీద కాకినాడలో మాడుగుల నాగఫణి శర్మ శతావధానం సంపూర్తిగా సంతృప్తిగా విజయవంతమయింది

రామచంద్రపురం–న్యూస్‌టుడే మే, 17

• • • • • • • •

# Superb satavadhanam

'Avadhanam' is the unique literary feat of Telugus Its hoary past is traced to the age of Tikkana, Pothana and Srinadha Avadhanams are of six kinds such as Swarnavadhanam Ashtavadhanam, Satavadhanam, Netravadhanam, Natyavadhanam and Sahasravadha called 'Pushpavadhanam' is also said to be in vogue With his incredibly profound scholarship, concentration, resourcefulness, retentive memory, presence of mind, wit, repartee, poetic skill, impartiality and assiduous practice, an avadhani handles and proves himself efficient in "Samasyapuranam", "Varnana", prosodic poetry, Nishiddhakshari, Dattapadi, Apiastuta Prasangam, Akasa Purana, Ganitham, Chadarangam, Ghantadhwani, Pushpa Sankhya etc

Madabhushi Venkatacharyulu, Tirupati Venkata Kavulu, Kasi Krishnaacharya, Kopparapu Kumara Brothers, Veluri Siva Rama Sastry, Pisapati Chidambara Sastry, Gadepalli Veera Raghava Sastry, Mandapaka Parvatiswara Sastry are some of the satavadhanis who showed their amazing scholarship, encyclopaedic knowledge and literary genius in the past

Under the auspices of Pyda Satyanarayana Murty, Sanskrit Vidyapeetham a satavadhanam of Madugula Nagaphani Sarma was arranged recently at T T D Kalyana Mandapam, Kakinada Sri Pydah Sree Rama Krishna Murty, President of Samskruta Vidya Peetham & Satavadhanam Reception Committee, has taken Satavadhanam Programme with Personal interest on his shoulders in giving whole financial aid along with the memorable assistance of Secretary Sri Sripada Sri Rama Murty Sri Sri Sri and Sri Ayyagari Venkata Srinivasa Rao (Gandhi)

Sarma is credited with perfoming 250 ashtavadhanams, and nine satavadhanams, The satavadhanam which lasted for three days, brought our Sarma's literary memory, intellectual wit.and repartee, Sarma handled samasya, Dattapadi, Varnana and Anuvadam with ambi-dextiours ease and talent and satisfied the queries of team of a hundred scholars consisting of Viswanadha Satyanarayana, Chamarthi Kanakayya, S. Prabhajana Swamy, Kasibhotla Satyanarayana, Devarakonda Seshagiri Rao, Prabhakara Krishna Bhagawan, Vinjamuri Seshaphani Sarma, Kottapalli Ghana Symala Prasad, Ramakrishna Bharadwaja, B.V.S. Patrudu etc.

The high light of the programme was that Sarma could admirably perform the satavadhanam both in Telugu and Sanskrit. Besides. Sarma Showed a commendable genius in taring slokas into Telugu poems and vice versa. One, however, wished Sarma had completed all the stanzas of a poem on the same day of his satavadhanam and recited all the poems consecutively on the last day Mr. Bethavolu Ramabrahmam, the coordinator, conducted the programme ably.

-- **S. M. KOMPELLA**
Indian Express 31-5-92

## NAGAPHANI SARMA EXCELS IN 'SATAVADHANAM'

Mr. Madugula Nagaphani Sarma, additional secretary of TTD Dharma Prachara Parishad performed "Satavadhanam" recently at Kakinada and thrilled the audience. "Satavadhanam" is a literary feat in which the performing poet known as "Satavadhani" has to answer the querie of a hundred scholars on a variety of subjects. Unless the avadhani is endowed with great memory power, he cannot withstand the onslaught of scholars and come out in flying colours.

Noted scholars have participated including kademalla Varaprasada Satawadhani, Chirravuri Sreerama Sarma, Cheruvu Satyanarayana Sastry and Kothapalli Ganesyamala Prasad Rao. The programme was conducted under the auspices of Pydah Satyanarayana Murthy, Sanskrit Vidyapeetham in the local TTD Devastanam.

This feat was popularised and perfected by the 'duo' Tirupathi Venkta Kavulu in the second and third decades of the century. The performance under review, has four divisions, Samasya, Dattapadi, Varnana and Anuvadam.

Samasya is some what like ariddle in nature. Only the last line of the stanza which outwardly looks rediculous and absurdis given to the poet and the avadhani has to complete the stanza in a meaningful manner to the satisfaction of the prichhaka.

In Dattapadi four words are given and the avadhani has to compose a stanza on the stipulated subject, using the

matter. The four words come in four liner in

an order.

In Varnana, which means description, the avadhani has to compose a stanza on the said subject and satisfy the prichchaka Anuvadham consists of translating poems from Sanskrit to Telugu and vice versa.

Decidedly Satvadhanam is a testing and arduous affair be cause the Avadhani has to compose and recite first lines of the hundred stanzas in the first phrase and second lines of the hundred stanzas in the second phase and so on. Finally he recites all the hundred stanzas answering [illegible] time the irrelevant questions of prichchakas mainly intended to divert the avadhani's attention

Mr. Nagaphani Sarma has acquitted himself creditable by exhibiting his memory power. That he could perform satavadhanam in Sanskrit and Telugu usually done in only one language speaks volumes of his unparalleled scholarship and ingenuity.

Mr. Bethavolu Ramabhahmam. professor of Telugu University, who acted as co-ordinator made the proceedings lively throughout with his withand humour. the participation of eminent litterates like Kandukuri Pedaramachandra Murthy, Janakijani and Ramakrishna Bharadwaja - to name only a few - as prichchakas added lustre to this literary feast. Professor B.V.S. Patrudu and Gopinath entertained the audience with their irrelevant conversation. This was the second of its kind after 60 years.

**C. Mohan Rao**
Deccan Chronicle

శతావధాన శతపత్రము

శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B Com గారికి

బహూకరింపబడిన

శ్రీ పైండా సత్యనారాయణ మూర్తి

సంస్కృత విద్యాపీఠం

జ్ఞాపిక



డిజైనర్

శ్రీ వై. శివాజీరావు M A, M.A, B.Ed.

లెక్చరర్

శ్రీమతి పైండా అండాళ్ళమ్మ జూనియర్ కళాశాల, కాకినాడ

## శ్రీ పైండా సత్యనారాయణమూర్తి సంస్కృత విద్యాపీఠం
## కాకినాడ (రిజిష్టర్డు) స్థాపితం 1967
### కార్యవర్గము

అధ్యక్షులు

1. శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B Com
2. ఉపాధ్యక్షులు శ్రీ పైండారామకుమార్

కార్యదర్శి

3. శ్రీ వడ్లమాని వేంకటరమణ బి.ఎ. బి.యి.

సహకార్యదర్శి

4. శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి - శ్రీ శ్రీ శ్రీ

కోశాధికారి

5. డా॥ పైండా విశ్వనాథ కుమార్ యమ్.బి.బి.యస్.,డి.ఎ.,

సర్వ శ్రీ సభ్యులు

6. శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాధ సత్య ప్రసాద్
7. ఆర్.వి. ఆంజనేయశర్మ
8. మెట్టా వీరభద్రరావు
9. కందుకూరి పెద శ్రీరామచంద్రమూర్తి
10. సామవేదం జానకి రామశాస్త్రి - జానకీ జాని
11. వడ్లమాని వెంకట నగేశ్ శర్మ.

• • • • • •

# శతావధాన ఆహ్వాన సంఘం

**Ex. officio గౌరవాధ్యక్షులు :**

శ్రీ రణదీప్ సూదన్ – (తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు)

గౌరవాధ్యక్షులు :

శ్రీ కె.వి.ఆర్. చౌదరి, యస్.ఆర్.యమ్.టి.
మేనేజింగ్ డైరక్టరు, కాకినాడ.

అధ్యక్షులు :

శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B.Com
పలు విద్యా –సాంస్కృతిక – సాహిత్య – ఆధ్యాత్మిక సంస్థల అధినేత – కాకినాడ

ఉపాధ్యక్షులు :

1 **శ్రీ పైండా రామకుమార్,**
పి యస్ యమ్ సంస్కృత విద్యాపీఠం–ఉపాధ్యక్షులు, కాకినాడ.

2 **శ్రీ జ్యోతుల సీతారామమూర్తి,** మాజీ మున్సిపల్ చైర్మన్, కాకినాడ

3 **శ్రీ నల్లమిల్లి సత్యనారాయణ రెడ్డి,** ప్రముఖ పారిశ్రామిక వేత్త, కాకినాడ

4. **శ్రీ గ్రంధి వెంకటరమణ,** రైస్ మిల్లర్, కాకినాడ.

5. **శ్రీ దంటు సూర్యారావు,** కాకినాడ ఛాంబర్ అధ్యక్షులు, కాకినాడ

6. **శ్రీ వై.డి. రామారావు,** చైర్మన్, సూపర్ బజార్, కాకినాడ

7. **శ్రీ వద్దిపర్తి వీర్రాజు,** రిటైర్డు ఐ టి.ఓ కాకినాడ.

8. **శ్రీ ఆర్.వి. ఆంజనేయశర్మ,** రిటైర్డు ఐ టి ఓ కాకినాడ

9. **శ్రీ గోపాల సూర్య భాస్కరరావు,** అడ్వకేటు, కాకినాడ.

10 **శ్రీ జువ్వనపూడి ఆంద్రూపాల్,** యమ్.ఎ.బి.యి.డి., కాకినాడ

ప్రధాన కార్యదర్శి :

శ్రీ వడ్లమాని వేంకటరమణ, అడ్వకేటు, కాకినాడ

కార్యదర్శి :

మయూరకవి: శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి శ్రీ శ్రీ శ్రీ — కాకినాడ

సహాయ కార్యదర్శులు :

శ్రీ అయ్యగారి వేంకట శ్రీనివాసరావు (గాంధి)

మధుర హృదయ – శ్రీ కంమకూరి చిన రామచంద్రమూర్తి

కోశాధికారి :

శ్రీ గోకవరపు వేంకటేశ్వరరావు పి ఎ కాకినాడ

మరియు ఆహ్వాన సంఘ సభ్యులు

# శతావధాన సారధ్య సంఘము

అధ్యక్షులు

శ్రీ పైండా శ్రీరామకృష్ణమూర్తి B Com

కన్వీనర్లు

శ్రీ శ్రీపాద శ్రీ రామమూర్తి – శ్రీ, శ్రీ, శ్రీ

శ్రీ అయ్యగారి వేంకట శ్రీ శివారావు (గాంధి)

సభ్యులు

శ్రీ పైండా రామకుమార్

శ్రీ పైండా సుబ్రహ్మణ్య జగన్నాథ సత్యప్రసాద్

శ్రీ డా॥ పైండా విశ్వనాథ కుమార్ యమ్ బి బి యస్ - ఏ పి

శ్రీ బదరీ నారాయణబాబునాని

శ్రీ డా॥ కె. కృష్ణమూర్తి

కళాప్రియ శ్రీ పట్నాల రామచంద్రరావు (రాము)

శ్రీ యండమూరి శివాజీ రావు

శ్రీ గణేశుల శివన్నారాయణ

• • • •

# మంగళాశాసనము

మ. కవితా శక్తి యనంతమద్భుత సుసంస్కారానవద్యంబు, దై
వవిపాకంబమునఁగానియబ్బదు భువిన్ వాగ్దేవి! సద్భక్తితో
కవితా వైభవ దీప్తులన్ వెలయు నీకర్పూర నీరాజనా
లివియే సాదర వీక్షణంబుల సదాయీ లోకమున్ సాకుమా

రచన

మధురకవి– శ్రీ శ్రీ శ్రీ